# శ్రీనాథకవితాసమీక్ష

రచయిత

చిలుకూరి పాపయ్యశాస్త్రి

ప్రకాశకులు
ఆకెళ్ల శేషాద్రి
చిదంబర గ్రంథమాల

# ప్రకాశకుని విజ్ఞప్తి



శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు, కాకినాడ ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యాలయమునఁ జిరకాలము వ్యవహర్త (Manager) గాఁ బనిచేసి, సారస్వతవిమర్శనమునందు విశిష్టమయిన యనుభవము నార్జించియున్నవారు. వీరు శ్రీనాథునిరచనలను సవిమర్శముగఁ బఠించి, తత్తత్ప్రబంధములపైఁ బెక్కువ్యాసములను బత్త్రికాముఖమునఁ బ్రకటించుచువచ్చుట యాంధ్రసారస్వతపాఠకలోకమునకుఁ జిరపరిచితమైనవిషయము. శ్రీనాథకవితావిశేషముల నెఱుఁగఁ గోరువారి కయ్యవి యెంతయు సహకరించుచుండుటయు సహృదయవిమర్శకవిదితమైన విషయమే. ఇట్టివ్యాసములన్నియు నేకముఖమున గ్రంథరూపమును ధరింపఁజేసి యాంధ్రుల కందిచ్చుట యాంధ్రభాష కొకప్రత్యేకసేవ కాఁగలదని యెంచి, వారీవఱకుఁ బ్రకటించుచువచ్చిన విషయములనన్నిటిని గ్రంథరూపమున నచ్చొత్తించుటకై, నాకుఁ జిరపరిచితులయిన శ్రీశాస్త్రిగారి నర్థింపఁగా వారందుల కంగీకరించియున్నారు.

శ్రీ శాస్త్రిగా రీవఱకుఁ బ్రకటించియున్నవిషయముగాక, యీనడుమ 'శ్రీనాథుఁడు శృంగారికాఁడు' అను విషయమును నిరూపించుటకై మిక్కిలిగఁ బరిశ్రమించి, అమలా

పురీసాహితీసమితిసభలలో నావిషయమునుగూర్చి ప్రసంగముచేసియుండిరి. అది యాంధ్రపాఠకలోకమున కెంతయు సీమకుఁ జెందిన సారస్వత రహస్యవేత్తల కెంతయు ముదముఁ గూర్చినది. నేనును నా సీమకుఁ జెందినవాఁడ నగుటచే, వారచటఁ బ్రతిపాదించిన విషయము నాంధ్రపాఠకలోకమున కంతకు నందిచ్చుట యావశ్యకమని యెంచి, ముందుగఁ దత్ప్రకటనమునకై యర్థించియుంటిని. దయతో నావిషయము నంతయు సిద్ధము చేసినందులకు శ్రీశాస్త్రిగారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

శాస్త్రిగారి శ్రీనాథకవితాసమీక్ష, అందును బ్రధానముగా 'శ్రీనాథుఁడు శృంగారియా !!' యనునీవిషయము నాంధ్రపాఠకలోకమున కందిచ్చిన, నాకవిసార్వభౌముని యెడ రూఢమైయున్న కళంకము దూరమై, యాతని యెడల సద్భావము గలిగి, ఆంధ్రసారస్వతపాఠకలోక మాతనికవిత్వమునందలి విశిష్టతను గ్రహించి, యభ్యుదయము నందఁగల దనునాశతో నీశ్రీనాథకవితాసమీక్ష నాంధ్రులకరకమలముల కందఁజేయుచున్నాను. దీని నాంధ్రపాఠకలోకము సహృదయతతో స్వీకరించి, తమ సద్భావమును వెలువరించినచో, శ్రీశాస్త్రిగారి రచనల నన్నిటిని క్రమముగ నాంధ్రుల కందఁజేసికొందు నని విన్నవించుచున్నాఁడను.

విశారిసంవత్సరము,
మకరసంక్రాంతి,
కాకినాడ.

ఇట్లు,
ప్రకాశకుఁడు,
అకెళ్ల శేషాద్రి.

శ్రీ శారదాంబాయై నమః

# ఆముఖము



శ్రీనాథుని కవిత్వ మాంధ్రుల కొక మధురభావసమన్వితమైన పవిత్ర ప్రవంతి. అతఁ డాంధ్రజాతీయమహాకవి యనుట నిర్వివాదమైన సత్యము. సాహిత్యవిషయముల నాతఁ డెంత శ్రవణపేయముగా సంతరించిపెట్టెనో, చరిత్రాంశముల నంత సత్యముగాఁ బ్రతిపాదించెను. ఇంచుమించుగ నిరువది వత్సరములనుండి యాతనికృతులను జారిత్రకసమన్వయదృష్టితోఁ బరిశీలించుచుండిన నాకు, క్రమక్రమముగ నాతనిరచనలోని ప్రత్యక్షరము సార్థకము పరమసత్యము నని స్ఫురించుచువచ్చినది. అందును జరిత్రమునకు సంబంధించిన యంశములలో నాతఁడు తనప్రబంధములం దుపనిబంధించిన విషయములన్నియు, నాతని కాలమునందును నంతకు వెనుకముందు కాలములందును బయలువెడలిన శాసనాద్యాధారములకు సరిపడిన వగుటచే నాతనిపలుకులు సర్వథా సత్యము లని నాకనిపించుచువచ్చినవి. అందును భీమేశ్వరపురాణమునం దాతఁడు, తాను ప్రత్యక్షముగఁ జూచి, గ్రంథస్థము చేసిన వివిధ విషయములు నాఁడును నేఁడును యథాతథముగఁ గానవచ్చుట, శ్రీనాథుని వాచాసత్యత్వమును నామనమున మఱింత దృఢము చేసిపెట్టినది.

భీమేశ్వరపురాణము భీమమండలి కొక భౌగోళికమైన రేఖాచిత్రము. ఆచిత్రమునం దాతనిచేఁ డామండలమందుఁ జూపట్టెడి సౌందర్యరేఖ లన్నియు సునిశితముగఁ జిత్రితములయినవి. ఆసౌందర్యమును నా యూహాపోహమినంతవఱకు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక భారతి భీమేశ్వర పురాణముపీఠిక మున్నగువానిమూలమునఁ గొంతకుఁ గొంత యాంధ్రపాఠక లోకమున కందిచ్చుచు వచ్చితిని. దానిని బరికించిన సహృదయులైన విమర్శకుల సాధువాదము, న న్నాతనికృతులను మఱింత యాదరముతో సమీక్షించుటకుఁ బ్రోత్సాహము నొసఁగుచు వచ్చినది. శ్రీనాథుఁడు బెండపూఁడి అన్నామాత్యుని ప్రాపున నీభీమమండలములోని యడుగడుగును బ్రొక్కి—

చూచి, తాను గాంచిన పవిత్రమధురోదాత్తకృత్యముల నన్నిటిని మనకు శిలా ఫలకమునఁ దీర్చి దిద్దిపెట్టినాఁడు. నేను సీభీమమండలిలోఁ బుట్టి పెరిగి యుండుటచే, నాతఁడు త్రొక్కిన చోటులన్నియు నేనును దిరిగియుండు టచే భీమేశ్వరపురాణముతోడను, తదుద్దిష్టమైన వివిధవిషయములతోడను ఘనిష్ఠసంబంధ మేర్పడి యుండుటచే నాతనికృతుల నన్నిటిని సావధాన మతితోఁ బరికించునవకాశ మేర్పడినది. దానితో నాతనికవిత్వమునందలి విశిష్టతనుగూర్చి నాకుఁ దోఁచినయూహలను బత్త్రికాముఖమునఁ బ్రకటిం చుచువచ్చితిని. తన్మూలమున నాకు శ్రీనాథునిపలుకు లన్నియుఁ జారిత్రక సత్యము లనువిషయము రూఢమూల మగుచువచ్చినది. అందును నాతనినాఁడు మధ్యాంధ్రదేశమును ధర్మోత్తరముగఁ బాలించిన రెడ్డిరాజులకు సంబంధించి నంతవఱకు నాతనికృతులు నాల్గింటిలోఁ జూపట్టెడి చరిత్రాంశములు, సూక్ష్మముగఁ బరిశీలించినఁ బరమసత్యము లనిపించినవి. అవి సత్యములగుటను గూర్చి నాకుఁ బొడకట్టిన విషయములను శాసనాద్యాధారములతోఁ బత్త్రి కాముఖమున నీవఱకుఁ దెలుపుచువచ్చితిని.

శ్రీనాథునికృతులకుఁ జరిత్రముతోఁ గలసంబంధము నెఱిఁగించు టలో నాకుఁ బ్రథమమున మార్గదర్శకమైనది. కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు రచించిన శృంగారశ్రీనాథమే. శ్రీనాథునికృతులతో సంబం ధము గలిగిన నావిమర్శనవ్యాసములలోఁ దొలుతటిది, శృంగారశ్రీనాథము నందు శాస్త్రిగారు తెలిపిన సర్వజ్ఞసింగభూపాలనిర్ణయమునకు సంబంధిం చినదియే. శ్రీనాథుఁడు శారదాంబాస్తుతిపూర్వకముగ దర్శించిన సర్వజ్ఞ సింగభూపాలుని గుర్తించువిషయమున, శాస్త్రిగారినిర్ణయమునకు వ్యతిరేక ముగఁ గొంత వ్రాసి, తొలుత వారియాగ్రహమునకుఁ దరువాత వారియను గ్రహమునకును బాత్రుఁడ నైతిని. తరువాత నేను సాగించిన విమర్శనక్రమ ములో, శృంగారశ్రీనాథమునందలిభావములు విశిష్టముగ నామనస్సున నాటుకొనియుండుటచే శ్రీనాథుఁడు శృంగారి యనుభావముతోడనే గూడియుండి, తద్భావోపరక్తచిత్తముతో నచ్చటచ్చట నొండురెండు

వాక్యములు సంతరించియుంటిని. కాలక్రమమున శ్రీనాథునికృతు లన్నిటి మీఁద నాకుఁ దోఁచినయూహలను వెలార్చుచుండ నాతనిరచనలలోఁ జూపఁబడి చరిత్రాంశములన్నియు సర్వథా సత్యము లనునిశ్చయమునకు వచ్చితిని.

రెండేండ్లక్రిందటి సంఘటనము. నాకత్యంతాప్తులైన మిత్త్రులు శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, సుప్రసిద్ధచరిత్రపరిశోధకులు 'ప్రాచీనాంధ్రచారిత్రకభూగోళము-నాడులు' అనువిషయమునుగూర్చి, ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికలో వరుసగ వ్యాసములు వ్రాసి ప్రకటించుక్రమములో కురవాటసీమనుగూర్చి నిరూపించుచు, క్రీడాభిరామమునందలి యీక్రిందిసీసపద్యములోని యుదాహృతినిబట్టి, యాసీమను తమిలేటిపరిసరమున వేంగికి దగ్గఱనుండిన ప్రదేశముగా గుర్తించిరి. ఆపద్య మిది.

సీ. అలకాపురంబున నంగారవర్మఁ డన్
గంధర్వపతికన్య కమలపాణి
ఆదివ్యగంధర్వి కపరావతారంబు
మధుమాళ తోర్గంటిమండలమున
నాసుందరాంగి దక్షారామమునఁ బుట్టు
భువనమోహిని చిన్నిపోతి యనఁగ
నట్టిసత్త్రీజాతి యాసానికూఁతురు
చిరకాలమున సదాశివునిఁ గూడి
పావనం బైన తమిలేటిపరిసరమున
వేంగి కురువాటి కాదేశవిపినభూమిఁ
గోవు లనుపేరి చెంచులకులమునందుఁ
గడిమికత్తెలయమ్మ నాఁ బొడమెఁగలదు.

ఈపద్యమునం దుపనిబద్ధమైన విషయమునుబట్టి, వేంగిపరిసరము నందలిప్రదేశమును కురవాటసీమకుఁ జెందినదిగా మామిత్త్రులు గుర్తించి,

యీపద్యము నత్యంతప్రమాణముగా గ్రహించియున్నారు. క్రీడాభిరామము వల్లభరాయవిరచితముగాని శ్రీనాథవిరచితముగా దని శ్రీదత్తుగారు తెలుపుచు, నీవిషయమునుగూర్చి నాతోఁ బ్రస్తావించిరి. ఆవెంటనే నాకొక యూహ పొడమినది. క్రీడాభిరామము శ్రీనాథవిరచితమే యైనచో నాతఁడు కురవాటసీమను తమిళేటిపరిసరమునందలి వేఁగిసమీపమునకుఁ గొనివచ్చియుండఁడు. వల్లభరాయనిరచన గావుననే యీకురవాటము తమిళేటిపరిసరమునకు వచ్చినది. శ్రీనాథునకుఁ గొంచెము వెనుక అనవేమారెడ్డి రాజ్యపాలన కాలమున, కోరుకొండ రాజధానిగా నుభయగోదావరీతీర భూములను బాలించిన ముమ్మడిరెడ్డికి సంబంధించిన శాసనములందు పెక్కింటిలో 'కురవాటసీమ' నేఁటి తూర్పుగోదావరిజిల్లా - రామచంద్రపురము కాకినాడ తాలూకాలకుఁ జెందిన ప్రదేశముగాఁ బేర్కొనఁబడియున్నది. పెదకోమటి వేమభూపాలునియాస్థానిలో విద్యాధికారిగా నుండి పెక్కు శాసనములకు రచయితయైన శ్రీనాథుఁడు, తనకు సన్నిహితకాలమున గౌతమీతీరభూమిగాఁ బ్రసిద్ధమైయున్న కురవాటసీమను తమిళేటిపరిసరమునకుఁ గొనిపోవుట యసంభవ మనియు, నానాఁటిచరిత్రమునకు విరుద్ధమయిన యంశ మీక్రీడాభిరామమునఁ గానవచ్చుచున్నది గావున, నిది శ్రీనాథవిరచిత మెన్నఁటికిని గానేర దనియు నిశ్చయించుకొంటిని. అంతవఱకును ప్రభాకరశాస్త్రిగారి రచనలలోని విషయమునందు నాకుఁ గల ప్రత్యయముచే క్రీడాభిరామము శ్రీనాథవిరచితమే యనుకొంటిని గాని, యీసంఘటనముతో నాదృష్టి మాఱిపోయినది.

ఈవిధమయినమార్పు నాలో నేర్పడినవెనుక, పలుమాఱు లాక్రీడాభిరామమును బరికింపఁగా, నందలివిషయ మంతయు శ్రీనాథవిరచితము గాదనియు, దానిలోఁ గొన్నిపద్యములుమాత్రమే శ్రీనాథవిరచితము లనియు నాకనిపించినది. తొలుత దానిలోని కొన్నిపద్యములకు శ్రీనాథుని సవరణ గలదేమో యనిపించినది గాని, నిదానముగఁ బరికింపఁగా నందలి నలువది పద్యములు మాత్రమే శ్రీనాథుని వనియు, కడమపద్యము లన్నియు

నాతనివిగావనియు నిర్ణయ మేర్పడినది. దానితోపాటు శ్రీనాథుని శృంగారిశేఖరునిగా నిరూపించుటకు క్రీడాభిరామపీఠికలో శాస్త్రిగారు కూర్చిపెట్టిన యుపపత్తు లెంతవఱకు సరిపడునో, పరికింపవలయు ననిపించినది. క్రీడాభిరామకర్తృత్వమును శ్రీనాథునకుఁ గూర్చిననాఁడే శాస్త్రిగారి దృష్టిలో నాతఁడు శృంగారిశేఖరుఁ డైనాఁడు. తత్కర్తృత్వ మాతనికి లేనినాఁ డాతఁడు శృంగారికూడఁ గాఁ డనిపించినది నాకు. ఆదృష్టితోఁ బరిశీలనకుఁ బ్రారంభింపఁగా, శ్రీనాథుని స్త్రీలోలునిగాఁ దెలుపుటకు శాస్త్రిగారు క్రీడాభిరామపీఠికలోఁ గూర్చిపెట్టిన చాటువు లన్నియు నాతని వగునా? కావా? యనుసందియ మేర్పడినది. శాస్త్రిగారు శ్రీనాథుని శృంగారిఁగా నిరూపింపఁ దలపెట్టిననాఁడు వారి కాతనిరచనలన్నియుఁ దత్సమర్థకములుగా నెట్లు పొడకట్టినవియో, 'శ్రీనాథుఁడు శృంగారి కాఁడు' అని యనుకొనిననాఁడు నాకు నట్లే ఆతనిరచనలన్నిటియందు నాతని యీశ్వరారాధనైకశీలత్వమే గోచరించుచువచ్చినది. అట్టి దృష్టితోఁ బరికింపఁగా శాస్త్రిగారు శృంగారశ్రీనాథమునను, క్రీడాభిరామపీఠికయందును నిరూపించిన యుక్తులు నుపపత్తులు సరిపడనట్లు తోఁచి నన్నీవిమర్శనమునకుఁ బ్రేరేపించినవి.

నేను నాయూహలను గొంతవఱకు బలపఱుచుకొనినవెనుక, నీవికారి వత్సర శ్రావణమాసమున, అనఁగా 1959 ఆగస్టు 15 మొదలు 18వ తేది వఱకు, అమలాపురమునందు నేనీవిషయమును సాహితీసమితిసదస్యులసముఖమున నుపన్యసింపవలసివచ్చినది. అమలాపురిలో గతవత్సరమున బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి యధ్యక్షతతో నారంభమైన యీ సాహితీసభ, ఆంధ్రదేశప్రసిద్ధపండితకవులచే సంభాషణములు గావింపఁ జేయుచు నఖండమగు భాషాసేవ చేయుచున్నది. సహృదయులైన యీ సాహితీసమితిసభ్యుల యాహ్వానము పై, వారిసముఖమున శ్రీనాథుని కవితాశిల్పమునుగూర్చిన నాయూహలను వెలార్చుచు 'శ్రీనాథుఁడు శృంగారి కాఁడు' అనువిషయమున నాకుఁ దోఁచినయుపపత్తులను దెలియఁజేసి

యుంటిని. తన్మూలముగఁ బెక్కురు సహృదయులకు నాయూహలు సరి పడునట్లు తోఁచి, శ్రీనాథుని రచనలనుగూర్చి నాయొనర్చినకృషి నాంధ్ర పాఠకలోకము నెదుట నేకముఖముగఁ బెట్టుట భావ్య మని వారందఱు నన్నుఁ బ్రోత్సహించిరి. అంతకు మునుపు చెదరుచెదరుగ బుద్ధిస్థమైయున్న నాయూహలను గ్రంథస్థము చేయవలయు ననుతొందఱ నాకుఁగూర్చిన దీసాహితీసమితియే గావున, సహృదయులైన యీసాహితీసమితిసదస్యుల కందఱకు సాహృదపూర్వకమైన కృతజ్ఞతను నివేదించుకొనుట నావిధి అంచును తత్సమితికార్యదర్శులై యుండి, శ్రీనాథునికృతు లన్నిటిమీఁద నొకసమగ్రమైన సమీక్ష యత్యావశ్యక మని యీసభాముఖమునఁ దెలిపి, నాయోపినంత కాపని చేయు మని నన్ను వేగిరించుచు, నా కత్యంత ప్రోత్సాహము నిచ్చి, ముందుగ నాచే నీవిషయమును వెలువరింపఁజేసిన శ్రీ మల్లాది గోపాలకృష్ణశర్మగారి. సహృదయతకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. సహృదయులయిన అమలాపురీపౌరుల హృదయపూర్వకప్రోత్సాహమే, వారియెదుట నేను వినిపించిన యీవిషయములను గ్రంథస్థము చేయించినది. అందులకు వారందఱకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

‘శ్రీనాథుఁడు శృంగారి కాఁడు’ అని యనుకొనిననాఁటినుండియు నాతనికవితలో నా కెక్కడఁ బట్టిన నక్కడ నాపరమశివభక్తుని యీశ్వరార్చనకళాశీలత్వమే గోచరించుచున్నది. మఱియు నాతని హృదయము నందుఁ బాదుకొనియున్న ధార్మికనిష్ఠ, సదాచారనిరూపణపరత్వము, మంత్రతంత్రశాస్త్రరహస్యపరిజ్ఞానము, వివిధశాస్త్రములందు నాతనికిఁ గలపాండిత్యము, ప్రాచీనసంప్రదాయరక్షానియతి, వివిధరసభావపరిపాకర్ణనైపుణ్యము, ఔచిత్యనిర్వాహణము మున్నగు నుత్తమకవిలక్షణములు గోచరించుచు వచ్చినవి. తన్మూలముగ నాతని కవితాశిల్పమునందలి ప్రత్యేకతయుఁ గొంతకుఁగొంత పొడకట్టుచువచ్చినది. తత్పురస్కృతమైన దృష్టితో ముమ్ముందుగ శ్రీనాథుని స్త్రీలౌల్యమునకు సమర్థకములై యాతనిపేర లోకమున వెలసియున్న చాటుపద్యములలో నేవి యాతనివి

కాఁదగునో, యేవి కాఁజాలవో, యావిషయమును విభాగించుకొని, యా మీఁద శ్రీనాథుని శృంగారిఁగా నిరూపించుట సరి యగునా? కాదా? యనువిషయమున నాకుఁ దోఁచిన యుపపత్తులను దెలిపియుంటిని. కావుననే 'శ్రీనాథుఁడు శృంగారియా!!' యనుచర్చ ముందును, చాటుపద్యవివరణ విమర్శనము తరువాతను బ్రత్యేకభాగములుగ నిందు జతఁగూడినవి. నా యూహ లెంతవఱకుఁ బరిగ్రాహ్యము లగునో దానిని సహృదయలోకమే నిర్ణయించును గాక.

కాని యొక్కమాట. ఆంధ్రసారస్వతమును గొలఁదిగనో గొప్పగనో చవిచూచినవా రందఱు శ్రీనాథుని శృంగారిఁగానే యెఱుఁగుదురు. అతనిఁ బరమశివభక్తునిగా నెఱిఁగినవారు చాలతక్కువ. అయినను వారివారికి శ్రీనాథునిరచనలను సమగ్రముగాను సద్భావముతోడను జదువుటకుఁగాని, నిష్పాక్షికదృష్టితోఁ బరిశీలించుటకుఁగాని యవకాశము దొరకుట లేదు. ఈవఱకు నాతనికవిత్వపై బయలుదేఱిన విమర్శనగ్రంథము లైనను జాలవఱకుఁ దత్కృతికాలాదినిర్ణయము చేయుపనికే హెచ్చుగ వినియుక్తము లైనవి. అతనిరచనల నన్నిటిని, నిష్పాక్షికమైన దృష్టితో నంతఃపరికరమునుబట్టి పరికించుపని యెంతేనిఁ జేయవలసియున్నది. ఆపనిచేయుటకు ముందుగ నాకవిపై సద్భావ మేర్పడవలయును. అది లేనినాఁ డాతఁడు కేవలశృంగారిగనో, లేక వీరశైవుఁడుగనో, కాదేని వట్టిశాస్త్రపాండిత్యముగలవాఁడుగనో, లేకున్న నసమర్థుఁడుగనో గోచరించును. నేను గావించిన యీ కృషి, ఆంధ్రసారస్వతపాఠకుల యేకొందఱహృదయమునం దైన, పరమశివభక్తుఁడైన శ్రీనాథకవిసార్వభౌముని యెడ సద్భావము గలిగించి, సమ్యగ్భావనతో నాతనికృతుల నన్నిటిని గాని, లేక కొన్నిటిని గాని చదువుట భావ్యమను భావమును గలిగింపఁజాలినచో నది నాయీచేతకుఁ గృతార్థతను గూర్పఁగల దని యాశించువాఁడ.

| | |
|---|---|
| వికారివత్సరము, | ఇట్లు, |
| మకరసంక్రాంతి, | రచయిత, |
| కాకినాడ. | చిలుకూరి పాపయ్యశాస్త్రి. |

# విషయసూచిక

—x—

# శ్రీనాథుఁడు శృంగారియా!!



శ్రీనాథుఁడు 'శృంగారి' యను నపప్రథ యాంధ్రదేశమునఁ జిరకాలమునుండి నెలకొనియున్నది. వెనుకటి కాలమునం దాతఁడు శృంగారి యనఁగా, కొందఱయభిప్రాయమున శృంగారరసభావముల నందముగాఁ గూర్చిపెట్టిన కవి యని, మఱికొందఱయభిప్రాయమున వేశ్యాలోలుఁ డనియు నర్థము. కాళిదాసునకుఁగూడ నట్టి యపప్రథయే గలదు. కాని వారు రచించినగ్రంథములను సద్భావముతోఁ జదివినవారి కామహాకవు లిరువురు నఖండపార్వతీపరమేశ్వరభక్తులు. ఆనాఁడు వారిని శృంగారిగా భావించినవా రెవరును వారివేశ్యాలోలత్వమునుబట్టి, వారిరచనలు దోషజుష్టము లని యెంచుటగాని, వానిని సమగ్రముగఁ జదువకుండుటగాని, వానిని ప్రమాణముగా గ్రహింపకుండుటగాని జరుగలేదు. శ్రీనాథునితరువాత బయలుదేఱిన కవులలో నిన్న మొన్నటివఱకు నాతనికవితారీతి ననుసరింపనివారుగాని యనుకరింపనివారుగాని యెవ్వరును మచ్చునకైనఁ గానరారు.

మఱియు వెనుకటిశతాబ్దులలో వేశ్యాలోలత పారదార్యమువలె దోషాకరము గాదు. ఆనాఁడు ప్రభువులకు ధనికులకు నది పురుషకారముగాఁ జెల్లుచుండెడిది. రసికులైన

కవులకు వేశ్యాసంగతి యుండిన నది పెద్దదోషముగాఁ గణింపఁబడెడిది గాదు. కావుననే శ్రీనాథునిశీలమునుగూర్చి వెనుకటివారి కెవరికి శంక పొడమినట్లులు వినరాదు. ఈవిష యమునకు "నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చుకప్పురపువిడెంబు..." ఇత్యాది పెద్దనగారిచాటువే నిదర్శనము. భారతదేశభాగ్యములలో నొకటిగా స్థిరపడి యున్న పాతివ్రత్యధర్మమును సంరక్షించుటకే, భోగినీజాతి ప్రత్యేకముగ నెలకొల్పఁబడినది. కామోద్రేకము గలపురు షులచే సద్గృహిణులయిాలువులు భంగపడకుండుటకై యీ వేశ్యాజాతి ప్రభవించినది. తన్మూలముగ దేశమున సతీ త్వము కొంత సంరక్షిత మగుచువచ్చినది. కావున నిత్య సువాసినులైన వేశ్యలతోడిచెలికార మానాఁడు దోష భూయిష్ఠమైనదిగా గణింపఁబడినది గానట్లులు తోఁచెడిని.

ఈయిరువదవశతాబ్దిలో పాశ్చాత్యవిమర్శనపద్ధతిని, మనప్రాచీనకవుల కవితావిశేషములనుగూర్చి విమర్శనములు సాగించుట మొదలుపెట్టిననాఁటినుండియు, ఆయాకవుల కవితావిశేషముల నెఱిఁగించుటతోపాటు, వారి శీలాదిక మునుగూర్చి విమర్శించు పరిపాటియు నేర్పడుచువచ్చినది. ఆక్రమమునఁ జర్చ సాగించుట మొదలయినపుడుకూడ శ్రీనాథుఁడు శృంగారిగా గణింపఁబడినాఁడు. ఇప్పు డాతఁడు శృంగారి యనఁగా కేవలము వేశ్యాలోలుఁడేగాక స్త్రీలోలుఁ డుగఁగూడఁ దయారైనాఁడు. వేశ్యాలోలత నాపాదించుటకు

సమర్థకము భీమేశ్వరపురాణమున దక్షారామవిలాసవతీసౌంద
ర్యము నతిమాత్రముగ వర్ణించుట. చాటుపద్యములలో
నానాజాతివనితల సౌందర్యమును శృంగారచేష్టితములను
చిత్రించుట యాతనిస్త్రీలౌల్యమునకు సమర్థకము.

ప్రసిద్ధులయిన ఆంధ్రకవులచరిత్రమును రచియించిన
రచయితలు తమతమశక్తికొలఁది యత్నించి శ్రీనాథునిశీల
మును దీర్చిదిద్దినప్పటి కాతఁడు శృంగారిశేఖరుఁడైనాఁడు.
ఆవిషయము చదువరులలోఁ జాలమందికి ముదమును
గూర్చునదైనది. లోకమున శృంగారభావములు పండిత
పామరచిత్తామోదదాయకములు. అవి వేశ్యాసంగతములు
పారదార్యసంబద్ధములు నైనచో మఱింత చిత్తాకర్షకములై
యుండును. సచ్చరిత్రముకంటె నసచ్చరిత్రము వినుటకు
విందుగా నుండును. కావున శ్రీనాథుని శృంగారిఁగా నిరూ
పించినపలుకులు యుక్తులుకాకున్నఁ బెక్కు రాంధ్రసారస్వత
రహస్యవేత్తల హృదయముల కెంతయు నచ్చినవి. నచ్చు
టయేగాక హృదయమునఁ బాదుపడినవికూడ. కాని యిట్టి
విమర్శనము లవలోకించుటవలనఁ గొంతమందికి కవియెడల
సద్భావము సడలి, యాతనిరచనలను సరిగా నవగతము చేసి
కొను ప్రవృత్తి దూరమైపోయినది. కొందఱు వానిరచనలలో
నెక్కడఁ బుట్టిన నక్కడ శృంగారసూచకములు కలుగా
నుండు ననుభావ మేర్పడి, శృంగారభావసమన్వితములైన
ఘట్టములను మాత్రమే పఠించి, తమయొడలు పులకరింపఁజేసి

కొను కుతూహల మేర్పడినది. మఱికొందఱకు 'శ్రీనాథుని వంటి పరమశివభక్తు నిట్టిశృంగారిని గావించినారే!' యని యనుశయము నాక్రోశము నేర్పడి, కలమెత్తి తీవ్రముగఁ బ్రతివిమర్శనముచేయు నావేశము గలిగించినది. ఇది గత చరిత్రము. కాళిదాసమహాకవిని శృంగారిఁగా భావించి, యాతనికవిత్వమం దెల్లెడల శృంగారము జాలువాఱుచుండు నని యెంచి, శ్రమగొని యాతని రచనలనన్నిటిని జదివిన పాఠకులు సద్భావసమన్వితు లగుచున్నారు. కాళిదాసు వేశ్యాలోలుఁ డనుకొనియుఁ గుతూహలముతో నాతనికృతులను జదువువారికి మధురోదాత్తభావములతో పాటు సత్ప్రవర్తన మలవడుచున్నది. కాళిదాసుని రచనలలో నాతఁ డానూత్రించి పెట్టినది బ్రహ్మానందసబ్రహ్మచారియైన శృంగార రసభావములుగాని, కేవలకుతూహలాపాదకములైన శృంగార భావములు గాదు. కాళిదాసకృతులందువలె శ్రీనాథుని కృతులందును సంయతమై యౌచితీభరితమైన శృంగార రసమే గోచరించును. కాళిదాసవిరచితమైన కావ్యములను బఠించుటవలనఁ జతగూడెడి పార్వతీపరమేశ్వరాలంబనభక్తి భావముతో పాటు, ఉత్తమనీతివర్తన మీతనిప్రబంధములను సద్భావముతోఁ బఠించువారికి నలవడు ననుట నిర్వివాదమైన సత్యము. శృంగారరసనిర్వహణమునఁ గాని, ప్రకృతిసౌందర్యావిష్కరణమునఁగాని సంస్కృతమునఁ గాళిదా సెట్టివాఁడో యాంధ్రమున శ్రీనాథుఁ డట్టివాఁడు.

కవికిఁ గల ప్రతిభావ్యుత్పత్తుల నవగతము చేసికొనవల యునని ముందుగ నాతనియెడ సద్భావ మేర్పడవలయును. అసద్భావ మేర్పడిననాఁడు ఆతనిరచనలోఁ గలవిశిష్టత గోచరింపనే గోచరింపదు. శ్రీనాథుని శృంగారిఁగాను స్త్రీలోలుని గాను గొందఱు విమర్శకులు నిరూపించిపెట్టినంతనే చాల మందిపాఠకుల కాతనియెడల సద్భావము దూరమైనది. సహృదయులైన యాంధ్రసారస్వతవిమర్శకుల హృదయము లలో నెచ్చటనైన శ్రీనాథుఁ డుత్తమకవి కాఁ డనుభావ ముదయించినచో, విమర్శకు లంతకుముందు 'శ్రీనాథుఁడు శృంగారి' యని నిరూపించుటకు నిక్షేపించిపెట్టిన యుక్తులు వారిమనస్సులలో మెలఁగుచుండుటయే దానికి మూలమైన ట్లులు చూపట్టుచున్నది. కాళిదాసుని కావ్యములలో నెచ్చటను నాతనివేశ్యాలోలత వ్యక్తమైనట్లులు చూపట్టదు. నిష్పాక్షికదృష్టితోఁ బరికించిన శ్రీనాథునిరచనయందును నట్టిది యెచ్చటను గన్పట్టదు. కవి వర్ణించుభావము లన్నియుఁ దదనుభూతములే కావలయునను నియమము లేదు. ఉత్తమ కవి తన కలవడిన ప్రతిభావ్యుత్పత్తులచే నెట్టిభావమునైన నాయోజింపఁగలఁడు. వేశ్యాంగనావర్ణనము గావించినంత మాత్రమున శ్రీనాథునకు వేశ్యాలోలత, నానాజాతివనితా సౌందర్యమును జిత్రించినంతమాత్రమున స్త్రీలౌల్యము నంటఁగట్టిన మఱికొందఱకవులకు దాని నతికింపరాదు.

ఆంధ్రసారస్వతమున నేఁటివఱకు బయలుదేఱిన విమర్శనగ్రంథములు చాలవఱకుఁ బాక్షికదృష్టిసంకలితములే.

ఏగ్రంథమునైన విమర్శింప మొదలుపెట్టినపుడు, నంపలి గుణదోషములు రెండిటిని నిష్పాక్షికమైనదృష్టితో నిశిత ముగ విమర్శించుపరిపాటి యింతవఱకు బయలుదేఱలే దనియే చెప్పవచ్చును. కొందఱు శ్రీనాథుఁడు శృంగారి యనఁగా, మఱికొందఱు కా దనుచు వచ్చినారు. ఔనని తెలిపినవారి హేతువులను కాదనువారు ఖండించుట పరిపాటియే గదా! కాని శ్రీనాథునిరచన లన్నిటికి సమగ్రమైన విమర్శనము నేఁటిదనుక బయలువెడలలే దనియే చెప్పవచ్చును. ఇతర భాషలలో నొక్కొకకవివిషయమున నాతనిరచనలపై విమర్శ నాత్మకమైన యుద్గ్రంథములు బయలువెడలుచున్నను, మన యాంధ్రభాషలో నట్టిగ్రంథములు బయలుదేఱకపోవుటకుఁ గారణము, మనసారస్వతక్షేత్ర మతివిస్తృత మగుటయు దానికి వలయుశక్తి లేకుండుటయును. ఏనాఁటికైనను ప్రత్యేకకవిరచ నలపై విపులమైన విమర్శనగ్రంథములు వెలువడునంతవఱకు మన కిట్టి పాక్షికవిమర్శనములు మాత్రము తప్పవు.

శ్రీనాథుని శృంగారిఁగాఁ దొలుత నిరూపించినవారు, కీ. శే. కందుకూరి వీరేశలింగముపంతులుగారు. వారు ఆంధ్ర కవులచరిత్రము మొదటికూర్పులో శ్రీనాథుని స్త్రీలౌల్యమును గూర్చి ప్రసంగింపనేలేదు. ద్వితీయ దణములో నీవిషయ మును ప్రస్తావించినారు. ఆవిషయమును దరువాత కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తాము రచించిన శృంగార శ్రీనాథమునందును, క్రీడాభిరామముపీఠికయందును ప్రపం

చించియున్నారు. వారిరువురు సజీవులైయుండఁగనే వారి యూహలను గొందఱు కాదనినారు. కొందఱౌననినారు. కాదనినవారిత్రాఁత లంతగా గణనకు రాలేదు. ఔనను కొనినవారిమాట లతివ్యాప్తికి వచ్చినవి. దీనివలన ఆంధ్ర సారస్వతవిమర్శన మేపాటియేని యెఱిఁగియున్న వారున్నచో వారందఱహృదయములలో శ్రీనాథుఁడు శృంగారి (స్త్రీ లోలుఁడు) అనుభావమే చాలవఱకు రూఢమై దృఢమూలమై పాదుకొనిపోయినది. దీనిని వదలించుట దుస్సాధమైనపని. కాని శ్రీనాథునివంటి యుత్తమప్రతిభావ్యుత్పత్తిసంపన్నుఁడైన యాంధ్రకవి కేర్పడిన యీకళంకము దూరమైనచో, నాంధ్ర పాఠకలోక మాతనియుత్తమరచనల నాదరముతోఁ జదివి యుత్తమసాహిత్యసంపత్సమృద్ధము కాఁగల దను నాశయ ముతో శ్రీనాథకవిసార్వభౌముఁడు విమర్శకు లనుకొనునట్టి 'శృంగారి కాఁడు' అనువిషయమును నాయోపినకొలఁది నిరూపింపఁ దలపెట్టినాఁడను. సహృదయులైన పాఠకులు సద్భావముతో నాపలుకు లాలకించి, యేది పరిగ్రాహ్యమో, నిర్ణయించుకొందురుగాక యని సవినయముగ నర్థించుచు, నాకుఁ దోఁచినవిషయము నెఱిఁగించెదను.

శ్రీనాథుడు వేశ్యాలోలుఁ డని తలఁచుటకు, భీమే శ్వరపురాణమునం దాతఁడు దక్షారామమును వర్ణించుచుపట్టున నచటి వేశ్యలసౌందర్యము నతిమాత్రముగఁ జిత్రించుట, భీమ నాథునిధూర్తుని జేసి సానివాఁడకుఁ బంపుట యనునివి మూల

కారణములు. ఆమీఁదట 'అక్షయ్యంబుగ సాంపరాయని
తెలుంగాధీశ' ఇత్యాదిపద్యముచే దక్షారామరామాజనము
నొడళ్లపైఁ బూయుటకు కస్తూరీభిక్షాదానము సేయుమని
సంబురాయని తెలుంగురాయని నర్థించుట దాని కుపోద్బల
కము. ఇంతియగాక భీమేశ్వరపురాణకృత్యాదిలో 'కాంచీ
కంకణతారహారకట' కేత్యాదిపద్యమున బెండపూఁడి అన్నా
మాత్యుని వేశ్యాలోలతను గ్రంథస్థముచేసి చిత్రించుట
తదుపష్టంభకము. శ్రీనాథుని వేశ్యాలోలత యతిమాత్రము
గాకున్నఁ తన కుపాస్యదైవమునుసైతము సానివాడ కనిపి
యుండునా? తనకుఁ గృతిభర్తయైన బెండపూడి యన్నా
మాత్యుని వేశ్యాభిరతి నతిమాత్రముగా వర్ణింప సమ
కట్టునా? యని విమర్శకుల యుద్భావన. ఈవిషయమున
విమర్శకులదృష్టిలో దాక్షారామమునందలి రామాజన
మనఁగా, రసికజనోపభోగయోగ్యమయిన వేశ్యాజనమనియే.
శ్రీనాథునిదృష్టిలోను భావనలోను ఆవనిత లందఱు భీమ
నాథసేవాసముపలబ్ధజన్మలయి దేవతోపభోగయోగ్యలయిన
దేవగంధర్వాప్సరోజాతివనితలేగాని మనుష్యభామినులుమా
త్రము గారు. దక్షారామరామాజనమును శ్రీనాథుఁడు భీమే
శ్వరపురాణమునఁ బలుతావుల బహుభంగుల నబ్బురపాటు
గొలుపునట్లు వర్ణించినాఁ డనుట నిశ్చయము. కాని వర్ణిం
చినతావులందెల్ల వారి నుత్తమవంశసంజాతలైన దేవగంధర్వ
జాతికిఁ జెందినవారినిగానే చిత్రించియున్నాఁడు. నిశితముగఁ

బరికించినఁగాని యీవిషయ మెఱుకపడునది గాదు. ఆ క్రమము కొంత వివరింతును.

శ్రీనాథుఁ డఖండశివభక్తుఁ డనుటకు, ఆతఁడు రచించిన ప్రబంధములు—1. పండితారాధ్యచరితము, 2. నైషధము, 3. హరవిలాసము, 4. భీమేశ్వరపురాణము, 5. కాశీఖండము, 6. శివరాత్రిమాహాత్మ్యము ననునవి యగుటయే గాక, ఆయాప్రబంధములకుఁ గృతిభర్తలైన—మామిడి ప్రెగడయ్య, మామిడి సింగన, అవచి తిప్పయసెట్టి, బెండపూఁడి అన్నమంత్రి, అల్లాడ వీరభద్రారెడ్డి, ముమ్మడి శాంతయ్య యను వీరందఱుకూడ నఖండశివభక్తిపరాయణులై వెలయుటయుఁ బ్రబలమైన నిదర్శనములు. ఇట్టి పరమశివభక్తుఁడు తనకుఁ బరమోపాస్యుఁడైన పరమేశ్వరుని ధూర్తవిటునిఁజేసి సానివాడ కర్ధరాత్రసమయమునఁ బంపుటకు సాహసించిన నాఁడు వేశ్యాలోలుఁడు గాక మఱి యేమిగావలయు ననునది సామాన్యముగ నందఱకుఁ దోఁచునట్టి యూహ. భీమేశ్వర పురాణమున దక్షారామపురవర్ణన ప్రకరణమునందలి యీ క్రిందిపద్యము లట్టియూహ గలుగుట కెంతయు సహకరించుచున్నవి.

> ఎనయం గల్గిన మూర్తి భృంగిరిటిఁగానీ తండుఁగానీ నికుం
> భునిఁగానీ కయిదండపట్టుకొని సంభోగేచ్ఛ నంతఃపురాం
> గనలం గన్నుమొఱంగి యప్పురమునం గన్నెలు కాఁచార్చిప్రా
> ద్దున భీమేశుఁడు సానివాడ కరుగుణ్ ధూర్తప్రకారంబునన్.

దక్షారామమునందు భీమేశ్వరుఁడు అనురూపమైన ప్రేమతోఁ దనపరివారములో నివారగు భృంగిరిటినో తండునో నికుంభునో చేయూఁతగాని, సంభోగవాంఛతో, నంతఃపుర స్త్రీలను కనుమొఱఁగి, దృష్టినిరోధకమైన యర్ధరాత్రసమయమున, ధూర్తపద్ధతిని వేశ్యలవాడకుఁ బోవు నని యీ పద్యమున కర్థము. సామాన్యముగ వేశ్యవాటికిఁ బోవు విటులు, ఇంటిలో నుండినతమయిల్లాండ్రను కనుమొఱఁగి యర్ధరాత్రసమయమున గాఢాంధకారములో వేశ్యల యిండ్లలో భోగింపఁ బోవుదురు. ఆక్రమము నిచ్చట భీమేశ్వరునకుఁ గూర్చిపెట్టిన శ్రీనాథుఁడు వేశ్యాలోలుఁడుకాక యెట్లుండు ననునది సాధారణముగ నీపద్యము చెవినిబడిన వారందఱకుఁ బొడమెడి యూహ. ఈయూహ క్రింది పద్యము సమర్థకముగాఁ దోఁచును.

క. పదునాల్గుమహాయుగముల
ముదుకగు భీమేశ్వరునకు మొగచాలై యుం
డదు సానిపెండ్లి యెప్పుడు
నది దక్షారామమహిమ మగునో గాదో!

పదునాలుగుమహాయుగములు గడచినముదుసలియైన భీమేశ్వరునకు సానిని బెండ్లిచేసికొనుట యెన్నఁడును వెగటై యుండదఁట. అది దక్షారామమాహాత్మ్య మగునో కాదో పరికింపు మనినాఁడు శ్రీనాథుఁడు. ఈపద్యములు రెండును ప్రథమాశ్వాసములోనివి. భీమేశ్వరపురాణమునందలి ప్రథ

మాశ్వాసవిషయ మంతయు సంస్కృతమూల మేమియు లేకుండ స్వకపోలకల్పితముగా సాగినదియే. శ్రీనాథునకు వేశ్యాలోలతయే లేకుండిన భీమేశ్వరున కీవిధముగ సాను లతో సంబంధము కల్పింపఁగలఁడా? యని విమర్శకుల కొదవెడు సంశయము. వేఱొకకల్పమున నీపద్యమును బట్టి శ్రీనాథునకుఁ బరమేశ్వరునెడ భక్తిపురస్కృతమైన చన వెట్టిదియై యుండునో యని యేల యూహింపరాదో? పర మేశ్వరుని బరిహాసముసేయఁ జాలినశక్తి యెంతటిభక్తున కుండునో? యని యేల యనుకొనరాదో! కాని శ్రీనా థునిహృదయము నెఱిఁగిన నీసంశయ మిచటఁ బొడముట కవకాశ ముండఁబోదు. శ్రీనాథుఁ డీభీమేశ్వరపురాణము కృత్యాదిలో నీక్రిందిపద్యము గూర్చినాఁడు.

మ. హరచూడాహరిణాంకవక్రతయుఁ గాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్వాఘపయోధరస్ఫుటతటీపర్యంత కాఠిన్యముఁ
సరసత్వంబును సంభవించె ననఁగా సత్కావ్యము ల్దిక్కులఁ
జిరకాలంబు నటించుచుండుఁ గవిరాజీగేహరంగంబులన్.

పరమేశ్వరుని జటాజూటమున కలంకారమైన చంద్రు నియం దుండెడివక్రత, ప్రళయకాలమున విజృంభించు చండికాదేవి కఠినస్తనపర్యంతమునం దుండెడికాఠిన్యము, సరసత్వము జతగూడె ననునట్లు సత్కావ్యములను గూర్చిన నవి కవిపాళీగృహరంగములందు నాట్యముసేయుచుండు నని నాఁడు. శ్రీనాథుఁడు తనరచనలో నేయేకవిశ్వాంశముల

నా యోజింపఁదలఁచునో, వాని కేవియోయొకరీతిని సూచన సేయుచునేయుండును. అందుల కుపక్రాంతమైన దీపద్యము. తనరచనలో వక్రోక్తిచమత్కారము, కాఠిన్యయుక్తపద సంయోజనము జతగూడి, రచనకు సరసత్వము నాపాదించి, కవులరసనారంగమున నర్తనముసేయు భావసంపద యేర్పడి యుండు నని శ్రీనాథుఁ డీపద్యమునఁ దెలిపియున్నాఁడు. తన కవిత్వమునందు 'హరచూడాహరిణాంకవక్రత' యుండు ననుటకు 'ఎనయంగల్గినకూర్మి' యిత్యాది పైపద్యమే ప్రథమోదాహరణము. అది యెట్టులు జతగూడునో పరికింపుఁడు.

దక్షారామమున ప్రాసాదవాసియైన భీమేశ్వరుఁ డేకాంతసేవాభోగార్థమై, ప్రాసాదమునుండి క్రిందికి దిగివచ్చి మాణిక్యాంబాసన్నిధి కేఁగుట యీపద్యమున వక్రోక్తి భంగిలో ధూర్తప్రకారమున వేశ్యవాటి కేఁగుటగాఁ జిత్రింపఁబడినది. దక్షారామ మష్టాదశమహాశక్తిపీఠములలో నొక్కటి. తత్పీఠాధిష్ఠాత్రియైన పరాశక్తి మాణిక్యాంబిక. ఈమె జన్మచే వేశ్యబాలికయై, భీమేశ్వరుని వలచి యాతని సన్నిధిని ప్రేమతో వెలసి సకలకల్యాణదాత్రియైన మూర్తి యైనది. ఈవిషయము భీమేశ్వరపురాణమునందలి యీ క్రిందిపద్యము తెల్లముసేయుచున్నది.

గీ. పృథివిఁ బదునెనిమిది యోగపీఠశక్తి
గణములో నెంచ సర్వశృంగార యగుచు
భీమనాథునిసన్నిధిఁ బ్రేమ వెలయు
మాణికాదేవి సకలకళ్యాణమూర్తి.

మాణిక్యాంబిక వేశ్యబాలికయై జనించి, భీమేశ్వరుని వరించి, తత్సన్నిధిని పరాశక్తియై వెలసినట్లుగు 'భీమేశ్వర దండకము' తార్కాణించుచున్నది. ఆదండకమునందలి యైతిహ్య మిట్లున్నది. మాణిక్యాంబ దక్షారామమునం దొక వేశ్యకు బాలికయై జన్మించి, పెరుగుచుండ నొకప్పుడు భీమేశ్వరుఁడు ప్రతివత్సరకల్యాణమహోత్సవక్రమమునఁ బార్వతీసమేతుఁడై యూరేఁగుచుండును. ఊరేఁగింపునందలి మేళతాళాదులధ్వనులు విని, యీయార్భటియేమని మాణిక్యాంబిక తనతల్లి నడుగఁగా, భీమేశ్వరుఁడు ప్రతిసంవత్సరకల్యాణమహోత్సవమునఁ బార్వతీసమేతుఁడై యూరేఁగుట యనును. ఆవిభవ మంతయుఁ జూచి మాణిక్యాంబిక నేను భీమేశ్వరునే పెండ్లిచేసికొందు ననును. తల్లి వల దని వారించినను వినక, భీమేశ్వరుని వెంట వచ్చి, యాలయమునఁ దత్సన్నిధిని నిలిచిపోవును. ఈవిషయము నెఱిఁగించు భీమేశ్వరదండకము నేను గూర్చిన భీమేశ్వరపురాణపీఠికలో ముద్రితమై యున్నది.* భీమేశ్వరాలయమునఁ బ్రాసాదముమీఁద భీమనాథునిసన్నిధిఁ బ్రేమ వెలయు మాణిక్యాదేవి సకలకల్యాణమూర్తి' యనువాక్య మీయుదంతమును దార్కాణించుచున్నది. ఈవిషయమునే యీక్రింది తృతీయాశ్వాసములోని పద్యము బలపఱుచుచున్నది.

---

* చూ. భీమేశ్వరపురాణము-పీఠిక. పుట ౫౬-౫౭ సరస్వతీ ముద్రణాలయ ప్రచురణము.

సీ. వేశ్య యనుమాట కొక్కింత వెలితి లేదు
భార్య యనుమాట కేమియుఁ బఱపు లేదు
శక్తి యనుమాట కైవారసరణి పెనఁగు
వాసుదేవునియెడ దక్షవాటమందు.

ఈపద్యమున నిరూపితమైన విషయమునుబట్టి దక్షారామమునఁ బరమేశ్వరునకు వేశ్యారూపిణి భార్యాస్వరూపిణి శక్తిస్వరూపిణి యైనమూర్తి యేకాత్మిక యని తెలియ వచ్చుచున్నది. అట్టి త్రిమూర్త్యాత్మికయైనమూర్తి మాణిక్యాంబిక యగుట తథ్యము. అచట భీమేశ్వరు నుపాసించు వారు మాణిక్యాంబాసమేతుఁడైన భీమేశ్వరునే సేవింతురు. కల్యాణాదిమహోత్సవములు మాణిక్యాంబికాసమన్వితుఁడైన భీమేశ్వరునకే జరుగుచుండును. దీనినిబట్టి భార్యారూపిణి శక్తిస్వరూపిణి మాణిక్యాంబిక యగుట సకలలోక విదితము. ఇఁక నామెయే వేశ్యాస్వరూపిణి యగుట యెట్లనిన ప్రత్యేకాదశికి నాయాలయమున జరిగెడి యేకాంతసేవ పరికించిన నావిషయము తెల్లమగును. ఈసేవ యర్ధరాత్ర పర్యవసాయిగా నుండును. ఈసేవ జరుపునపుడు ప్రాసాదవాసిభీమేశ్వరుని సపరివారముగాఁ గ్రిందికిఁ గొనితెచ్చి, ప్రదక్షిణక్రమమున భీమేశ్వరునాలయమును జుట్టి మాణిక్యాంబికాలయమునకుఁ గొనివత్తురు. ఆప్రదక్షిణక్రమములో నెనిమిదియష్టకములు చదువుదురు. ఆయష్టకములం దుద్దిష్టమైన విషయము భోగపురంధ్రికిఁ జెందినదియై యున్నది. ఈయ

ష్టకపద్యపఠనానంతరమునం దీశ్వరునకు మాణిక్యాంబికా సన్నిధిని, పల్యంకికాదిసేవ నెఱపుదురు. ఈసేవాక్రమమును నిరూపించువిషయమునే శ్రీనాథుఁడు భీమనాథుని సానివాడ కనువుటనుగా వక్రోక్తిభంగిలోఁ జిత్రించిపెట్టినాఁడు. ఇట్టి వక్రోక్తిభంగిలోనే యీక్రింది చాటుపద్యముకూడ నడచినది. ఈచాటువు శ్రీనాథునిదే యగుట సకలాంధ్రలోకప్రసిద్ధము.

క. సిరిగలవానికిఁ జెల్లును
తరుణులఁ బదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్ద రాండ్రా?
పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్.

ఈపద్యము గంగాధరుని బరమభక్తిభావముతో జల మర్థించుటకై యుపక్రాంతమైనది. దీనిలో సామాన్యదృష్టికి గోచరించునది పరిహాసము. మఱియు నీపద్యముకూర్పులో కవికిఁ గల యుద్ధతి గానవచ్చును. కాని వక్రోక్తిచమత్కారమునుబట్టి యిందలిభావమును భావనచేసి చూచినచో నింతటి మధురోదాత్తభావసమన్వయము వేఱొకచోట్లఁ గానరాదు. పరమేశ్వరుని భార్యను వదలివేయు మనుసాహస మెంతటిభక్తున కుండునో యోజింపఁదగును. ఈచాటువును బట్టి శ్రీనాథునివక్రోక్తిలో నిమిడియున్న భక్తిభావము నాక ళింపఁగలిగిన సహృదయు లుండినచో, వారికి శ్రీనాథుఁడు భీమనాథుని సానివాడ కనుపుట యన నెట్టిదో గోచరింపఁ గలదు.

భీమేశ్వరుఁడు పదునాల్గుమహాయుగములు గడచిన ముదుక యను విషయమునుగూడ నీక్రిందిసీసపద్యమున వ్యంగ్యభంగి నిట్లు చిత్రించిపెట్టినాఁడు.

సీ. ఒకవేళ ధరియించు యవనాశ్వుఁ డిచ్చిన
కట్టాణిముత్యాల కంఠమాల
మాంధాతృఁ డిచ్చిన మాణిక్యఖచితకే
యూరంబు ధరియించు నొక్కవేళ
నిక్ష్వాకుఁ డిచ్చిన హీరాంకురంబుల
యుంగరంబు ధరించు నొక్కవేళ
ఘనచక్రవర్తి యిచ్చిన ప్రవాళంబుల
యొడ్డాణము ధరించు నొక్కవేళ
వేడ్క ధరియించు నొక్కొక్కవేళయందు
భరత దుష్యంత రంతి నాభాగ నహుష
నల భగీరథ నృగ మహీనాథదత్త
హేమమణిభూషణములు మహేశ్వరుండు.

ఈవిధముగ వెనుకటి వెనుకటియుగములలో ధార్మికులై ప్రసిద్ధికెక్కిన చక్రవర్తు లర్పించిన హేమమణిమౌక్తిక ప్రవాళాది విభూషణములను భీమనాథుఁడు ధరించుచుండె ననుట, యాతఁడు యుగములు గడచిన ముదుకఁ డని వ్యంగ్యభంగిని నిరూపించుటకే. ఇట్టి భీమేశ్వరునకు సానిపెండ్లి యనఁగా మాణిక్యాంబికతోఁ బ్రతిసంవత్సరకల్యాణము, వెగటై యుండ దనుట. అనఁగా నిచట సానిపెండ్లి పరాశక్తితోఁ బరమేశ్వరయుక్తిగా గ్రహింప నగును. సామాన్యదృష్టి కింతవఱకు నూహ పొడముట సాధ్యము గాదు.

ఈపద్యమున కనుపదమునందే దక్షారామభీమేశ్వరుని భోగవైభవము నిట్లు చిత్రించి పెట్టినాఁడు.

సీ. గజచర్మ మెన్నఁడో గాని నిచ్చలుఁ గట్టుఁ
బసిఁడికమ్ముల పట్టుపచ్చడంబు
భసిత మెన్నఁడో కాని ప్రతిదినంబు నలందు
మలయజంబు కురంగమదము గూర్చి
నిడుదపాములరాజుతోడవు లెన్నఁడో కాని
తారహారములు నిత్యము ధరించు
నృకరండగుండమాలిక లెన్నఁడో కాని
ధరియించుఁ గల్హారదామ మెపుడు
కాటునడుచక్కి నెన్నఁడో గాని యుండు
దక్షవాటి సువర్ణసౌధములమీఁద
నెన్నఁడో పిశాచులను గాని యిందుముఖుల
నెల్లకాలంబు దలఁచు భీమేశ్వరుండు.

ఇప్పుడు దక్షవాటిలో మహావిభవసమన్వితుఁడైన భీమేశ్వరుఁడు గజచర్మ మెన్నఁడో తాల్చునుగాని, యెల్లప్పుడును బంగారు జరీయంచుల పట్టువస్త్రములను దాల్చును. భస్మ మెన్నఁడో పూసికొనునుగాని ప్రతిదినము కస్తూరి మేదించిన చందనమునే పూసికొనును. సర్పాభరణముల నెప్పుడోగాని, నిత్యము ముత్యాలహారములు దాల్చును. ఎన్నఁడో పుర్రెలమాల వైచుకొనునుగాని యిపు డెప్పుడును పద్మమాలికలనే ధరించును. శ్మశానమధ్యమునం దెప్పుడో గాని, దక్షారామలోని బంగారుమేడలయందే యిపుడు విహరించును. తనపరిచారికలనుగా పిశాచస్త్రీల నెన్నఁడోగాని

యిపు డెల్లపుడు చంద్రముఖులనే తలఁచుచుండును. అనఁగా నిపుడు స్వసేవికలుగా నుండఁ దలపోయుచున్నాఁ డని భావము. ఈతుదివాక్యమే దక్షారామమునందు భీమేశ్వరుని సేవికలు విబుధగంధర్వాప్సరోజాతిసంభవలైన చంద్రముఖు లనుట కుపశ్రుతి. వారు భీమనాధునకు సార్వకాలిక సేవా సంపత్తికై దేవేంద్రునిచే నర్పింపఁబడిన దేవవేశ్య లగుటచే, తద్భావనతోడనే దక్షారామరామాజనము నతిమాత్రముగఁ జిత్రించినాఁడు.

శ్రీనాథుఁ డీభీమేశ్వరపురాణప్రారంభమున దాక్షారామవాసినులైన వేశ్యల నతిమాత్రముగా వర్ణించుటయు నాతని వేశ్యాలోలతకుఁ బ్రబలమైన నిదర్శన మని పెక్కురు విమర్శకుల యూహ. హెచ్చుగ వర్ణించినమాట నిశ్చయమే. కాని యావేశ్యలందఱుఁ బురందరవిశ్రాణిత దేవతాభువనగంధర్వాప్సరోజాతివనితలే గాని మానవస్త్రీలు మాత్రము గారు.

గీ. చందురునితోడఁ గల్పవృక్షంబుతోడఁ
దారతో లక్ష్మితో నమృతంబుతోడఁ
గౌస్తుభముతోడ మున్నిటఁ గలిగినారు
విబుధగంధర్వజాతు లప్సరసతులు.

మఱియు 'కాంతిసంపద నేల కైవార మొనరింప' ఇత్యాది సీసపుటెత్తుగీతిలో—

గీ. సంభవించిరి గంధర్వజాతి ననినఁ
గలితనం జేల పెన్నాటకంబు నేయ
ననఁగ భీమేశ్వరుని గొల్తు రప్పురమున
సాను లనుపేరి యప్సరశ్చంద్రముఖులు.

ఈపైవాక్యములనుబట్టి దక్షారామమునందలి వనితామణు లందఱు దేవగంధర్వాప్సరోజాతికిఁ జెందిన వనితలనియు, వారినే సాను లని యందు రనియుఁ దెలియవచ్చుచున్నది. సాను లనుపేరు గల యీయప్సరోవనితామణులు భీమేశ్వరుని సేవింతు రనియు నెఱుఁగవచ్చుచున్నది. మఱియు నీవేశ్య లందఱు దేవేంద్రునిచే భీమేశ్వరునకు సార్వకాలికసేవ యొనర్చుట కొసఁగబడినట్టు లీక్రిందిపద్యములు తార్కాణించుచున్నవి.

గీ. గీతవాదిత్రనృత్యంబు కేవలంబు
శంభునకు సర్వకాలంబు సంభవింప
నప్సరస్త్రీల నర్పించె నాఱునూఱు
బాలలను యువతులను జంభభంజనుండు. —భీమ. 6-77.

శా. ఆవంశంబున సానికాఁతు లనుదివ్యస్త్రీలు ముగ్ధాబ్ధిమ
ధ్యావిర్భూతలు మీనకేతనుని దివ్యాస్త్రంబు లెక్కాలమున్
సేవాదక్షతఁ గొల్తు రిందుధరునిన్ శ్రీదక్షవాటీశ్వరం
గైవల్యాధిపు భీమనాథు విలసత్కారుణ్యపాథోనిధిన్.
—భీమ. 6-78.

అట్టి యీయప్సరశ్చంద్రముఖుల నామరూపసౌందర్యాదికము నభివర్ణించుచు వారలు నెఱపు సేవాక్రమము నీక్రిందివిధముగ వివరించియున్నాఁడు.

"ఉత్తమనాయికానాయకగర్భసంజాతలైన యాసా
నులు సానురాగంబున నీశానుని భీమేశ్వరుని ఘుసృణముకు
ళితాపాంగంబులు కుంచితాకుంచితభ్రూలతంబులు విస్మయో
త్పాదనతానకంబులు ప్రసన్నంబులు ప్రేమరసపూర్ణప్రపా
వృతారంభంబులు సవలలితంబులు పులకావళికాభరణంబులు
భావజగర్భితంబులు విస్మృతనిమేషంబులు నైనవీక్షణంబులఁ
దదీయలావణ్యపూరం బాస్వాదించువిధంబున నభిలషించుట
దెల్పుచందంబున హృదయంబు నాకర్షించుచాడ్పునఁ,
జామర వ్యజన పీటికాకరండ పాదుకా ముకుర దీపికా
సంగీత నాట్యాద్యుపచారసేవావిశేషంబులఁ బ్రతిసంధ్యం
బును బల్యంకికాసేవా బహిర్విజయాది భోగావసరసమయం
బున సేవించుచుందురు."

దీనినిబట్టి దేవేంద్రునిచే నొసఁగఁబడిన యాయప్సర
శ్చంద్రముఖులనే శ్రీనాథుఁడు సానులుగాఁ బేర్కొనినట్టు
లును, వారు భీమేశ్వరవివిధసేవాక్రమము నెఱపుటయే
ప్రధానవృత్తిగాఁ గలవారనియుఁ దెలియవచ్చుచున్నది.
ఈవిషయమునకే కాశీఖండమునందలి యప్సరోలోకవర్ణ
నమునందలి యీక్రిందిపద్య ముపోద్బలకము. శివశర్మకు
విష్ణుదూత లాలోకవృత్తాంతము నెఱిఁగించుప్రకరణ మిది.

గీ. మహితభక్తి నేభామల మనుమరాంద్ర
దక్షిణానందవనమహాస్థానపతికి

భీమనాథేశ్వరునకు సుత్రాముఁ డిచ్చె
ననఘ! వీరు సుమ్మ యయ్యప్సరసలు.

దీనినిబట్టి శ్రీనాథునిభావనలో నప్సరస లనఁగా భీమేశ్వరసేవావినియుక్తసర్వస్వ లనియు, దక్షారామవేశ్యాజన మంతయు దేవేంద్రునిచే భీమేశ్వరున కర్పింపఁబడిన దేవగంధర్వాప్సరోజాతికిఁ జెందినవారే గాని మానవభామినులు గాని, మానవోపభోగయోగ్యలుగాని కారనియుఁ దెల్లమగుచున్నది. ఈవిషయమును క్రీడాభిరామమునందలి యీక్రింది పద్యముకూడ ధ్రువపఱచుచున్నది.

సీ. అలకాపురంబునం దంగారపర్ణుఁ డను
గంధర్వపతికన్య కమలపాణి
యాదివ్యగంధర్వి కపరావతారంబు
మధుమావ తోర్గంటిమండలమున
నాసుందరాంగి దక్షారామమునఁ బుట్టు
భువనమోహిని చిన్నిపోతి యనఁగ
నట్టి సత్ స్త్రీజాతి యాసానికూఁతురు
చిరకాలమున సదాశివుని గూడి
పావనంబైన తమిలేటిపరిసరమున
వేంగి కరువాటి కాదేశవిపినభూమిఁ
గోవు లను పేరి చెంచులకులమునందుఁ
గడిమికత్తెలయమ్మ నాఁ బొడమఁగలదు.

ఈక్రమమునుబట్టి చూచినను దక్షారామమునందలి సానులు గంధర్వజాతికిఁ జెందినవా రనియు, నచటి వేశ్యలు భీమనాథోపభోగయోగ్య లనువిషయము సువ్యక్తమగు

చున్నది. మఱియు నీగంధర్వజాతివనిత లందఱు నుత్తమ
సౌందర్యవతులై తమగాంధర్వవిద్యాపాటవము ప్రదర్శించుచు
భీమనాథు నారాధించుక్రమము నీతీరుగఁ జిత్రించి పెట్టినాఁడు.
దక్షారామమునందలి సాని మహోత్సవసమయమునం దీశా
నీవేషము దాల్చి వీథిలో భిక్షాటనము సేయునప్పటి యామె
సౌందర్యము నెంత మనోహరముగ సృష్టించినాఁడో పరి
కింపుఁడు.

సీ. విరులదండలతోడి వేణికాభారంబు
పొంకంబు పిఱుఁదులఁ బొరలియాడ
మణితులాకోటికోమలఝుణత్కారంబు
రవళిమట్టెలమ్రోఁత యవఘళింపఁ
గుదురునిండిన చిన్నిగుబ్బచన్నులమీఁద
ముత్యాలత్రిసరంబు మురువుసూప
కలమానతాటంకవజ్రాంకురచ్ఛాయ
లేఁతవెన్నెలఁ బుక్కిలించి యుమియ
సాని యీశానియై మహోత్సవమునందుఁ
గేల నవచంద్రకాంతంపుగిన్నె పూని
వీథి భిక్షాటన మొనర్చువేళఁ జేయు
మరులనృత్యంబు జగముల మరులుగొలుపు.

గాంధర్వవిద్యయం దారితేరిన యాసానులు తమ కలు
వడిన నృత్యాదికము నెఱపుచు భీమనాథుని సేవించువా రని
యీపద్యమునుబట్టి తెలియవచ్చుచున్నది. వివిధాభినయము
లచే మఱికొంద ఱాభీమేశ్వరుని సేవించుచుండినక్రమము
గూడ నీప్రకరణమున శ్రీనాథుఁడు వివరించియున్నాఁడు.

ఈతీరయిన భీమేశ్వరపురాణమునందలి వేశ్యాంగనా వర్ణనక్రమమును సద్భావముతోఁ దిలకించిన శ్రీనాథునకు దక్షారామమునందలి వేశ్యలతోడి వైషయికబాంధవ్య మేపాటియు గోచరింప దనియే యెఱుఁగనగును. శ్రీనాథునకు దాక్షారామవేశ్యలతోడి చెలికారము గల దని నిర్ధారించుట కీక్రిందిచాటువు ప్రబలనిదర్శన మని పెక్కురు విమర్శకుల యూహ.

శా. అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము సేయురా! సుకవిరాడ్బృందారకశ్రేణికిన్
దక్షారామపురీవిహారవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసింపఁ దద్వాసనల్.

ఈపద్యమున ప్రభాకరశాస్త్రిగారు 'శ్రేణికిన్' అను చోట 'స్వామికిన్' అనియు 'పురీవిహారవర' అనుచోట 'చళుక్యభీమవర' అనియుఁ బాఠములు కూర్చి, అర్థవివరణము నిట్లు చేసియున్నారు. "శ్రీనాథునికి వైషయికవాంఛ లత్యున్నతములు. భోగపరాయణత మెండు. ప్రౌఢనిర్భరవయఃపరిపాక కాల మగుటచే నాతఁ డప్పుడు శృంగారరససముద్రమునఁ దెప్పఁదేలుచున్నాఁడు. దాక్షారామాప్సరోరామల యొడళ్ల పయి బుగబుగ లొప్పొగలుట కని తెలుంగురాయనిఁ గస్తూరి కోరినాఁడు. ఏమి కోరిక!! ఉచ్చైర్దశ నుండువారి కప్పు డిట్టి యచ్చరలచెలికారము గౌరవము నింపుచుండెడిది గావలయు! పయిచాటువు శ్రీనాథునిది కాకపోవచ్చు ననుటకు

వలనుపడదు. అక్షయ్యేత్యాదిపద్యమువంటి దింకొకపద్యము 'క్ష' ప్రాసముగలది కాశీఖండమునఁ గలదు. "ఈక్షోణిక్షి నినుఁ బోలు సత్కవులు" ఇత్యాదిపద్య మది. దానిలో 'దక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ' యని గల దు. ఆపోలికనుబట్టి యీచాటువున 'చళుక్యభీమవర' అను పాఠము గైకొనఁబడినది. 'శ్రేణికిక్ష' అనునది శ్రీనాథున కతికించుట కడ్డము వచ్చినట్లు కన్పట్టుటచే 'స్వామికిన్'గా మార్పఁబడినది. కాని యీమార్పునఁగూడ వారి కభిమత మైన యర్థము సిద్ధింపనేరదు. వెనుకటివారు కూర్చినప్రతు లలో నీపాఠ మెచ్చటను గానరాదు.

వెనుకటిపాఠమునఁ దెలియవచ్చెడి యర్థ మిది. సాంప రాయని తెలుంగురాయా! యోగ్యమైన కవిరాజు లను దేవతాసమితికి తరుగనట్లు కస్తూరీదానము సేయుమయ్యా! నీ వొసఁగిన యీకస్తూరి దక్షారామపురీవిహారుఁడైన భీమే శ్వరున కర్పితమైనపుడు, తత్సేవికలైన గంధర్వాప్సరోభామల వక్షోజము లనెడి కుంభికుంభములమీఁద నావాసనలు గుబా ళించు ననినాఁడు. దక్షారామమునందలి గంధర్వాప్సరో భామినులకు భీమేశ్వరుని నిత్యసాన్నిధ్య మేర్పడియుండుటచే, వారివక్షోజములు పరమేశ్వరార్పిత కస్తూరీవాసనావాసితము లగుట సంభావితము.

శ్రీనాథుఁడు తెలుంగురాయుని తరుగనట్టు కస్తూరి నిమ్మని యడుగుట పరమేశ్వరోపభోగమునకే గాని, తన

[illegible] యిండ్లపైఁ బూయుటకుఁ గాదని సహృదయులు గుర్తింపఁగలరని నానమ్మిక. ఈపద్యమునఁ జేర్కొనిన గంధర్వాప్సరోభామినులు విమర్శకు లనుకొనిన భోగపుజాతివారే యయినచో, వారు వక్షోజములపైఁ గస్తూరిపూసినంతమాత్రమునఁ దనియుట పొసఁగునా? కస్తూరీవాసనలు వక్షోజములపై గుబాళించు ననుటచే, తాను బూయుడు వను విషయ మిచట స్ఫురింపనే స్ఫురింపదు. శ్రీనాథుఁడు సాధారణముగాఁ బరమేశ్వరు నెచట వర్ణించినను కస్తూరీచందనచర్చితగాత్రుని గావించును. మఱియు నాతనియూహాలో నెచటను దక్షారామరామాజనము పరమేశ్వరసంసక్తమే కాని యన్యపురుషసంసక్తమైనట్టులు వినరానప్పుడు, కవిరాజశబ్ద మిందుఁ గలదని, దక్షారామవేశ్యాప్రసక్తి వచ్చినదని శ్రీనాథునకు వేశ్యాలోలత యంటఁగట్టుట యవిచారితరమణీయమే గాని విచారసహము గాదని నామనవి.

శ్రీనాథుఁడు వేశ్యాలోలుఁ డని నిరూపించుటకు మఱియొక నిదర్శనముగాఁ గైకొనఁబడినది, భీమేశ్వరపురాణమునందలి యీక్రిందిపద్యము.

శా. కాంచీకంకణతారహారకటకగ్రైవేయభూషావళుల్
అంచంబెత్తురు దూతికాతతికి లీల న్బెండపూఁడన్న నిం
బంచాస్త్రోపముఁ దారతార కవయ న్వాంఛించి లోలోపలన్
బంచారామములందుఁ బల్వాలపురిం బ్రౌఢేందుబింబాననల్.

భీమేశ్వరపురాణమునకు కృతిభర్తయైన బెండపూఁడి అన్నమంత్రి విశిష్టత నెఱిఁగించుచు నాతనిసౌందర్యమును

వర్ణించునప్పటి దీపద్యము. దాక్షారామాది పంచారామము లందును పలివెలపట్టణమునందును గలచంద్రముఖులు (అంద గత్తెలు) మన్మథసన్నిభుఁడైన బెండపూఁడి అన్నమంత్రిని సవిలాసముగఁ గవయుటకై లోలోనఁ దలపోయుచు, తామే తామే యనుకొనుచు, నాతనిఁ గూర్చ్పనికి దౌత్యము నిర్వహించుదూతికలకు కాంచీకంకణాదిభూషణములను లంచం బిత్తురఁట. బెండపూఁడి యన్నామాత్యున కెంతటి వేశ్యాలోలత యుండినను, దానిని గ్రంథస్థముగ శాశ్వతము చేసిపెట్టిన శ్రీనాథునకే యట్టివేశ్యాలోలత గలదనియు, లేకున్న నీవిషయము నింత పచ్చిగ వర్ణించిపెట్టుట కవకాశ ముండఁ బోదనియు విమర్శకుల యాశయము.

భీమేశ్వర పురాణమునం దీపద్యమును గూర్చి పెట్టిన దానిపై ప్రభాకరశాస్త్రిగారు శృంగారశ్రీనాథమున భీమేశ్వర పురాణమునుగూర్చి వెలువఱిచిన యభిప్రాయ మిట్లున్నది.

"దాక్షారామము పలివెల పీఠికాపురము మొదలగు స్థలవర్ణన మీగ్రంథమునఁ బౌరాణికముగాఁ గాక చారిత్ర కముగా స్వాభావికముగా నున్నది. మొదటి మూఁడాశ్వాస ములందునతీరు పరికింపఁదగును. మఱియు నాస్థలములం దనకు సమకూడిన యనుభవానందాదులు వెలికిఁదోఁచునట్లు పెక్కుపట్టులఁ గవనము రచించినాఁడు. శ్రీనాథునికవితా చకోరికను బంచారామములందును బల్వాలయమందును ప్రౌఢేందుబింబ ప్రతిబింబచంద్రికా చమత్కారములు ఘూరాఱ

లోనఁగి చొక్కించి దక్కఁగొన్నవి. యౌవనము నిండారి ప్రౌఢమై నిర్భరమైన యీకాలమం దీతని నెన్నో యున్నత భోగముల ననుభవింపఁజేసినది.''

శృంగారశ్రీనాథము. పుట. 145.

శ్రీ శాస్త్రిగారి కిట్టికల్పనాచమత్కారము నొదవింపఁ జేసినది పైపద్యమే. ఆపద్యమందలి భావమంతయు సీవచనములోఁ బ్రతిబింబించినది. వలివెలవారకాంతలమీఁది పద్యములు శ్రీనాథునిచాటువులుగా వారిచే క్రీడాభిరామపీఠికయందు సంతరింపఁబడినవి దాని కుపష్టంభకమైనవి.

అన్నామాత్యుని శృంగారిత్వము నింతగా వర్ణించిన యీపద్యమును గూర్చిన శ్రీనాథునిశీల మెట్టిదైయుండునో? యూహసేయు మనినారు శాస్త్రిగారు. కాని యీపద్యము నకుఁ బూర్వోత్తరములం దుండిన అన్నామాత్యవర్ణన క్రమము నారసిన నీపద్యము కేవల మాతని సౌందర్యవిశేషమును వర్ణించుట కుపక్రమింపఁబడినట్టులు గానవచ్చును. ఆక్రమ మారయుదము. భీమేశ్వరపురాణమునందు కృత్యాదిని బెండపూఁడి అన్నామాత్యుని విభవమును బ్రత్యేకముగఁ బేర్కొనినపద్యములు వరుసగాఁ బదునైదు. వీనిలో నయిదుపద్యములు షష్ఠ్యంతములు. పదిపద్యము లాతని యశఃప్రశస్తులను దెలిపినవి. ఇవి ప్రథమాశ్వాసము సంఖ్య 72 మొదలు 81 వఱకుఁ గలవు. వీనిలో ప్రత్యేకపద్యమునం దొక్కొక్క విశేషము వర్ణింపఁబడినది.

72. తదనుసంభవుఁ డఖిలవిద్యావిరించి...ఇత్యాదిపద్యము దీనిలో నాతని కీర్తివిశేషము వర్ణింపఁబడినది.

73. అరబీభాష తురుష్కభాష...వానికిఁ గల వివిధభాషా పాటవము.

74. అన్నయ మంత్రిశేఖరుఁడు...పారసీలిపి వ్రాయుతీరు.

75. రాజమహేంద్రదుర్గమునఁ గావించె...ఆతని యాలయ ప్రాకారాది నిర్మాణపద్ధతి.

76. భావన సంతసిల్లఁగ...ఉత్తమశ్లోకుఁ డగుట.

77. సిరియేలిక యగువరకేసరి...నృసింహసామ్యము.

78. కాంచీకంకణతారహారకటక...సౌందర్యవిశేష వర్ణనము

79. తారగిరిమందరంబుల...బృందారకగీయమానకీర్తి యగుట.

80. కలకంఠములఛాయ గల కంఠకోణంబు...ఈశ్వరార్చనా విధానము.

81. అఖిలదిగ్దంతి దంతావళంబుల...నయకార్యసరణి.

ఇట్లీ పదిపద్యములందు విపులముగ వర్ణింపఁబడిన విశేషములే తరువాతి షష్ఠ్యంతపద్యము లైదింటను సంక్షేప రూపమునఁ జేర్కొనఁబడినవి.

ఈక్రమమును సక్రమముగఁ బరికించిన సహృదయున కెవ్వనికైనను 'కాంచీకంకణేత్యాది' సైపద్యము, బెండపూఁడి అన్నమంత్రి సౌందర్యము సుందరులైన వనిత లందఱకుఁ గమనీయమై కామనీయమైన దనువిషయమే స్ఫురిం

చును గాని, అన్నామాత్యుఁడు లేక వానిని వర్ణించిన శ్రీనాథుఁడు 'శృంగారి' యనుభావము స్ఫురించుట పొసఁగు నని తోఁపదు. శ్రీనాథుఁడు 'కాంచీకంకణే'త్యాదిపద్యమునఁ బ్రధానముగ నిరూపింప సమకట్టిన విషయములు రెండు. అందు మొదటిది అన్నామాత్యుఁడు పంచాస్త్రోపముఁ డని తెలుపుట, రెండవది పంచారామ పల్వలపురీవనితలు ప్రౌఢేందుబింబానన లని మెచ్చఁగించుటయును. శ్రీనాథుఁడు సౌందర్యాభిమాని యను విషయము సర్వసమ్మతము. అట్టి సౌందర్యాభిమానమే శ్రీనాథునిచే నిట్టి సౌందర్యమయ స్వరూపావిష్కారమునకు దోహదము చేసినది. 'సఖలు సుభగః య మంగనాః కామయన్తి' యను సూక్తిచొప్పున, సుందరు లందఱుఁ గామింపఁదగిన యాకారసౌష్ఠవము గల వాఁడే సౌందర్యవంతుఁడు. అట్టి సౌందర్యము అన్నామాత్యునకుఁ గలదని తెలుపుటకే యీయుపక్రమము.

శ్రీనాథుఁ డాంధ్రదేశము నాలుగుచెరఁగులు దిరిగి, సౌందర్యసమన్వితమైన వస్తువుల నన్నిటిని సునిశితదృష్టితో దర్శించి, తత్తద్వస్తుగతసౌందర్యమును దనకవితాశిల్పమునం దందముగఁ దీర్చి దిద్దిపెట్టినవాఁడు. ఆంధ్రదేశమం దంతటను బర్యటించినపు డాయాప్రాంతములందలి వనితల సౌందర్యమును బరిశీలించునపుడు తనచిత్తము నాకర్షించిన సుందరుల యందమును జాటువులలో సైతము అత్యుదాత్తముగఁ జిత్రించిపెట్టినాఁడు. ఆంధ్రదేశమునలుచెరఁగులలోఁ బంచా

రామములందును, ముఖ్యముగ దక్షారామమునందును గాన వచ్చిన వనితాసౌందర్య మాతనిచిత్తమును విశేషముగ నాకర్షించినది. తదారామములతోఁ బల్వాలపురమునుగూడ జోడించినాఁడు. పంచారామవిలాసవతీ సంప్రార్థ్యసౌందర్య మత్యుత్తమ మనుభావము శివరాత్రిమాహాత్మ్యమునందు సుకుమారుని సౌందర్యము నభివర్ణించుతీరునందును,

"పంచారామవిలాసినీ ధవళదృక్పాళీన జాలాయమా
నాంచత్కాయుఁడు, నిర్నిబంధనమనోజ్ఞాకారరేఖాకళా
పాంచాస్త్రుం డగు నాకుమారుఁడు..." ఇత్యాదిగాఁ జిత్రించినాఁడు.

పంచారామములందలి విలాసవతుల, స్వచ్ఛమైన నేత్రములను మత్స్యములకు వలయై యొప్పుశరీరము గలవాఁడు, అకృత్రిమసౌందర్యాకారరేఖకు మన్మథుఁడైనవాఁడు సుకుమారుఁ డని భావము. సుకుమారుని రూపము మన్మథసదృశ మని తెలుపఁదలఁచిననాఁడు, పంచారామ విలాసవతీ నేత్రాకర్షకశరీరుఁ డని వర్ణించుటచే విశిష్ట సౌందర్యనిరూపణావసరమందు పంచారామవిలాసవతులను సంస్మరించుట యాతని కొక పరిపాటియైనది. ఒకప్పుడు బెండపూఁడి అన్నమంత్రికిఁగాని శ్రీనాథునకుఁగాని సన్నిహితులై యుండుటచే పంచారామలీలావతులతో సంబంధము గలదని యూహించుటకు సాహసించినను, వింధ్యారణ్య మధ్యమునందు రత్నపురమున వసించుచున్న సుకుమారునకు పంచారామములందలి వారవనితలతోఁ జెలికార మెట్లేర్ప

ఱుపఁ గలము. కావున పంచారామవిలాసవతీసంప్రార్థ్యసౌంద ర్యము శ్రీనాథునిదృష్టిలో విశిష్టతరమనియే మనకుఁ దెలియ వచ్చును. సౌందర్యమునకే గాక యభినయాదికమునకుఁ గూడ పంచారామవిలాసవతుల నాతఁడు సంస్కరించి యున్నాఁడు.

మ. అడర న్వచ్చిరి సంభ్రమంబునను బంచారామలీలావతుల్
పదునాల్జాతుల యప్సరోంగనలునుం బాలిండ్లపై హారముల్
గదలం బెన్నెఱిసేసకొప్పులపయిం గహ్లారగుచ్ఛంబు లూ
ప్పఁ దదీయత్వరగండభాగములఁ గంపంబొందఁ దాటంకముల్.

శివరా. 2-59.

యజ్ఞదత్తామాత్యునిభార్య సుశీల గర్భవతియైనపుడు సీమంతపుంసవనోత్సవములు మహావిభవముతో నెఱపఁబడి నవి. ఆయుత్సవమునఁ బాల్గొనినవారిని వర్ణించుక్రమ మిది.

గీ. వేడ్క నృత్యంబులాడిరి వీగులందుఁ
బాడి రత్తిలి పికకుహూపంచమమునఁ
బంజళంబున ధవళప్రబంధగీతి
కనుమయువ్వలి కర్ణాటకమలముఖులు.

ఇచ్చట మంత్రిచే నెఱపించిన మహోత్సవములో తూర్పుకనుమల కావలనుండిన కర్ణాటదేశవిలాసినులు పాటలు పాడుట ఆటలాడుట నెఱపిన వెనుక, పంచారామలీలావతు లాయుత్సవమునఁ బాల్గొన వచ్చిరి. ఈవచ్చినవారు పదు నాల్గుజాతుల యప్సరోంగన లనుటచే వారు దేవవేశ్య లనుట తెల్లము. వారిలో దక్షారామలీలావతులుగూడఁ

గలరుగదా! వారిని శ్రీనాథుఁడు విలక్షణసౌందర్యవతుల నుగాఁ జిత్రించి పెట్టినాఁడు. ఇట్లు పలుతావుల బహుభంగుల విలక్షణసౌందర్యవతులుగాఁ జిత్రింపఁబడిన పంచారామలీలావతులచేఁ గోరఁదగిన సౌందర్యము గలవాఁడని చిత్రించుటకే కాంచీకంకణేత్యాదిపద్య ముపక్రాంతమైనది గాని, అన్నమంత్రి వేశ్యాప్రియత్వమును దెలుపుట కుపక్రాంతము కాలే దనుట నిశ్చయము. ఈపద్యమునుబట్టి యన్నమంత్రి శృంగారి యని నిర్ధారింపఁబడినపుడుగదా! తద్వర్ణనప్రసక్తుఁడైన శ్రీనాథున కాశృంగారిత్వము నతికించుట.

బెండపూఁడి అన్నామాత్యుఁ డరవిందాప్తకృతప్రతిష్ఠుఁడగు దక్షారామభీమేశ్వరునిమీఁది భక్తిభావముచే, భీమేశ్వరాలయమున నూత్నముగ మహోత్సవమండపమును నిర్మింపఁజేసినాఁడు. ఆమండపమునందుఁ బంధువుపందువునకు భీమేశ్వరుఁడు కొలువుదీర్చి గంధర్వాప్సరోవిలాసవతుల యభినయాదికముఁ జూచి వినోదించుచుండును. ఆవిభవము నంతయుఁ జిత్రింపఁ దలఁచియే దక్షారామరామాజనంబును శ్రీనాథుఁ డతిమాత్రముగఁ జిత్రించియున్నాఁడు. మఱియు బెండపూఁడి అన్నామాత్యుని శివభక్తితత్పరతను గనుఁడు.

గీ. వికటశృంగారమున నొప్పు వేల్పుఁజేని
నాగమోపనిషన్మనోహరుని హరుని
నర్చనము సేయు సంధ్యాత్రయంబునందు
బెండపూఁ డన్న కన్నులపండువుగను.

ఇట్టి యనన్యమాత్యునకు శ్రీనాథుఁడు వేశ్యాలోలత నెట్టు లంటఁగట్టఁ గలఁడు ? ఆతనిసౌందర్యరేఖ నంతగ వర్ణించిన శ్రీనాథున కది యెట్టు లతికింపనగును ? శ్రీనాథుని దృష్టిలో దక్షారామము కైలాసముకంటెను బరమపవిత్రమైన దివ్యక్షేత్రము. ఆతఁడు దక్షారామము నెట్లు భావించెనో కనుఁడు.

ఉ. ఏదెసఁ జూచిన న్విబుధు లేదెసఁ జూచిన వాణిమండలం
బేదెసఁ జూచిన న్హరిదధీశ్వరవర్గము వాసవాది యం
దేదెసఁ జూచిన న్నవమహేశ్వరమూర్తులు శ్రీనికుంభ కుం
భోదర తండు భృంగిరిటి హాహలుక హూహాహులు దక్షవాటికిన్.

ఇట్టిసద్భావముతో దేవతామయము గావించియున్న శ్రీనాథునకు దక్షారామరామాజనముతోఁ జెలికారము నూహించుట, యుక్తిసహము గాదని నాయూహ. భీమేశ్వరపురాణమున శ్రీనాథుఁడు తనభక్తిభావముచే పూర్వోత్తరవిరోధము లేకుండఁ గావ్యత్వము నాపాదించుటకై కూర్చి పెట్టిన భావనామయమైన శిల్పమును సద్భావముతోడను సమ్యగ్భావనతోడను నవగతము చేసికొనఁ జాలునహృదయుల కీకావ్యమునం దాతని వేశ్యాలోలత్వమేపాటియుఁ బొడకట్ట దని నానిశ్చయము.

శ్రీనాథునినిరంకుశత్వమును నిరూపించుటకై, యాతని శృంగారిశేఖరునిగా తీర్చిదిద్దుటకు వలనుపడు నని శాస్త్రిగారావఱకు ముద్రితముగాక మిగిలియుండిన దేవదారువన

విహారఘట్టమును క్రీడాభిరామపీఠికలో ముద్రించుచు దాని కుపోద్బలకముగా నుండుటకై ముందుగ నీవాక్యములు వ్రాసి యున్నారు. "ఔచిత్యమును బోషించియు ననౌచిత్యమును బరిహరించియు రచించితి నని శ్రీనాథుఁడే చెప్పుకొన్న శృంగారనైషధము సప్తమాశ్వాసము నూటముప్పదిమూఁడవపద్యము యజమానప్రమదావికస్వరేత్యాదికము జుగుప్సావహము. గ్రామ్యతాదోషజుష్టము. మూలమున నుంపునే గాక, మఱియు 'విద్వజ్జనులు నిన్ను విమయించి వత్తురు' (షష్ఠాశ్వాసము) ఇత్యాదిపద్య మశ్లీలముగాదా! అనౌచితిని బరిహరించుటలోఁ జేరవలదా!" యనినారు. కాని నిదానముగాఁ బరికించిన నట్టియనౌచిత్య మిచట స్ఫురింపదేమో యని నాయూహ.

శ్రీనాథుఁడు తానెఱిఁగిన శాస్త్రీయసంప్రదాయమునుగాని వైదికసంప్రదాయమునుగాని తెలుప నమకట్టినచో, దాని సమగ్రస్వరూపము నెఱిఁగించునే గాని యేకదేశమును దెలుపఁబోవఁడు. అశ్వమేధయాగనిర్వహణప్రకరణమున, యజమానుని దేవేరికిఁ అశ్వమేధాశ్వవరాంగసంయోగమున గావించు మంత్రపూర్వకసంస్కారమును అచట నిర్వహింపవలసిన క్రియాకలాపముతోపాటు ఈపద్యమున వివరించియున్నాఁడు. అశ్వమేధయాగోద్దిష్టమైన యశ్వమును సంజ్ఞపనము గావించిన వెనుక, తద్గుహ్యాంగమును యజమానపత్నీరహస్యావయవమున నుంచి, వస్త్రాచ్ఛాదనపూర్వక

ముగ మంత్రములవినియోగముతో నితరపత్నీగర్హణాదులతో నా ప్రయోగము ముగియును. ఇచట నిష్ప్రాణమైన యశ్వావయవస్పర్శము మాత్రమే యజమానపత్నికి జరుగును. అశ్వమేధయాగము బ్రహ్మహత్యాది మహాపాతకనిర్మూలకమైనపవిత్రకర్మము. ఏయాగమైనను సకలాంగపరిపూర్ణమై నిర్వర్తింపఁబడినఁగాని యాగజన్యమైన యపూర్వము పుట్టదు. యజమానపత్నికి మంత్రపూర్వకముగ నెఱపెడి యీసంస్కార మాయాగమునకు ముఖ్యాంగము. దానిస్వరూపము నెఱిఁగించుటకే శ్రీనాథుఁడు మూలమం దుండినవిషయమునే విపులముగఁ దెలిపియున్నాఁడు. ఇది కలిప్రయుక్తమైన గర్హణావిషయము గావున, ఈరీతిగ వివరించి తెలుపుటలో ననౌచిత్యశంక యుండఁబోవ దని శ్రౌతసంప్రదాయ మెఱిఁగిన వారికి సులభముగ నెఱుఁగనగును. తదన్యుల కిది దురవబోధమైనవిషయమే. శ్రీనాథునిపద్యము తన్మూలము నరయుఁడు.

మ. యజమానప్రమదావిక స్వరభగన్యస్తాశ్వదీర్ఘస్మర
ధ్వజదండంబుగ నశ్వమేధముఖతంత్రంబు న్నిరీక్షించి యి
క్ష్వాకుజనుం డొత్తిరి నవ్వె పేదవిమలం గుత్సించి పుష్పాస్త్రుచే
నిజహాస్తంబున వ్రేసి యశ్రుకణముల్ నిండార నేత్రంబులన్.

నైష 7-133.

శ్లో. యజ్వభిర్యాశ్వమేధాశ్వలిఙ్గాలిఙ్గీవరాఙ్గతాః
దృష్ట్వా౽౽దృష్ట స కద్రూపం శ్రుతే గృహ్ణంతి హసన్త్యతః.

సం. నైష. 17-201.

ఈ తెలుఁగుసేఁతలోఁ జూపఁబడిన యర్థము సంస్కృత మున లేకపోలేదు. కాని యచటివిషయమునే మత్తేభవృత్త మునందుఁ బొడిగించుటచే విమర్శకుల కశ్లీలముగాఁ దోఁచి నది. ఇట్టి దశ్లీలముగాఁ దోఁచుట తెలుఁగువారి కే. సంస్కృత భాషయందుఁ గొంత విశేషసర్యవేక్షణ గావించువారి కిట్టి శబ్దములయర్థములు వాచ్యవ్యంగ్యరూపములలో నవభాసించి నను నెడబరముగా గోచరింపవు. అందును నిట్టియాగాది తంత్రవిషయములను దెలుపుప్రకరణములలో యథాస్థిత ముగఁ దెలుపకుండుటయే దోష మగును. మఱియొక్క మాట. శాస్త్రిగారు శ్రీనాథుని శృంగారిగా నిర్ధారింపఁ దల పెట్టి, యాతని నిరంకుశునిగా నిరూపించుటకుఁ గైకొనిన విషయములలోఁ జాలవఱకు స్త్రీపురుషరహస్యాంగములను వాచ్యముగఁ దెలిపినపట్టులేగలవు. వ్యంగ్యవిషయముపొంతకు వారు పోవనేలేదు. వాచ్యమైన నశ్లీలమైనచో వ్యంగ్య మేల కాదు? హెచ్చుగ నాతనిరచనలో వారి కనౌచిత్యము లని గోచరించినవిషయములనే పేర్కొనిరిగాని, ఔచిత్యము నెం తయుఁ బోషించినవిషయముల నేపాటియుఁ దడవనైనఁ దడ వలేదు. ఈక్రిందినైషధానువాదమం దౌచిత్య మెంతగా నిర్వ హింపఁబడినదో పరికింపుఁడు.

చ. కుతుకమునం గురంగమదకుంకుమచర్చ వహించి నీలలోఁ
హితగుచులై స్వయంభులయి యుష్ణలసౌఖ్యవిధాయులైన య

యాృతిపపయోధరంబులకు నర్ధనిశాసమయంబున న్నవం
చితనఖకింశుకార్చనము చేసె మహీపతి భక్తి యేర్పడన్.

నైష. 7-178.

శ్లో. యదా కురంగమదకుంకుమార్ద్రితా
నీలలోహితరుచౌ వధూకుచౌ,
స ప్రియోరసి తయో స్స్వయంభువో
రాచచార నఖకింశుకార్చనమ్.

ఇది దమయంతీనలుల రతికేళిలో నలుఁడు దమయంతి యురోజములందు నఖక్షతములు గావించిన విషయమును వర్ణించు ప్రకరణము. ఏదమయంతీకుచములు కస్తూరీకుంకుమ పంకచర్చితములై నీలలోహిత (నలుపుఎఱుపు) కాంతిగలవో, ప్రియురాలివక్షమున స్వయంభువులై యున్న వానికి నలుఁడు నఖక్షతములనెడికింశుకపుష్పముల పూజను గావించె నని శ్లోకభావము. ఇచట నలుఁడు ప్రియురాలియురమున నఖక్షతములు గావించుటను బరమేశ్వరునకుఁ గావించిన కింశుకపుష్పార్చనము (మోదుగపూవులతోఁ బూజసేయుట)నుగా భావించుట శ్రీహర్షునిరచనలో వ్యంగ్యముగ స్ఫురించుచున్నది. దానిని శ్రీనాథుఁడు తనరచనలో విపులీకరించి, శ్రీహర్షునిరచనకు వన్నెవెట్టినాఁడు. ఇట్టి విపులీకరణమున గోచరించెడి యౌచిత్య మూహాతీతము. మత్తేభగమనములో సంస్కృతశ్లోకమునందలి భావమును ముందునకుఁ గొనిపోవు క్రమమునఁ గ్రొత్తగఁ జేరినవిషయము లివి. మూలమున కుచము లని సామాన్యముగ నిరూపించినవానిని పయోధర

ములుగా మార్చి గంగాధరత్వమును గూర్చిపెట్టినాఁడు. ప్రకరణోచితముగ నీప్సితసౌఖ్యవిధాయులను గావించినాఁడు. మహీపతిచే భక్తితో నఖక్షతము లనెడికింశుకములచే సతివ పయోధరములకు అర్చనమును సముచితరీతిని నెఱపఁ దల పెట్టినాఁడు గావున దాని నర్ధనిశాసమయమున, అనఁగా, లింగోద్భవకాలమునఁ జేయించినాఁడు అర్ధరాత్రసమయము నందు ఈశ్వరలింగమునకు కింశుకపుష్పములతో నర్చనము సేయుట యనునది మంత్రశాస్త్రసమ్మతమైన విషయము. ఇది యాశాస్త్రసంప్రదాయ మెఱిఁగినఁగాని యెఱుఁగ రానిది. రతికేళీప్రసక్త మయిననఖక్షతములను పరమేశ్వరు నకుఁ గింశుకపుష్పార్చనముగా సమకూర్చిపెట్టిన శ్రీనా థుఁడు కృత్యాదిని ప్రతిజ్ఞచేసినచొప్పునఁ దన కలవడియున్న యీశ్వరార్చనకళాశీలత్వము నీపద్యమునం దతిమాత్రముగ వ్యక్తముచేసినాఁడు. ఇట్టివిషయములమీఁదికి విమర్శకుల దృష్టి యేపాటియుఁ బ్రసరింపనే లేదు. ఈవిషయము నెవ్వరు నరయువారు కూడఁ గానరారు. గతానుగతికముగ 'యజ మానప్రమదే'త్యాదిపద్యమునం దనౌచిత్యమును బలపఱచు వారే గానవచ్చెదరు. ఈపద్యముగూడ సప్తమాశ్వాసము లోనిదే. దీనినిబట్టి శ్రీనాథుఁ డఖండశివభక్తితత్పరుఁ డని యేల నిర్ణయింపరాదు.

ఇంకొకమాట. ఈక్రిందిసీసపద్యమున 'విషయించు' అనుక్రియ యశ్లీలార్థస్ఫోరకముగా జతఁగూర్చినాఁడు కావున

వది శ్రీనాథుని సిరంకుశత్వమునకు నిదాన మనిరి. ఆపద్య మిది.

సీ. సర్వతోముఖపిపాసకు దప్పిఁ బడిరొసు
కామమోదనము నిక్కముగ వలయు
నీముఖంబున మాకు నెఱయఁగ సుఖ మబ్బెఁ
గాంచఁగావుత నిన్నుఁ గమలయోని
యనులోమమున లెస్స పనిఁజేసికొంటిప్డు
భగవదారాధనప్రాప్తినిధివి
విద్వజ్జనులు నిన్ను విషయించి వత్తురు
కలమాధురములు నీగళరవములు
అనుచు నెయ్యంపు వియ్యంబు లల్ల నల్ల
సరసనర్మోక్తిఁ జాతుర్య సౌష్ఠవముగ
గోష్ఠి సలిపిరి దమలోనఁ గొంతప్రొద్దు
భోజనాగారపర్యంతభూములందు.

దమయంతీవివాహసమయమునందు    బువ్వపుబంతి సాగునపు డిరుపక్షములవారు నొకరి నొకరు పరిహాసము చేసి కొనుఘట్టము. ఆప్రసంగము సాగినతీ రిట్టిది.

క. వ్రయ్యా వడకుండ నాడిరి
వియ్యపుమేలంబు లుభయపక్షమువారుఁ
నెయ్యంబునఁ దియ్యంబున
నొయ్యనఁ జతురాక్షరాధికోక్తిప్రౌఢిఁ.

ఉభయపక్షములబంధువులును హృదయములు బీటలు వాఱకుండ నెయ్యము తియ్యము (ప్రీతిమాధుర్యములు) వెలయునట్టి నేర్పుతో అధికాక్షరయుక్తపదప్రౌఢిమ యొప్ప

నట్లు వేళాకోళము లాడిరి. ఆపరిహాస మీతీరున నడచినది. దీనిలో సీసము నాల్గుపాదములందును భోజనప్రకరణము నకు సంబంధించిన యర్థ మొకటి కామతంత్రమునకు సంబంధించినది రెండవదిగా సాగినది. తొలుతటిసీసపాదములు రెండిటికి శ్రీహర్ష నైషధానుసరణముననే రెండర్థములు స్ఫురించినవి. తరువాతిసీసపాదములు రెండిటికి మూలము లేదు. తుదిపాదమునందు 'విషయించు' అనుక్రియాపదమును గూర్చుట యశ్లీల మని భావించినారు. ఇచట నొకయర్థమున 'నిన్నుద్దేశించి'యనియు, రెండవయర్థమున 'నిన్ను భోగించి' యను నర్థము ప్రసక్తమగును. అట్టివిషయమున నశ్లీలార్థ మంతగ స్ఫురింపదేమో! మిథునీభావరూపమైన యర్థము వాచ్యముగ స్ఫురించినచోట నశ్లీల మనియు, వ్యంగ్యముగ స్ఫురించినచోట నశ్లీలము గాదనియు నియమము లేదుగదా! ఆవిధముగఁ దడవుట కుపక్రమించినచో పైపద్యమునందే—కామమోదనము, కమలయోని, గళరవములు—ఇత్యాది పదములనుండియు నశ్లీలార్థమే స్ఫురించును. ఆవిషయము నేల తెలుపరైరి? అశ్లీలార్థమును స్ఫురింపఁజేయునట్లు రచన సాగించుట, 'అనౌచిత్యంబు పరిహరించియు' అను ప్రతిజ్ఞా వచనమునకు భంగకర మని భావించినచో శ్రీనాథుని నైషధానువాదము మూలానుసృతముగను, కొన్నిపట్టులందు మూలాతిశాయిగను గొనసాగనే సాగదు. ఈబువ్వపుబంతి ప్రకరణమునందును, కలిపురుషపరివారప్రవర్తితనిందావాక్య

ములందును జంకుకొంకులు వహించిన శ్రీనాథునిగంటము ముందునకు సాగకయే యుండెడిది. శృంగారైకరసార్ణవమైన యీనైషధకావ్యమునందు ఇట్టితావులందు అశ్లీలములు స్ఫురించుచుండె ననుట యుక్తిసహము కాదేమో ? యని నాయూహ.

శ్రీనాథుఁ డీక్రియను బలుతావులందు వాడినాఁడు గావున నాతని కీపదప్రయోగమునం దభిలాష మెండనియు, తన్మూలకముగ నాతఁడు విషయలోలుఁ డనియు, క్రీడాభిరామమునందు సైతమీపదప్రయోగ ముండెను గావున, క్రీడాభిరామము శ్రీనాథకర్తృకమే యని నిర్ధారించుటకు వలనుపడు ననియు క్రీడాభిరామపీఠికయందే శాస్త్రిగారు తెలిపియున్నారు. కాని క్రీడాభిరామము శ్రీనాథకర్తృకము కాదని యనుపదమునందే నిరూపింపనైయుంటిని. ఆక్రీడాభిరామమునం దీపదప్రయోగ మశ్లీలార్థస్ఫోరకము కాదనియే యనిపించును.

చ. కొలుచును జేన వెట్టి కుచకుంభయుగం బెగడిగ్గఁ గన్నుఁగ్రే
వలఁ బరికించుఁ గత్తుముఱ వైచును దృష్టులు మాటిమాటికిన్
గలికితనంబునం దలుచుగా నగు సౌచికపల్లవుండు కం
చెల వెసఁ గుట్టియీఁడు గణికామణికిన్ విషయాభిలాషియై.

క్రీడా. పుట. 33.

ఇచట సౌచికుఁడు (కుట్టుపనివాఁడు) విటుఁడు. ఆతనిచే అవిక కుట్టించుకొన వచ్చిన దొక వెలచేడియ. (భోగపు జాతిస్త్రీ) ఆసౌచికుఁడు జేన వెట్టి కొలుచుచు, కనుఁగొనలచేఁ

కుచకుంభములు పరికించుచు, కక్షములపై దృష్టి సారించుచు, మాటిమాటికి నవ్వుచుండునే గాని అవిక తొందర అగాఁ గుట్టియిచ్చుట లేదఁట. కుట్టువని కాలస్యముచేయుటకుఁ గారణ మాతఁడు విషయాభిలాషియై యుండుట. అనఁగా వెలచేడియతో సంభోగము నభిలషించుచు నాలస్యముచేయుచుండె ననువిషయ మిట నిరూపితము. జాతి సామాన్యసంభోగ్యయైన వెలచేడియను విటుఁడు భోగింపఁ దలఁచుట యశ్లీలమగునా ?

ఇటులనే శ్రీనాథున కీక్రియాపదప్రయోగమునం దభిలాష మెండనుటకు "గండము దప్పె నంధ్రకవిగానికి... ఇత్యాది చాటుపద్యమునందు, విషయింపఁబోయినఁ" అను పదప్రయోగము కలదని తెలిపియున్నారు. తరువాత నీచాటువు శ్రీనాథునిది కాదనియు, కవిచౌడప్ప రచించినదిగాఁ దెలియవచ్చుచున్నదనియు వివరించియున్నారు. కావున నీపదప్రయోగమునందు శ్రీనాథున కభిలాష మెండను విషయము కూడఁ బరాస్తమయినది. మఱియొక్కమాట. శ్రీనాథుఁడు సంస్కృతభాషయం దపారమైనపాండిత్యము గలవాఁడు. తనకుఁ గలపాండిత్యవిభవముచే నేవిషయమునైన నాతఁడు హేలగఁ జిత్రింపఁగలఁడు. ఆతని కవితాశిల్పమునందలి గుణదోషములను విచారింప సమకట్టిననాఁడు, మనదృష్టి కెడబరముగాఁ దోఁచినపట్టులందు వెనుకముందులు సావధానమతితోఁ బరికించిన నేతావునందైనను ననౌచిత్యము గోచరింప దని నానిశ్చయము.

## హరవిలాసము - దేవదారువనవిహారము

1. శ్రీనాథుఁడు హరవిలాసమున దేవదారువన విహారఘట్టమునఁ బరమేశ్వరలింగావిర్భావప్రకారవర్ణనమున నుచ్ఛృంఖలముగా రచన సాగించెనని విమర్శకుల యాక్షేపము. ఈయాక్షేపమును శాస్త్రిగారు క్రీడాభిరామపీఠికలోఁ గావించియు, ఆనందముద్రణాలయమువారు ముద్రించిన హరవిలాసపీఠికలో 'పరమశివలీలయగు నీకథాఘట్టమున నౌచిత్యచర్చ జరుపుట సంగతము గాదు. ఐనను శ్రీనాథుఁ డీకథారచనలో నౌచితి నంతగాఁ గోల్పోవకుండుట ముదావహము' అని యనినారు. శాస్త్రిగారు హరవిలాసపీఠికలో వాకొనిన విధమునఁ బరమశివలీలయెడల నౌచిత్యచర్చ సాగించుటయే యసంగతమైన విషయము. మఱియు శ్రీనాథుఁ డీదేవదారువనవిహారకథలో నౌచితి నంతగాఁ గోల్పోవకుండుటయే గాదు; అతిమాత్రముగఁ బాటించినాఁడు. పరమసంయమియైనాఁడు. ఆక్రమ మెట్లు సాగెనో ముందు వివరింతును.

2. మఱియు హరవిలాసమునందు సప్తమాశ్వాసమున మాయాకిరాతుఁ డర్జునుని దిట్టుటలో నశ్లీలము దొరలెనని యాక్షేపము.

క. పండెదు బలునాఁకసమున
గుండియ పగులంగఁ జేసి కూల్చితి దీనిన్
వెండి ప్రయోజన మేమీ
రండాసుత! దీనిపై శరము నిగుడింపన్. —హరవి. 7-54.

అర్జునుని సత్త్వపరీక్షకై పరమేశ్వరుఁడు మాయాకిరాతవేషధారియై వచ్చి యర్జునునకుఁ గోపము రేకెత్తించుటకై, పంది నడఁచినదాని కాతనితో వివాద మారంభించినాఁడు. ఆసమయమున వెలువడిన సాధిక్షేపవచనఘట్ట మిది. ఇచట 'రండాసుత=లంజకొడుక' యను నశ్లీలార్థమును స్ఫురింపఁజేయు పదప్రయోగము చేసె నని యిచటి యాక్షేపము. ఈపద్యమునకు వెనుకటిపద్య మిది.

గీ. తపసి వైయుండి తగు కోరి! ధనువుఁ బట్టి
శాంతిపరులకు నేలరా! సత్త్వహింస
కపటధార్మిక! యత్యంతకల్మషాత్మ!
యెవ్వఁడవు కోరి! నాపంది నేయు నీవు.

ఈశ్వరుఁడు తా నెఱిఁగియే యర్జునున కుద్రేకము కలిగించుటకై 'కపటధార్మిక! అత్యంతకల్మషాత్మ! ఎవ్వఁడవు కోరి నాపంది నేయు నీవు?' అనుచు, నాక్రమమున నే 'రండాసుత!' యనినాఁడు. ఈతుదిమాట యనినపుడుగాని యర్జునన కొడలుమండదు. ఒడలుమండినఁగాని యీశ్వరునితో డీకొని తనవిక్రమమును సాహసమును బ్రదర్శించుట కవకాశమే లేదు. అప్పుడుగాని పాశుపతాస్త్రప్రాప్తియు లేదు. కావున నిచట నీయధిక్షేపము ప్రకృతవిషయసాధకమే కాని యాక్షేపణార్హము గాదు. ఇట్టియధిక్షేపవచనములలో నశ్లీలము స్ఫురించు నేని, యీక్రిందిఘట్టమునం దేల యశ్లీలము భాసింపరాదు.

భిక్ష లేదని యింత కోపింతు రయ్య!
కాశి కాపట్టణము మీఁదఁ గానినేయ! — భీమ. 2-84.

ఇది యన్నపూర్ణాదేవి కాశిని శపింపఁబూనిన వ్యాసు నను(గ)హింపఁదలఁచినప్పుడు చేసిన (ప్ర)సంగము. ఇచట 'కాని నేయ' యనుపదము సత్యవతి కన్యయై యుండినపుడు పరాశరమహానికి వ్యాసుఁడు జన్మించిన వృత్తాంతమును స్ఫురింపఁ జేయుచున్నది. ఇదియుఁగూడ నధిక్షేప(ప్ర)సంగమే. ఇట్టి పట్టులం దశ్లీలము స్ఫురించు ననుకొనినచో నిఁక స్ఫురింపని తావు లెక్కడ నుండును? ఇట్టియర్థమునే తలఁపింపఁజేయు 'యోజనగంధినందనుఁడు నూర్వశిపట్టియు' ఇత్యాదిస్థలము లందుఁగూడ నశ్లీలమే స్ఫురింపవలసివచ్చును. ఇంతకుఁ బై పద్యము సాధిక్షేపవచన(ప్ర)సక్తికై యుప(క్ర)ాంతమైనది. కావున నిట్టిపట్టులం దశ్లీలశంక సహృదయులకుఁ బొడమ దనియే నాయూహ.

౪. ఇట్టిదియే కాశీఖండమున దక్షేశ్వరలింగమాహాత్మ్యనిరూపకమైన ఘట్టమున నశ్లీలార్థమును స్ఫురింపఁజేయు చున్న దని తెలిపినవిషయము. వా రుదాహరించిన పద్య భాగ మిది.

ఏమి గుడువంగ వచ్చినా రిండ్లు విడిచి
హరుని వెలివెట్టినట్టి యీయాగమునకుఁ
బంచవదనుని కను జేవురించెనేని
తత్క్షణంబునఁ దమయాంధ్ర (ప్ర)తాప్లువగవె?

దక్షాధ్వరధ్వంసప్రకరణ మిది. దక్షుఁడు తనయల్లుఁడైన శివుని బరాభవింపఁ దలఁచి, ఆతని బిలువకుండ యజ్ఞము సేయఁ దలపెట్టి, దేవతలను ఋషులను బిలువఁబంచెను. ఒక్కపరమేశ్వరుఁడుదక్క మిగిలినదేవత లందఱు ఋషు లందఱు నాయజ్ఞమున కుపస్థితులై యుండిరి. అట్టితఱిని 'దధీచి' యను బ్రహ్మర్షి దక్షుని యవివేకమును తొలఁగిం చుటకై యాతని మందలించుచు నిట్లు నుడివెను.

క. వామాంగము వైకుంఠుఁ డ
వామాంగము వేధ మదనవైరికి నని యో
సోమప! యెఱుఁగుదొ యెఱుఁగవొ
యామృడు రక్షింపవలదె యధ్వరమునకున్.

యజ్ఞస్వరూపుఁడైన విష్ణువు పరమేశ్వరునిశరీరమున కెడమభాగము. యజ్ఞకర్మప్రతిపాదకమంత్రోపదేష్టయైన బ్రహ్మ యాతనిశరీరమునకు కుడిభాగము. యజ్ఞమునందు సోమపానము ప్రధానము, సకలదేవతాప్రీతికరమును. బ్రహ్మవిష్ణుస్వరూపుఁడైన పరమేశ్వరుని రక్షింపకుండ నీయాగము జరుగుట యెట్లని యీపద్యభావము. ఈయుపస్థితులైన దేవత లందఱు నీశ్వరుని భృత్యులు గారా? ఈశ్వరుని రావింప కుండ నీవచ్చినదేవత లెట్టు లీయజ్ఞమున హవిర్భాగములు స్వీకరింపఁగల? రని దధీచి యధిక్షేపము సేయ మొదలు పెట్టినాఁడు.

సీ. శితికంధరునకు నెచ్చెలి కాఁడు గాఁడొకో!
యటమటీఁడైన యీయుక్షభర్త

యహికంకణునకు మూఁడవకన్ను గాఁడొకో!
ప్రాల్మాలినట్టి యీ పావకుండు
పురవైరి కవతంసపుష్పంబు గాఁడొకో!
నిర్భాగ్యుఁడైన యీనీరజారి
గంగాధరునకు లెంకలలెంక గాఁడొకో!
పెనుగూళయైన యీయనిమిషేంద్రుఁ
డేమి గుడువంగ వచ్చినా రిండ్లు విడిచి
హరుని వెలిపెట్టినట్టి యీయాగమునకుఁ
బంచవదనుని కను జేవురించె నేని
తత్క్షణంబునఁ దమయాండ్ర త్రాళ్లుదెగవే! ‒ కాశీ. 7-60.

ఈయజ్ఞమున కుపస్థితులైన దేవతలలోఁ బ్రధానహవిర్భాగముల నందుకొనువారు పరమేశ్వరునకు మిత్రులు భృత్యులు గానివా రెవరున్నారు? వ్యర్థుఁడైన యీకుబేరుఁడు గరళకంఠునకు ముఖ్యస్నేహితుఁడు గాఁడా? గతిలేని యీ అగ్నిహోత్రుఁడు భుజగభూషణునకు మూఁడవకన్ను గాఁడా? నిర్భాగ్యుఁడైన యీచంద్రుఁడు త్రిపురారికి తలపూవు గాఁడా? అతిమూఢుఁడైన యీదేవేంద్రుఁడు గంగాధరునకు దాసానుదాసుఁడు గాఁడా? అట్టిహరుని దూరము చేసిన యీయాగమునకు మీరందఱు మీయిండ్లు విడిచి యేమి యనుభవింపవచ్చినారు? పరమేశ్వరుఁడు కన్నెఱ్ఱఁ జేసిన మీరందఱు సమసిపోరా? యనునది యిచటి యధిక్షేపము. ఇం దశ్లీలము స్ఫురించుచున్న దని యాక్షేపము. ఆక్షేపమును స్ఫురింపఁజేయు ప్రయోగములు 'ఏమి కుడువంగ వచ్చినారు' 'ఆండ్ర త్రాళ్లు తెగవె?' యనునవి.

కుడుచు ధాతుప్రయోగముచే నిచట మోటుమాట స్ఫురిం
చుచున్న దని శాస్త్రిగారి యుద్భావన.

సోమయాగము లన్నిటియందును సకలదేవతాప్రీతి
కరము సోమరసపానము. సోమరసమును దేవతల కర్పిం
చుట, హోమశేషమును యజమానసహితముగ ఋత్విజు
లందఱు వరుసగఁ ద్రావుటయు శ్రౌతసూత్రవిహితము. దాని
కర్హానర్హతలు పరిగణించుటయుఁ గలదు. యజ్ఞస్వరూపుఁ
డైన విష్ణువు వామాంగముగాఁ గలమృడుని రప్పింపకుండిన
యీయాగమున మీ రేమి కుడువంగ వచ్చి రనుటలో,
మీకు సోమరసపాన మెట్లు చేకుఱు ననియే యిచటి ప్రాకర
ణికమైన యర్థము. రుద్రునిక న్నిజ్జ్వాజిన ఫాలనేత్రము
నుండి యగ్నికీలలు రేగిన మీరందఱు నశింతురని 'ఆంద్ర
త్రాళ్లు తెగవె!' యని యిచటి యధిక్షేపమున కర్థము. ఈ
కుడుచుధాతువును నన్నయభట్టారకుఁడు - భుజించు, అనుభ
వించు ననునర్థములందుఁ బలుతావులఁ బ్రయోగించి
యున్నాఁడు. ఈకాశీఖండమునందే యీయాశ్వాసమునందే
యన్నపూర్ణాదేవి వ్యాసునితో సంభాషణము సాగించుప్రక
రణములో నాయమ్మచే నిట్లనిపించినాఁడు. "అటు విశేషించి
యాకొన్నాఁడవు కావున నిన్ను హెచ్చుకుండాడుట మముఁ
బోటిగృహిణులకు మెచ్చుగాదు. మాయింటికిఁ గుడువ
రమ్ము. కుడిచి కూర్చున్నపిమ్మటం గొన్నిమాటలు నీతోడ
నాఁడఁగలవు." అనిన దన్నపూర్ణాదేవి. —కాశీ. 7-116.

ఈమాటలో 'కుడుచు' ధాతువునకు భుజించు నను నర్థమే కదా స్ఫురించునది. లేక శ్రీనాథునిప్రయోగము గనుక నిచటఁగూడ నశ్లీలమే స్ఫురింపవలయునా! ఈశ్రీనాథుఁడే శివరాత్రిమాహాత్మ్యమునందు 'అనుభవించు' అను నర్థమున 'కుడుచు' ప్రయోగించియున్నాఁడు కనుఁడు.

పాండుభూపాలుఁడు పరలోకగతుఁ డైనఁ
గుంతి నావకు దేమి కుడువ నుండె? —శివరా. 3-76.

మఱియు నీయాగప్రకరణమున ప్రధాన మయినది సోమరసపానము. అది యెట్లు సమకూడఁగల దనియే యిచటి ప్రాకరణికమైన యర్థము. ఇది దధీచి చేసిన యధిక్షేపవచనము గావునఁ దెలుఁగుపరిపాటినిబట్టి శాస్త్రిగా రనుకొనెడి మోటుమాట స్ఫురించు ననుకొనినను శ్రీనాథుని శీలమును గూర్చి శంకించునంతటి దోషము కానేరదు. 'లెంకకు లెంక' యనుదానికి 'దాసానుదాసుఁడు' అను సంస్కృతార్థముగాక తెలుఁగర్థమును గ్రహించిన 'తొత్తుక్రిందతొత్తు' అని యనుకొనవలయును గదా! అప్పు డశ్లీలార్థము స్ఫురింపదా? ఈయధిక్షేపప్రకరణమున వచ్చినవారికి రావించినవారికి హృదయమున గ్రుచ్చుకొనునట్టులు ప్రసంగము సేయవలయును గావున, అటమటీఁడు, ప్రాల్మాలిన, నిర్భాగ్యుఁడు, పెనుగూళ, అనుపదములు కూర్పఁబడినవి. తత్సమకక్ష్యత యేర్పడుటకే 'ఏమి కుడువంగ వచ్చినారు' 'ఆంధ్రజాతాల్లు తెగవె?' అను తెలుఁగుజాతీయము లుపయుక్తమైనవి.

మఱియు నీదక్షాధ్వరధ్వంసప్రకరణములో రౌద్ర రసావిష్కృతి విశిష్టముగ సాగింపఁబడినది. దధీచి యింత తీవ్రముగ నధిక్షేపించినఁగాని, పరమమాహేశ్వరుఁడైన దధీచిపై దక్షునకుఁ గోపము రాదు. కోపము వచ్చినఁగాని యాతఁడా సభనుండి తరలిపోవుటకు వలనుపడదు. దధీచి వంటి బ్రహ్మర్షి గావుననే సదస్యులనెవ్వరిని లెక్కసేయక యిట్లధిక్షేపింపఁ గలిగినాఁడు. అధిక్షేపమున కుపక్రమించిన చోట శ్రీనాథుఁడు ప్రకరణోచితముగ తీవ్రభాషణమునే సాగించును. కావున నీపట్టున శ్రీనాథునిప్రయోగవిషయమున శంకించుట భావ్యము గాదనియే నాయూహ.

4. శ్రీనాథుఁడు శివశర్మోపాఖ్యానమున, కాంచీపురీ దర్శనప్రకరణమున సంస్కృతమూలమునందు లేకుండినను కంచియఅవతల సౌందర్యము నభివర్ణించుట యాతనిశృంగారిత్వమునకు నిదాన మనినారు ప్రభాకరశాస్త్రిగారు. శ్రీనాథుఁడు కాంచికిఁ బోయినపు డీచాటుపద్యమును సంతరించుకొని యుండి, ఆమంచిపద్య మెక్కడఁ జెడిపోవునో, యను లోభముచే నస్థానమయినను నిచటఁ గూర్చె ననియున్నారు. ఆపద్య మిది.

సీ. మడుపంగ నేర్తురు మాల చాపటికి రాఁ
జికురబంధము లీఁగ జీరువాఱఁ
బొన్నపువ్వులఁ బోలు పొక్కిళ్లు బయలుగాఁ
గట్టనేర్తురు సీర కటిభరమునఁ

చౌడువంగి నేస్తురు నిద్రవేలు చెవ్రలంచు
నవతంసకఁబుగా నల్లిపువ్వు
పచరింపనేస్తురు పదియాఱువన్నియ
పసిఁడి పాదంబుల పట్టుచెల
పయ్యెద ముసుంగుఁ బాలింప్లఁ బ్రాకి నీరు
తఱుము పూఁయుము రోలగందంపుఁబసుపు
బఁదికి త్తెలు సురతప్రపంచవేళఁ
గంచి మాఱువత లసమాస్తృకుగ్లఁతలు.

శివశర్మ గృహస్థాశ్రమమున నుండి యనుభవింపవల
సిన సుఖదుఃఖము లన్నియు ననుభవించి, దేహ మనిత్య మని
యెంచి, తీర్థసేవకై కదలి, సప్తపురీయాత్ర సాగించుచుఁ గాం
చికిఁ జేరి, యచటి వరదరాజస్వామిని కామాక్షిని ఏకామ్ర
నాథుని భజించె నని తెలుపుఘట్టములో నమూలకముగ
నీకంచిగఱితల సౌందర్యము వర్ణించుట యశ్లీల మని భావించి
శ్రీనాథుని స్త్రీలౌల్యమును సమర్థించుట కీపద్యము నతికించి
నారు. దీనియం దశ్లీలమును స్ఫురింపఁజేయు పదము సురత
ప్రపంచవేళ యనునది.

శాస్త్రిగారే 'శ్రీనాథుఁడు సౌందర్యాభిమాని' యను
టకు 'చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడు' 'నూనూఁగు
మీసాలనూత్నయౌవనమున' 'ప్రౌఢనిర్భరవయఃపరిపాక
మున' ఇత్యాది పదప్రయోగములు నిదర్శకము లనినారు.
శ్రీనాథుఁ డాంధ్రజాతీయ మహాకవి. ఆంధ్రదేశమునందుఁ
గాని, యిరుగుపొరుగు దేశములందుఁగాని ప్రేక్షణీయవస్తు

వేది కంటఁబడినను దాని కొంకరూపకల్పనచేసి నిరూపించుచు వచ్చినాఁడు. మానవసౌందర్యమే కాదు. ప్రేక్షణీయదృశ్యమేది యయినను దానిని తనగంటము చేఁ గవితాపటమునఁ జిత్రించుచువచ్చినాఁడు. ఆతని ప్రబంధములందును చాటువులందును గావించిన సౌందర్యావిష్కారసృష్టియంతయు నిందులకు నిదర్శనము. కాంచీపుర వర్ణనప్రసక్తి వచ్చినదిగావున కంచియంవతల సౌందర్యమును వర్ణించుచు, వారల కట్టుజుట్టులతీరు, అలంకారరచనాక్రమము నిట నాసూత్రించినాఁడు. ఎత్తుగీతిలోని మూఁడవపాదమున 'సురతప్రపంచవేళ' అనుచోట 'ప్రసంగవేళ' అనుపాఠ మొకటికలదు గాని, దాన యతిభంగము గలుగును. 'ప్రపంచవేళ' అనునపుడు 'విస్తృతిసమయమున' అనునర్థ మనుకొనిన పైపాదముల యర్థముతోఁడిపొత్తు కుదురదు. 'ప్రపంచవేళ' అనుపాఠ ముండినను ప్రసంగవేళ యనియే యర్థము చెప్పుకొనకతప్పదు. ఆపట్టున నశ్లీలార్థమే స్ఫురింపదేమో! పురుషులను స్వాధీనము సేయఁజాలిన విలాసములు గలకంచిగణికలు మన్మథుని కటారికత్తెలవలె మెలఁగుచుఁ, బైసీసపాదములలోఁ జేర్కొనిన వేషభూషాదికమును దాల్తు రని భావము. ఇప్పుడు శివశర్మ గృహస్థుఁడయి యుండియే విరక్తుఁడై సప్తపురీయాత్రకు బయలుదేఱినాఁడు. ఆతనికిఁ గంటఁబడినదృశ్య మిది. విరక్తునకు విషయదోషానుదర్శన మాకాంక్ష్యమే. ఆక్రమమున నిచట నీపద్య ముండినను విరోధము లేదు.

శ్రీనాథుఁ డీకాశీఖండమున మూలము మీఱి యెన్ని యో తావులందుఁ బ్రకరణోచితముగ సౌందర్యపరిష్కారము నెంతేని గావించియున్నాఁడు. ప్రకరణము వేఱుగాని, పరమ పతివ్రతయైన శుచిష్మతీదేవిసౌందర్యమును గూడ నిట్లే చిత్రించి నాఁడు.

సీ. అనుదినంబును బ్రాతరారంభవేళల
నోలగంధంబుతో నుదకమాడి
యంచవన్నియతోడ నందమైన మడుంగు
నిద్దంపుఁబుట్టంబు నెఱియఁగట్టి
నెఱయంగఁ గూడిన నెఱికూఁకటులు పాపి
పొంకంబుగాఁ గమ్మపూలు తుఱిమి
కాశ్మీరతిలకరేఖామధ్యమునయందుఁ
బుణ్యంపుఁ జిటిబొట్టు పొందుపఱిచి
విసువు లే కగ్నిహోత్రంబు వేల్వఁ బెట్టు
ధూపదీపంబుతోఁగూడ దేవపూజ
కోగిరంబులు గావించు నొప్పుగాఁగ
బాల ప్రాణేశుహృదయంబు పల్లవింప. — కాశీ. 3-213.

ఈశుచిష్మతిచేతను ఓలగందపుఁబూఁతతో స్నానము చేయించి, అందమైన వస్త్రముఁ గట్టించి, జుట్టు దువ్వి పువ్వులు పెట్టించి, అందముగా బొట్టు పెట్టించినాఁడు. కంచి యవతలసౌందర్యము నెంతఠీవిగ వర్ణించినాఁడో, శుచిష్మతీ సౌందర్యముసైత మంతఠీవిగనే చిత్రించిపెట్టినాఁడు. ప్రకర ణమునందలి మార్పేగాని, పరికరమునందలి మార్పేమియు

లేదు. సద్భావముతోఁ బరికించిన పైకంచియవతలను వర్ణించినపద్యమునందుసైతము శ్రీనాథుని సౌందర్యాభిమానమే చూపట్టును. ఇట్టిసౌందర్య రేఖాచిత్రణము స్త్రీపక్షమునసే గాదు. అది సర్వవస్తుసామాన్య మని యాతనిరచనలఁ బరికించిన గోచరించును. ద్వారకాపట్టణవాసిప్రాణులకుఁ బ్రాణావసానసమయమున సమకూడు విష్ణుసారూప్యము నెట్లు చిత్రించెనో కనుఁడు.

సీ. కట్టు రింగులువాఱఁ గటిభాగమునయందుఁ
బసిఁడికమ్ముల పచ్చపట్టుచేల
వక్షస్స్థలంబున వనమాల ధరియించుఁ
గౌస్తుభగ్రైవేయకమునఁ గూర్చి
సేసకొప్పునఁ జుట్టు శిఖిపింఛరింఛోళి
మక్కళించిన జిగ్గుమడుఁగుఁబాగ
గొజ్జంగిపూనీరు కులికి మేదించిన
కమ్మకస్తురి మేనఁ గలయ నలఁది
ద్వారకాపట్టణముపొలిమేరసీమఁ
గాలవశమున నీల్గిన క్షణమునందుఁ
గైటభారాతి సారూప్యగరిమగన్న
కీటపక్షిసరీసృపక్రిమికులంబు. — కాశీ. 3-118.

ఈకాశీఖండమునం దిట్టి సౌందర్యచిత్రణము దేవతామానవస్త్రీసాధారణముగాఁ గావించినాఁడు. ఈక్రిందిపద్యమునకుఁ గూడ సంస్కృతమూల మేపాటియు నాధారము లేదు. ఈపద్య మీప్రకరణమున లేకుండినను గొఱఁత లేదు.

కాని యిచటి సౌందర్యరేఖాచిత్రణము సత్యద్భుతముగఁ గావించియున్నాఁడు. భావనామధురమైన యొకయద్భుత దృశ్య మీపద్యమునఁ జూపట్టును.

సీ. త్రసరేణుపరిమాణధాతుధూళీపాళి
యలకంబులకు వింతచెలువు నొసఁగ
ఘనమైన రారాపుఁ జనుదోయి రాయిడి
నిలుపేదనడుమునకు నెఱపుఁ జూపఁ
బొలుపారు మెఱుఁగుఁడీఁగల నేలుకన్నులు
వడ దాఁకి యొక్కింత వాడువాఱ
సిందూరతిలకంబు చెమటచిత్తడి దాఁకి
యళికభాగంబునం దసలుకొనఁగఁ
గనకమేఖల జఘనచక్రమున వ్రాల
నీవిబంధంబు నాభిపై నెమ్మివదల
మహతి ధరియించి యొకతనుమధ్య తన్ను
ననుచరించుచు గాంధర్వ మభ్యసింప. — కాశీ. 1-90.

నారదుఁడు వింధ్యపర్వతమును సమీపించుట యిచటి ప్రకరణము. ఈసీసగీతముల రెండిటను నారదుని వెంట 'మహతి' యను నాతనివీణ చేతఁ బూని, గాంధర్వ మభ్యసించుచు వచ్చుచున్న మార్గాయాసవిశ్లథావయవయైన యొక స్త్రీసృష్టి. ఈదృశ్యమును గుంచె చేతఁబట్టి చిత్రఫలకమునఁ జిత్తరువు వ్రాయఁ దలపెట్టిన నెంతటిచిత్రకారునకైన, నిందుఁ జూపట్టుమూర్తిని సాక్షాత్కరింపఁజేయుట కష్టసాధ్యమైనపని. ఇది యెంతటి ప్రేక్షణీయదృశ్యమో పరికింతము.

ఆతనుమధ్య యలకములపైఁ గంటి కగుపడునంతటి గైరికాదిధాతువుల (రంగురాళ్ల) ధూళి పడి వింతయైన యందము నిచ్చినది. పెద్దవియైన యా మెవక్షోజము లొకదానితో నొకటి రాపాడుచుఁ గడు సన్నని నడు మేమగునో యని భయము గొలుపుచున్నవి. మెఱుఁగుదీఁగల మించిన తళుకులుగల కన్నులు మార్గమునం దెండవేడిమి తగిలి యించుక వడలఁబాఱినవి. మార్గాయాసమునఁ జెమట పొడమి సిందూరపుబొట్టు జాఱి భ్రూమధ్యమునందు బందగఁ బ్రాకినది. పసిఁడియొడ్డాణము వదలై జఘనముమీఁదికి వ్రాలినది. కోకముడి పట్టుసడలి నాభినుండి సడలినది. ఈతీరుగ మార్గాయాసఖిన్నయై విశ్లథావయవయై పరమప్రేక్షణీయమూర్తియై నారదుని వెంట గాంధర్వ మభ్యసించుచు వచ్చినదఁట యాతనుమధ్య. ఇట్టి సౌందర్యరేఖాచిత్రణము శ్రీనాథుఁడు మఱియేతావునందును జేయలే దనవచ్చును. ఇచట భావనానుగుణమైన భాష శైలి కూడ జతఁగూడినవి. ఈచిత్రమును భావించినచో మార్గాయాసపరిఖిన్నమూర్తియే గాదు, నిశితముగఁ బరికించిన రతిశ్రమపరిఖిన్నమూర్తిసైత మిటుఁ జూపట్టును. మూలాతిక్రమణమున నస్థానమున కంచియవతల సౌందర్యాభివర్ణన మశ్లీలాకరమైన నీపద్యముకూడ నట్టిదియే కావచ్చును. శ్రీనాథునిసౌందర్యాభిమాన మిచటి స్త్రీవర్ణనమునకు సమర్థక మగుచో కంచియవతలవిషయమున మాత్రమేల కారాదు. పైవిషయములనుబట్టి శ్రీనాథుఁ

జేదియేని యొకవస్తువును వర్ణింప సమకట్టినచో నామూర్తి మనకన్నులయెదుట సాక్షాత్కరించునట్లు సేయుట యాతనికవితాశిల్పమునకుఁ గల ప్రత్యేకత. కాంచీపురీప్రసక్తి వచ్చినది. తానీవఱకుఁ జూచిన కంచియఁబవతల సౌందర్య మూర్తిని జిత్రింపఁ దలఁచిన దాని కనువు కుదిరినది; గావున, దానికై సురతప్రపంచవేళను గల్పించినాఁడే గాని, కంచియ బవతలతోఁ దన కీవఱ కేర్పడియున్న శృంగారానుభూతిని వ్యక్తముచేయవలయు నని కక్కుఱితితో వ్రాసినాఁ డని యూహించుట సహృదయలక్షణము గాదని నాయూహ.

5. ఈవిధముగనే శివరాత్రిమాహాత్మ్యమున, శ్రీనాథునిశీలమును బట్టియిచ్చు జుగుప్సాకరమైన విమయ మని రెండుపద్యముల నీసందర్భమునందే యుదాహరించి యున్నారు. సుకుమారుఁ డను అమాత్యపుత్త్రుఁడు మహా సౌందర్యవంతుఁడు పారదార్యవ్యసనముచే పురనిష్కాసితుఁడై, హూణమండలమునకుఁ బోవుచు నడుమ నొకసరోవరతీర మునఁ జండాలిని గూడినప్పటిఘట్టములోని వీపద్యములు.

గీ. అనుచు విప్రుండు తమకించి యంటుకొనియె
సమ్మతించియు యుండె నాచంద్రవదన
ఘూకలాళ్వంబు నసరేపఁ జొచ్చినప్పు
డనుమతింపవె యత్తడి గ్గొనబడబ. —శి. రా. 3-69.

సీ. గీ. ఎట్లు కనుఁబ్రామ వచ్చునో యింటివారి
నెట్లు చీకటి నొంటిపై నింటి కరుగు

సతివ పగలైన రేయైన నతనితోడ
నిచ్చ లొకసారి సాగించు నిధువనంబు. — శృం. 3-114.

సుకుమారుఁడు సరోవరతీరమున నలవోకగాఁ జూచిన చండాలాంగనసౌందర్యమున కబ్బురపడి, యామెను గవయఁ గోరెను. ఆమె తన యంటరానితనమున కెంతయుఁ జింతిం చుచు నాతనివలపు దీర్చుట కంగీకరింపదయ్యె. సుకుమా రుఁడు 'నీవు శాపవశమున భూలోకమున జన్మించిన దేవతా జాతిస్త్రీవి గాని, సామాన్యవు గావు' అని యామె నల యించుచు

గీ. వనిత నీచిత్తమున కేను వత్తునేని
కామతంత్రంబునకు సంచకరము గాఁగఁ
జుంబనము సేయుని మోష్ఠబింబ మిప్పుడు
గండుఁగోయిల చిగురాకుఁ గమిచినట్లు.

అని యామెతో ననును. అనఁగా, ఓవనితా! నేను నీమనసునకు నచ్చినచో మన్మథవ్యాపారమునకు సంచకరము (బేరముతిరిగిపోకుండుటకై ముందుగఁ బెట్టిన ధనము) గాఁగ, గండుకోయిల చిగురుటాకును గొఱికినట్టులు నీబింబా ధరమును చుంబనము సేయనిమ్ము. అని మృదుమధురముగ నర్థించుచుఁ దమకము హెచ్చి యాచండాలి నంటుకొనెను. అతఁడు తన్నంటుట కామె సమ్మతించియే యుండెను. దీనిని, ఋతుప్రసృతిగల యాడుగుఱ్ఱమునకు పొగరెక్కిన మగగుఱ్ఱ ముద్రేకము కలిగించినపుడు తాఁకుటకు సమ్మతించియుండదా?

యను నుపమాసామగ్రిచే సమర్థించియున్నాఁడు శ్రీనాథుఁడు. ఋతుమతియైయున్న చండాలిని అత్తడియైన బడబతోడను, ఉద్రిక్తుఁడైన సుకుమారుని శోకలాశ్వంబుతోడను బోల్చుటలో స్వాభావికత యెంతేని జతగూడినది. ఈపద్యముతరువాత 'ధీరోదాత్త యగుట నమ్మత్తకాశిని చిత్తజాయత్త యయ్యును దత్తరపాటు లేక యతనితో నిట్లనియె' నని గలదు. చండాలి చిత్తజాయత్తయయ్యుఁ దత్తరపాటు లేకయే యాతనితోఁ బ్రసంగించె ననుటచే నామె యాతని స్పర్శనమాత్రమునే యంగీకరించె ననువిషయ మిటఁ దెల్లమగుచున్నది. తరువాతి చండాలీసుకుమారుల సంభాషణక్రమమును బట్టి చూచినను జండాలియందు ధీరోదాత్తతయే గానవచ్చును గాని యాపద్యమును బట్టి యశ్లీలార్థము స్ఫురించు నవకాశ మేమియుఁ గానరాదు. జాతిభ్రష్టుఁడై పారదార్యముచేఁ బుధనిష్కాసితుఁడైన సుకుమారుని పతితత్వమే 'అనుచు విప్రుండు తమకించి యంటుకొనియె' నిత్యాదిపద్యమున నెఱుఁగవచ్చుచున్నది. ఈవిషయమునుగూర్చి విపులముగ నేను రచించిన 'శివరాత్రిమాహాత్మ్యము-కావ్యత్వము' అను వ్యాసమున నిరూపించియుంటిని.* శాస్త్రిగారీ ప్రబంధోదాహరణములందు, శ్రీనాథునిశీలమును తీర్చిదిద్దుటకై యుదాహరించినతావులందెల్ల వెనుకముందుల నేపాటియు నుదాహరింపరైరి. వారనుకొనిన విషయమునకు సమర్థక మగునంత

* చూ. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సం. 48. సంచిక. ౨,౩.

వఱకేగాని, దానికి విరోధించువిషయముల నేపాటియుఁ దల
పెట్టరైరి. ఒకసిద్ధాంతమును బలపఱుపఁజూచువా రట్లు
చేయుట సహజమే. కాని యాసిద్ధాంతము పరిగ్రాహ్య
మగునా ? కాదా ? యని సద్భావముతోఁ జూడఁగోరువారికి
వెనుకముందులు నిష్పాక్షికదృష్టితోఁ బరికించుట యత్యా
వశ్యకము. ఈచండాలీబ్రాహ్మణబ్రువసంయోగఘట్ట మశ్లీల
ముగ నడచె ననుకొనువా రెవ్వరేని గలరేని, వారి నీపద్య
ములు గూర్చినతావులందలి వెనుకముందువిషయములను
బరికింపవలయు నని సవినయముగ నర్థించువాఁడ.

ఇఁక రెండవపద్యమునందు వెలివాడచేడియ కపట
విప్రవేషముతోఁ గాలము గడుపుచున్న సుకుమారుని గూడి
చౌర్యసురతప్రవృత్తి నేరీతిని నడిపెనో, యావిషయము తెలు
పఁబడినది. ఆవిషయ మిది.

సీ. నీరాటవెపముగా నిర్ఝరంబుల కేఁగి
సవిసనీవారకుంజముల నొందు
భూధరంబుల కిప్పవుష్ప దే నని పోయి
కంద [illegible] నొందు
శిఖరీంద్రవర [illegible] పోయి
[illegible] నొందుఁ
గలమసస్య [illegible]
శణవాటికాప్రదేశముల నొందు
నెట్లు కనుఁబ్రామి వచ్చునో యింటివారి
నెట్లు చీకటి నొంటిపై నింటి కరుగు

నతివ పగలైన మాపైన నతనితోడ
నిచ్చ లోకసారి సాగించు నిధువనంబు. శివరా. 3-114.

చండాలిని సుకుమారుఁడు దీనముగ వర్థించి, తన ప్రాణములు నిలుపు మనినపు, డాతనిచే నెన్నఁడు నిన్ను విడువ నని ప్రతిజ్ఞ చేయించుకొని, 'వంచన బయల్పడకుండ నిన్ను సేవించెద' నని తాను ప్రతిజ్ఞ చేసి, యాతనిఁ గవఁగూడెను. చండాలి వంచన బయల్పడకుండునట్లు లాతనితోఁ గూడి మెలఁగినతీ రీసీసపద్యమునఁ జిత్రింపఁబడినది. ఈపద్యమునకు వెనుకటిపద్య మిది.

గీ. మాధుకరభిక్షలను స్వయంపాకములను
సత్రభోజనములఁ బితృశ్రాద్ధములను
విందులను దేహయాత్ర గావించు నతఁడు
వేదశాస్త్రపురాణప్రవీణుఁ డగుట. శివరా. 3-113.

సుకుమారుఁడు జాతిభ్రష్టుఁడై మాంసాహారియై మద్యపాయియై చండాలీసంసక్తుఁడై యుండినను, ముందుగ నాతఁడు వేదశాస్త్రపురాణప్రవీణుఁ డగుటచేఁ గపటవిప్ర వేషమునఁ గాలము గడుపుచు, మాధుకరభిక్షాదికముచే దేహయాత్ర గావించుచు, మాలెతతోఁ గూడి సురతసౌఖ్య మనుభవించుచుండెడివాఁడు. మాలెతయు వంచన బయల్పడ కుండ నింటివారి కను మొఱఁగి పగలైనను మాపైనను రహస్యముగ నాతనితో రమించుచుండెడిది. తనయింటివారి కైనను దెలియనీయకుండ, చౌర్యసురతములచే నావిప్రు

నెట్లు తనియఁజేయుచుండెడిదో యావిషయ మీపద్యమునఁ దెల్లమైనది.

ఈప్రబంధాదిని శ్రీనాథుఁడు శివరాత్రిమాహాత్మ్య వస్తూన్మీలనక్రమము నెఱిఁగించుచు, దీని నష్టాదశవర్ణనాసమన్వితంబుగ సమకూర్చెద నని ప్రతిజ్ఞ చేసి నిర్వహించి యున్నాఁడు. అష్టాదశవర్ణనములలో రతోత్సవవర్ణనము కూడ నొక్కటి గదా! ఈప్రబంధమున శృంగారరసనిర్వహణప్రసక్తి సుకుమారచండాలీసమాగమఘట్టమునందే యేర్పడినది. పారదార్యమునఁ బతితుఁడు గావలసిన సుకుమారుఁడు చండాలిని జేపట్టినప్పుడే తద్వర్ణనము సేయుట సముచితము. శ్రీనాథుఁడు పరిమితకథావస్తువుగల దీనిని సకలప్రబంధలక్షణసమన్వితము గావింపఁ దలపెట్టినవాఁడు గావున, వెలివాడచేడియ నుత్తమపాత్రముగాఁ జిత్రింపఁ దలఁచినవాఁడు గావునను, సుకుమారుఁడు సర్వథా పతితుఁడు గావలయును గావునను, తననాఁటి వెలివాడవారి స్వరూపస్వభావముల నెఱిఁగింపఁ దలపెట్టినవాఁడు గావునను నిచట నీచౌర్యసురతప్రసక్తిని సైతము నౌచితీభంగము లేకుండ నతిసహజముగఁ జిత్రించి పెట్టినాఁడు.

నిధువనప్రసక్తిని దెచ్చినంతమాత్రమున శ్రీనాథు నుచ్ఛృంఖలప్రకృతిగల శృంగారినిగాఁ జేయఁ దలఁచినచో మఱియెందఱఁ గవుల నట్టివారినిగాఁ జేయరాదు. అదియును గాక పాత్రోన్మీలనదృష్టితోఁ గవి, కవితాచమత్కృతిని

ప్రదర్శించుసరణిని నిరూపించినవిషయము లాతని దుశ్చారిత్రమునకు సూచకము లనినవో వాచ్యవ్యంగ్యరూపమున సురతమును వర్ణించినకవుల నెందఱిని దుశ్చారిత్రులనుగా గణింపరాదు. అట్టిప్రశ్నోత్తర శ్రీనాథునకే యన నేమి! కాపుఁబడఁతితో డను స్లవకన్యకో డను నిగమశర్మను గవఁ గూడఁజేసిన పాండురంగవిభున కిట్టిశీలము సంటఁగట్టవలసి వదియేనా? "సహసా నఖంపచన్దశదత్తపరిరంభ మూమూల పరిచుంబితాధరోష్ఠము" ఇత్యాదిపద్యముల వరూథినీ మాయాప్రవరుల సురతప్రక్రమమును గ్రంథస్థము గావించి పెట్టిన ఆంధ్రకవితాపితామహు నేమనవలెను? శ్రీనాథుని సమకాలికుఁడు, శ్రీనాథునికంటెఁ బరమశివభక్తుఁడుగా లెక్కింపఁబడు నిశ్శంకకొమ్మనామాత్యుఁడు తనశివలీలా విలాసమున దేవదారువనవిహారఘట్టమున పురుషాయితమును బంధాదికమునుగూడ పరమేశ్వరాశ్రయముగా వర్ణించిపెట్టి నాఁడు. అట్టి యాతనిరచనను బరికించినపు డాతనిశీలము నెట్లు తీర్చిదిద్దవలయునో?

శాస్త్రిగారు క్రీడాభిరామముపీఠికలో నీక్రిందివాక్యములను సంతరించియున్నారు. "సత్ప్రబంధములందుఁగూడ నిట్టిరచనలను సంకోచింపక నిరంకుశముగాఁ జొప్పించుటకు శ్రీనాథునిశీల మెట్టిదైయుండునో, యించుక యూహించిన గోచరించును. శివరాత్రిమాహాత్మ్యమును జెప్పు పవిత్రగ్రంథమున సంస్కృతమూలమున లేని చండాలాంగనాబ్రాహ్మణ

బ్రబువసంభోగసంభారము నంత సంపూర్ణముగా వర్ణించియే తీఱవలెనా? కాశీఖండమునఁ గంచియవతల ముచ్చటలను బచ్చిగా వర్ణింపవలసినదే? హరవిలాసమున శివలింగోత్పత్తి కథ నంతకంటె సభ్యముగా సాగింపఁదగదా! సత్ప్రబంధము లందే లేని జంకుఁగొంకు లింక రసికులకొఱకే రచితమయిన క్రీడాభిరామమునఁ జూడఁబడునా?" ఇత్యాది...

శాస్త్రిగారు శ్రీనాథుఁడు నిరంకుశముగాఁ జొప్పించి నాఁడనిన రచనలనుగూర్చి, నాకుఁ బొడకట్టినయూహ లెట్టివో వివరించియేయుంటిని. ఈచూపించిన పట్టులన్నియు స్త్రీపురుషుల వరాంగములను సూచించు పదములకూర్పు గలవని, సురతప్రసక్తి వచ్చినదని శాస్త్రిగా రుచ్ఛృంఖలము అనినారు గాని, ఆపదముల ప్రయోగసరణినిగూర్చి వా రంతగఁ జర్చింపలేదు. శివరాత్రిమాహాత్మ్యమున చండాలీ బ్రాహ్మణబ్రువసంభోగసంభారము నంతసంపూర్ణముగా వర్ణించియే తీఱవలెనా? యని ప్రశ్న చేసినారు. ఎంత సంపూర్ణముగానో వారు తెలిపియుండిన నెంతేని బాగుండియుండెడిది. అట్లు కావింపలేదు. ఆఘట్టమున శ్రీనాథుఁడు శృంగార రసము నతిసంయమముతో నిర్వహించియున్నాఁడు. చండాలీ పాత్ర నత్యుదాత్తముగాఁ దీర్చిదిద్దినాఁడు. శృంగారమును గూర్చుట వేఱు. శృంగారరసము నాయోజించుట వేఱు. శ్రీనాథుఁడు తనప్రబంధములలో శృంగారరసమును గూర్చి నాఁడు గాని, తాను శృంగారి యనిపించుకొనఁ దలఁచి

శృంగారమును గూర్చియుండలే దనువిషయము రసికులయిన వారికి సమ్యగ్దర్శనము గావించిన గోచరింపక మానదు.

కాశీఖండమునఁ గంచియఱవతలముచ్చటల నంత పచ్చిగా వర్ణింపవలసినదేనా ? యనినారు. ఎంతపచ్చిగానో యెఱిఁగింపరైరి. శ్రీనాథుఁ డేది వర్ణించినను బరిణతముగా వర్ణించునుగాని పచ్చిగా వర్ణింపఁబోఁడు. "హరవిలాసమున శివలింగోత్పత్తికథ నంతకంటె సభ్యముగా సాగింపవలదా?" యనినారు. దేవదారువనవిహారము వర్ణించుచు శివలింగ ప్రాదుర్భావమును వర్ణించిన సంస్కృతాంధ్రకవులందఱరచనలలోను శ్రీనాథునిరచనయే మిక్కిలి సభ్యముగను సంయతముగను, బ్రహ్మానందసబ్రహ్మచారియగు రసరూపముగను సాగినది. ఆదేవదారువనవిహారమున శ్రీనాథుఁ డెంతటి సంయమును బాటించెనో, యావిషయమును 'హరవిలాసము దేవదారువనవిహారము' అనువ్యాసమున నాయోపినకొలఁదిఁ దెలిపియుంటిని. ♦

శృంగారశ్రీనాథమున ప్రభాకరశాస్త్రిగారు శ్రీనాథుని శృంగారిఁగాఁ దీర్చుట కుపసంహారమునఁ గూర్చిన వాక్యము లివి.

"శ్రీనాథుఁ డనుదినము చూచిన సుందరినిగూర్చియో, యనుభవించిన యానందమునుగూర్చియో, కాంచిన కష్టమునుగూర్చియో కవనము గట్టుచుండెడివాఁడు. అట్టివాఁ డగుటచేతనే మన కాతనిచరిత్ర మీమాత్రము తెలియఁదగిన దయినది.

---

♦ చూ. భారతి, సం-35. సం-8. 1958. అగష్టు నెల.

ఈవాక్యములు ముఖ్యముగ శ్రీనాథుని చాటువులను గూర్చి శాస్త్రిగా రుద్భావన చేసినవి. శ్రీనాథుని చాటువులనుపేర వారు సేకరించిన పద్యము లన్నియు వానివే యను కొనునప్పటికి వారిమనసున పొడలిన యూహా లివి. శ్రీనాథుఁడు తనకంటఁ బడిన ప్రేక్షణీయదృశ్య మేది యైనను దాని కొకరూపము నుపకల్పించి చాటువులలో మధురముగఁ జిత్రించినమాట నిశ్చయము. ఆచాటువులలో నాతఁడు నిరూపించినవి—తనచిత్తము నాకర్షించి యానంద మొదవించినవి, జుగుప్సను గలిగించినవి, యాతనినాఁటి జాతీయతను దెల్లము సేయునవి యైయున్నవి. ఏసుందరిని వర్ణింప సమకట్టినను తద్గతసౌందర్యమునే యాతఁడు వర్ణించి పెట్టినది. ఆతని రచనయే యనఁదగినపద్యములందుఁ జూపట్టెడిసౌందర్య రేఖ యాతని ప్రబంధములందుఁ జూపట్టెడితీరున కేపాటియు నీడఁ బోవని తీరుననే నడచినది. శ్రీనాథుఁడు సంతరించియున్న చాటువులచే నాతనిచరిత్రమే గాదు; ఆతనినాఁటి యాంధ్ర దేశచరిత్రమే సువ్యక్తమైనది. వానివి గాని చాటుపద్యములు కూడ, నాతనివిగా నెట్లు చెల్లుచు వచ్చినవియో, వానిలోఁ బ్రక్షిప్తములుగా నెంచఁదగిన వేవియో, వానినిగూర్చి యీకవితాసమీక్షలో చాటుపద్యవివరణమున నారోపిన కొలఁదిఁ దెలిపియున్నాఁడను. ఆతనిరచనలు కానివికూడ నాతని కటికించి పెట్టిననాఁ డాతఁడు శృంగారియు, శృంగారి శేఖరుఁడు నయినాఁడు.

శాస్త్రిగారి పై వాక్యముల తరువాతివాక్యము లివి—
"ఆతఁడు సౌందర్యాభిమాని. 'చిన్నారి పొన్నారి చిఱుత కూఁకటినాఁడు, నూనూఁగు మీసాల నూత్నయావనము, ప్రౌఢనిర్భరవయఃపరిపాకము' ననుపదము లీవిషయమును దెలుపుచున్నవి. మఱియు నాతఁడు శృంగారి శేఖరుఁడు. భీమ ఖండకాశీఖండగ్రంథభాగములు, వీధీనాటకము, శివరాత్రి మాహాత్మ్యము, చాటుధారలు ఐతిహ్యములు ఇతరకవి స్తుతులు నీవిషయమును రాద్ధాంతపఱచుచున్నవి. ఈవిష యమును నిరూపించుటకయి కొంతగ్రంథము వివరించి వ్రాయ మనసొల్లకున్నది..."

— శృంగారశ్రీనాథము, పుటలు. 299-300.

శాస్త్రిగారికి శృంగారశ్రీనాథము రచియించునాఁటికి మనసొల్లని విషయమునే క్రీడాభిరామముపీఠికలోఁ గూర్చి పెట్టినారు. ఆతఁడు శృంగారి శేఖరుఁ డని తెలుపుటకు వలను పడెడి భీమఖండ కాశీఖండ హరవిలాసాది ప్రబంధోదాహృ తులనుగూర్చి నాయూహాపోహమినంతకు నింతకు ముందే తెల్లము చేసియుంటిని. శాస్త్రిగారిదృష్టిలో 'వీధీనాటకము' అనఁగా వల్లభరాయవిరచితమైన క్రీడాభిరామమే కాని, అంతకు ముందు 'శ్రీనాథునివీథినాటకము' అనుపేర ముద్రి తాముద్రితములైయున్న పద్యములసంపుటి గాదని శాస్త్రి గారే శృంగారశ్రీనాథమునందును, క్రీడాభిరామముపీఠిక యందును నొక్కి వక్కాణించియున్నారు. శ్రీనాథుని

శృంగారిశేఖరునిగా లోకమున కెత్తిం గింపం దలపెట్టినవాండే శాస్త్రిగారు క్రీడాభిరామకర్త శ్రీనాథుండే యనియు, వల్లభ రాయండు 'కవీంద్రకాంక్షిత త్రిదశమహీరుహము' కావున విశేషధన మొసంగి కవియశోలోభమున నేతత్కావ్యకర్తృ త్వమును దనపై వేయించుకొన్నాండనందగు ననినారు. కాని క్రీడాభిరామమునందలి పద్యములలోం జూపట్టెడి కవితావిశే షములను సవిమర్శముగం బరికించిన నందలి కొన్నిపద్య ములు మాత్రమే శ్రీనాథునిరచనలుగను, తదన్యములు వల్లభరాయరచనలుగను సాహిత్యతత్త్వజ్ఞులకుం దోంపకపో దని నానిశ్చయము. ఈవిషయమున నాయూహలను గొంచె మాంగి వివరించువాండను.

శృంగారశ్రీనాథమునం గాని క్రీడాభిరామముపీఠికలోం గాని శాస్త్రిగారు శ్రీనాథుని శృంగారింగా నిరూపించుట కనువుపడు పద్యములనే యుదాహరించి తమసిద్ధాంతమును బలపఱచుకొనుటకు యత్నించియున్నారే గాని, యాకవి సార్వభౌముని రచనలో విశిష్టముగం గానవచ్చెడి పరమశివ భక్తిభావమునుగాని, రసనిర్వాహణపాటవమునుగాని, ప్రకృతి సౌందర్యచిత్రణశిల్పమునుగాని, కవితానిర్మాణమునం గాన వచ్చెడి యాతనిప్రతిభావ్యుత్పత్తులనుగాని, ఉత్తమనీతిబోధక మయిన ఘట్టములనుగాని, విలక్షణసౌందర్యసృష్టిని గావిం చిన పట్టులనుగాని విపులీకరింపకైరి. శృంగారింగా నిరూపింపం దలపెట్టిన శాస్త్రిగారే యాతనిం బరమశివభక్తునిగాంగూడ

నిరూపింపఁ దలపెట్టిననాఁడు నాదృష్టివలెనే వారిదృష్టిసైతము మాఱియుండెడిదేమో! ఇక్కడ స్వవిషయము కొంత తెలుపవలసియున్నది.

నే నాంధ్రసారస్వతరంగమునం దవతరించి నేఁటి కిరువదియేం డ్లయినది. 1939 లో ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునందు వ్యవహర్తగా (Manager) పనిచేయ మొదలుపెట్టిననాఁడు ముందుగ శ్రీనాథునిగూర్చిన విమర్శనగ్రంథములలో నాకంటఁబడినవి కీ. శే. ప్రభాకరశాస్త్రిగారి శృంగారశ్రీనాథము క్రీడాభిరామముపీఠికయును. తరువాతనే తదితరవిమర్శకుల గ్రంథములు పరికించుట జతపడినది. శాస్త్రిగారు జీవించియుండఁగనే 'శ్రీనాథుఁడు దర్శించిన సర్వజ్ఞసింగభూపాలుఁ డెవఁ' డనునిర్ణయమునుగూర్చి వ్రాయుచు వెలువఱిచిన నావ్యాసములు మూఁడు శృంగారశ్రీనాథములోనివిషయమునకు ఖండనరూపములుగనే బయలుదేఱినవి. రెండేండ్లక్రిందటివఱకు ప్రభాకరశాస్త్రిగారి వ్రాఁతలు నామనమున గాటముగ నాఁటుకొనియుండుటచే, శ్రీనాథుని శృంగారిఁగానే నేనును భావించియుంటిని. ఒక విచిత్రసంఘటనచే నాభావన మాఱిపోయినది. దానితో శ్రీనాథుఁడు పరమశివభక్తుఁడుగాఁ జూపట్ట మొదలుపెట్టినాఁడు. నాటినుండి యాతని కవిత్వమునందలి విశిష్టత యల్పముగ నాహృదయమునకు గోచరింపఁ దొరకొనినది. ఈనాఁడీవిమర్శనము వ్రాయుటకుఁ బూనుకొనునపుడు శాస్త్రిగారు

కీర్తిశేషులైనందులకు నేనెంతయు దిగులుపడుచునే యుంటిని, వారు జీవించియుండినచో వారికి నాయూహలను దెలిపి, వారినిగూడ నొప్పించియే నేనీవిషయమును బ్రచురించి యుండెడివాఁడను. దైవ మట్టియానుకూల్యము కలిగింపలేదు. ఈనా వ్రాఁతలవలన నేకొందఱహృదయమైన నాకువలె మార్పు నందఁగల దనునూహతో నీచేఁతకుఁ గడఁగితిని.

శ్రీనాథుని ప్రబంధములన్నిటను గానవచ్చెడి కావ్యత్వ విశిష్టతను నాయూహకొలఁది వివరించుచుఁ, గొన్నివిషయముల నీవఱకు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలందును భారతి పత్రికలందును బ్రకటించుచు వచ్చితిని. ఇఁకమీఁదఁ గూడఁ గొన్ని ప్రకటింపఁ దలఁచియుంటిని. శ్రీనాథుని కవితామహత్త్వమును, ఆతనిభావనలోని యౌదాత్త్యమును నెఱుఁగఁగోరువారావిషయములను సవ్యాఖ్యానముగ గమనించిన శాస్త్రిగారి యభిప్రాయములతో నేకీభవింపఁ జాలరనియే నానిశ్చయము. ప్రబంధములపై నారచించిన వ్యాసములుకూడ గ్రంథరూపమును దాల్చిన నాయూహ లన్నియుఁ బాఠకుల కేకముఖమున నందఁగల వను కుతూహలము గలదు. దాని కీశ్వరసంకల్ప మెట్లు సమకూడునో యెఱుఁగరాదు.

శృంగారశ్రీనాథమున శాస్త్రిగారు ఇతరకవిస్తుతులను జాలవఱ కుదాహరించియే యున్నారు. వానిలో నెచ్చటను 'శ్రీనాథుఁడు శృంగారి' యని తెలిపియున్నవారే గానరారు. ఒక్క కుమ్మరి మొల్ల చేసినకవిస్తుతియందు 'రసికుఁడు' అని

గలదు. ఆశబ్దమునకు రసజ్ఞుఁడు, రసనిర్వాహణదక్షుఁడు అను నర్థమే గాని, 'శృంగారి' యనునర్థము కవిసమయమునుబట్టి స్ఫురింపనే స్ఫురింపదు. ఇఁక నేయితరకవిస్తుతులనుబట్టి శ్రీనాథుని జారునిగా లెక్కింపవలెనో యెఱుఁగరాకున్నది. ఐతిహ్యములనుబట్టి శ్రీనాథుఁడు స్త్రీలోలుఁ డనవలె నని నారు. వారు చాటుపద్యమణిమంజరియందును శృంగార శ్రీనాథమునందును క్రీడాభిరామపీఠికయందును గూర్చి పెట్టిన యైతిహ్యములయినను వారూహించి పెట్టినవియే గాని, ఆతని స్త్రీలౌల్యనిర్ధారకములైన యైతిహ్యములుకూడ నేవియు లేవు. శాస్త్రిగారి కెవ్వరో తమకాలమున జీవించినవారు తెలిపి రనువంతటితో నట్టియైతిహ్యములు ప్రవాదము లగునుగాని, నేఁటి కయిదువందలయేండ్ల క్రిందట నున్న శ్రీనాథునిశీల మును నిర్ణయించుట కవి ప్రమాణములు గానేరవు.

ఇఁక చాటువులవిషయము. వానిలోఁ జాలపద్యములం దుదాత్తమైన భావనామయమైన సౌందర్యశిల్పమే కానవచ్చుచున్నది. ఆతనిచాపలమును దెలుపునవిగాఁ జూపట్టు పద్యము లేమేనిఁ గానవచ్చిన నవి యాతనిరచన లైనట్టులే కాన్పింపవు. ఇఁక పలివెలవారకాంతలనుగూర్చి శ్రీనాథుఁడు రచించినవిగా శాస్త్రిగారికి వినవచ్చి, తరువాతఁ గ్రీడాభిరామపీఠికలోఁ గూర్చిపెట్టినపద్యములు వానివే యని నిర్ధారింపఁగలిగిననాఁ డాతనికి జారత్వము గలదని నిర్ణయింపవలనుపడును. కాని యాపలివెలవారకాంతలకు సంబంధిం

చినచాటువు లనుకొనునవి కుతూహలవరు లెవ్వరో కూర్చి పెట్టినవిగాని శ్రీనాథునిరచనలుగాఁ దోఁపవు. శ్రీనాథుని యవసానకాలమున నాతనినోట వెలువడిన చాటువుసైత ముదాత్తమైన శైలిలో జాలువాఱినది. అట్టితఱి "తెలికల మిండగీఁ డొకఁడు తియ్యనినూనెకు, నంబికమ్మికోకల కొక సాలెవాఁడు..." ఇత్యాది నీరసపద్యములను శ్రీనాథునిరచనలనుగా సహృదయులైన సారస్వతరహస్యవేత్త లంగీకరింపఁ జాల రనియే నానిశ్చయము. సభ్యము కానిండు, అసభ్యము కానిండు; శృంగారభావ మనున దెల్ల శ్రీనాథునిపేర నెట్లు చెల్లుచు వచ్చినదో యనువిషయమును నాచాటుపద్యవివరణమునఁ దెలిపియేయున్నాను.

## క్రీడాభిరామము శ్రీనాథకర్తృకమా?

శ్రీనాథుఁడు శృంగారిశేఖరుఁ డని నిరూపించుటకు క్రీడాభికర్తృత్వము నాతనికి శాస్త్రిగారు గూర్చిపెట్టినారు. వీథి యనురూపకమునకు వలయు లక్షణము లీక్రీడాభిరామమునం దన్నియుఁ గాకున్నను గొన్ని జతగూడియున్నవి. శ్రీనాథుని 'వీథినాటకము' అనుపేర నావఱకు ముద్రితములు అముద్రితములు నైయున్న చాటువులలో రూపకలక్షణము లేపాటియుఁ గానవచ్చుట లేదు. ఈవీథిలో శృంగారప్రాయమైన రచన చాలవఱకుఁ గానవచ్చుచున్నది. 'శ్రీనాథుని' వీథినాటక మనుపేర లక్షణగ్రంథములం దుదాహృతములైన పద్యములు 'కందుకకేళి సల్పెడిప్రకారమునన్' 'కుసుమం

బద్దినచీరకొంగు వొలయన్' అను నీపద్యములు రెండును నీక్రీడాభిరామమునందును గానవచ్చుచున్నవి. శ్రీనాథుని చాటుపద్యములను బోలినపద్యము లిందుఁ గలవు. శ్రీనాథుని శాలివాహనసప్తశతియనువాదములోని పద్యము లొండు రెండిందుఁ గలవు. శ్రీనాథుని యితరప్రబంధములందలి రచనాసామ్య మడుగడుగునఁ గానవచ్చుచున్నది. శ్రీనాథుని స్వభావమున కీరచన సర్వథా తగియున్నది. ఈహేతువులచే నీక్రీడాభిరామము శ్రీనాథకర్తృకమే గాని యన్యకర్తృకము గాదని శాస్త్రిగారు శృంగారశ్రీనాథమునను క్రీడాభిరామపీఠికయందును మిక్కిలి శ్రమగొని నిర్ణయించి యుంచినారు. క్రీడాభిరామకర్త శ్రీనాథుఁడే యైననాఁ డాతఁడు శృంగారి యగునా! కాదా! యనిసంశయింప నక్కఱలే దని వారి నిశ్చయము. కాని యీహేతువు లెంతవఱకు సరిపడునో పరికింతము.

క్రీడాభిరామమును రచియించినకవి వినుకొండవాసి యైన తిప్పనామాత్యసుతుఁడు వల్లభామాత్యుఁ డయినట్టులు కృత్యవతరణికయందుఁ జూపట్టెడి వంశక్రమవర్ణనాత్మకమైన గద్యపద్యములనుబట్టియుఁ గృత్యంతమునందలి గద్యపద్యములనుబట్టియు సుస్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. తుదినున్న పద్యగద్యము లివి.

క. నటులలది దోరసముద్రము
విటులలది యోర్గల్లు కవిపి వినుకొండమహా

పుటభేదన మిత్రితయము
నిటఁ గూర్చెను బ్రహ్మ రసికు లెల్లరు మెచ్చన్.

గద్య : ఇది శ్రీమన్మహామంత్రిశేఖర వినుకొండతిప్పయామాత్యనందన చందమాంబాగర్భపుణ్యోదయ సుకవిజన విధేయ వల్లభామాత్యప్రణీతంబైన క్రీడాభిరామం బను వీథి నాటకంబున సర్వంబు నేకాశ్వాసము.'' ఈపద్యగద్యములను బట్టి వినుకొండవాస్తవ్యుఁడు చందమాంబాతిప్పయామాత్యుల పుత్రుఁడు నగువల్లభామాత్యుఁడు క్రీడాభిరామమును రచించె నని నిరాఘాటముగఁ దెలియవచ్చుచున్నది. మఱియు వల్లభామాత్యుఁ డీవీథిని రావిపాటిత్రిపురాంతకుఁడు రచించిన 'ప్రేమాభిరామ' మను సంస్కృతకృతికిఁ దెలుఁగుసేఁత గావించె నని కృత్యాదియందలి యీక్రిందివచనము తెలుపుచున్నది.

“ఆమంత్రిశేఖరుఁడు రావిపాటిత్రిపురాంతకదేవుం డనుకవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామనాటకంబు ననుసరించి క్రీడాభిరామంబను రూపకంబు తెనుంగుబాస రచియించినాఁడు.”

గ్రంథస్థమైన ప్రమాణములచే నిది వల్లభామాత్యకర్తృకమే యని తెలియవచ్చుచున్నను కవియశోలోభముచే వల్లభామాత్యుఁడు శ్రీనాథునకు విశేషధన మొసఁగి, యాతనిరచనను దనదిగా వెలయించుకొనినాఁ డనియు, కావుననే యీగ్రంథమున శ్రీనాథునివే యీపద్యము లని పట్టి యీయఁజాలిన రచనాసామ్యము గానవచ్చుచున్న దనియు ప్రభాకరశాస్త్రిగారి సిద్ధాంతము.

క్రీడాభిరామముతో శ్రీనాథునకుఁ గలసంబంధ మెట్టిదో ముందుగ నాయూహా పోడమినంతకుఁ దెలిపి యా వెనుక నిది శ్రీనాథునిరచన యెట్టులు గానేరదో వివరింతును. శ్రీనాథుఁడు కొండవీటిలోఁ జిరకాలము వసించి యుండి, నైషధాంధ్రీకరణము మూలమునఁ దనయశఃప్రశస్తులను గుంటూరు నెల్లూరు మండలములం దంతటను వెల్లివిరియఁ జేసియున్నాఁడు. కొండవీటికి వినుకొండ నలువది మైళ్లదూరమం దుండినపట్టణము. కావున శ్రీనాథుని రచనాపద్ధతి వల్లభరాయని మనము నాకర్షించి, యాతనిపోకడలోఁ దనరచన సాగింప సమకట్టియుండిననాఁడు శ్రీనాథుఁడు కృత్యాద్యంతపద్యములను గూర్చియున్నాఁడు. రచనలోఁ గానవచ్చెడి వ్యత్యాసమే యీవిషయమును స్పష్టముచేయుచున్నది. ఈక్రీడాభిరామమునందలి మొదటిపద్యము–'గణనకెక్కిన దశరూపకములయందు' ఇత్యాదిపద్యము, వల్లభామాత్యునిది. దానితరువాతి 'అఖిలప్రపంచంబు నన్యథా కల్పించె' నిత్యాదిసీసము మొదలుగ 11వ పుట 32వ పద్యము తుదివఱకు, ప్రేమాభిరామప్రశంస యను వచనముదాఁకఁ గల వంశావతారవర్ణనాత్మకవిషయ మంతయు శ్రీనాథవిరచితమే కాని వల్లభామాత్యవిరచితము గాదు. నడుమఁ గూర్చిన 'కందుకకేళిసల్పెడిప్రకారమునన్' 'కుసుమంబద్దిన చీరకొంగుఖోలయున్' ఇత్యాదిపద్యములు రెండును శ్రీనాథునిచాటువులు, ఆతని వీథినాటకములోని వింద్ఁ జేరినవి.

శాలివాహనసప్తశతిశ్లోకములకు శ్రీనాథుని యనువాదరూప మయినపద్యములు 'శీతాకాలంబు కడిమాడ సేయఁ గుడుచు' 'పటుజంఝూపవనోత్తృణాలయములో' 'మాఘమాసంబు పులివలె మలయుచుండ' నిత్యాదిపద్యములు మూఁడును శ్రీనాథునివియే గాని వల్లభరాయనివి గావు. ఇటులనే తుదిని భరతవాక్య మనఁదగిన 'ముదమున ముల్కినాఁటిపుర మోహనశైల' ఇత్యాదిపద్యమును శ్రీనాథునిదే. ఈపద్యములుగాక తక్కినగద్యపద్యము లన్నియు వల్లభామాత్యవిరచితములే. ఈవిషయమును క్రమముగ నారోపినవిధమున వివరింతును.

క్రీడాభిరామము కృత్యాద్యంతములందు శ్రీనాథుని రచన ప్రవేశించుట సంభావ్యమైన విషయమే. ఏమన, నీఘట్టమునఁ కవి తనఘనతను దా నుగ్గడించుకొనవలయును. అది యన్యకర్తృక మైనచో దానిలో నౌచిత్య మధికము గావున, వల్లభరాయనికిఁ గార్యార్థియైన శ్రీనాథుఁ డాపని చేసియుండవచ్చు నని మన మూహింపవచ్చును. శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయనియాస్థానిలో, గౌడడిండిమభట్టారకుని వాగ్వాదమునం దోడించి, కవిసార్వభౌమబిరుదము నార్జింపఁ బోవునాఁ డీవల్లభామాత్యునితో డ్పాటు నర్థించి యుండును. వల్లభామాత్యుని ముత్తాత విజయనగరాధీశుఁ డైన పెదబుక్కరాయలకు మంత్రిగను, ఈతనితాత లేక తండ్రియగు . తిప్పామాత్యుఁడు హరిహరరాయల సువర్ణ

భాండాగారాధ్యక్షుఁడుగను నుండిన కతమున, వల్లభామాత్యు నకుఁగూడ విజయనగరసామ్రాజ్యముతో సన్నిహితసంబంధ మేర్పడియుండును. అచట సభాప్రవేశమునకుఁ దనకు సాయ పడుటకై శ్రీనాథుఁడు వల్లభామాత్యుని దర్శింపఁగా, నాతఁడు శ్రీనాథు నీకృత్యాదిపద్యములు రచింపు మని కోరి యుండును. తన్మూలముగ నీ 32 శ్రీనాథునిగద్యపద్యములు కృత్యాదిని, 'ముదమునముల్కి-నాటిపుర' ఇత్యాదిపద్యము తుదిని జేరిన వని మన మూహసేయవచ్చును. నడుమ నవత రించిన యయిదుపద్యములు శ్రీనాథుని యనుమతితోడనో లేకయో వచ్చి చేరిన వనుట నిశ్చయము. ఏప్రభువు నాస్థా నిలోనైన ప్రవేశము నార్జించుటకుముందు తత్సంబద్ధులతో సారస్వతసంబంధము నేర్పఱుచుకొనుట శ్రీనాథున కొకపరి పాటి యైనట్టులు గన్పట్టును. ఆక్రమముననే విజయనగర సామ్రాజ్యసంబద్ధుఁడైన వల్లభామాత్యునితో నిట్టిసారస్వత బాంధవ మేర్పడియుండు నని నాయూహ. పెదకోమటి వేముని యాస్థానిలో విద్యాధికారి గాఁదలఁచిననాఁడు తన్మంత్రియగు మామిడి సింగనతోడను, వీరభద్రారెడ్డి యాస్థానిలో విద్వాంసుఁడు గాఁదలఁచిననాఁడు తన్మంత్రి యగు బెండపూఁడి అన్నామాత్యునితోడను సారస్వత సంబంధ మేర్పఱుచుకొనుట,తన్మూలమున దనయాశయమును సఫలము గావింపఁజేసికొనుటయు దీనికి సమర్థకములు.

క్రీడాభిరామమున కాంధ్రసారస్వతమునం దొక ప్రత్యేకస్థానము గలదు. అది యానాఁటియాంధ్రుల జాతీయ

జీవితమున కొక దర్పణప్రాయ మైనది. దానిలో నానాఁటి యెన్నియో సామయికాచారములు సాంఘికపరిపాటులు ప్రతిఫలించినవి. ఆనాఁటి నాగరకవృత్తాంతములు వ్యక్తమైనవి. ఆనాఁటి విటవిటీవేషభూషాచేష్టాదిక మభివ్యక్తమయినది. నాఁటి రసికజనచేష్టితము లాసూత్రితమైనవి. నాఁటివారి యుత్సవవినోదములు ప్రతిబింబించినవి. వివిధజాతిస్త్రీపురుష భాషితచేష్టితము లభివ్యక్తమైనవి. ఈగ్రంథమునందు వర్ణించిన కొన్ని శృంగారభావములు సహృదయులయిన సాహిత్యపర్యాలోచకులకుఁ గొంత యెడబరముగా నున్నవి గాని కొదువవిషయము లన్నియు నమూల్యములే.

క్రీడాభిరామము అందలి కథావస్తువు

గోవింద మంచనశర్మ యనువిప్రుఁడు టిట్టిభసెట్టి యనువైశ్యుఁడు నిరువురు రసికులు కాకతీయసామ్రాజ్యము నాఁడు రాజధానియైన ఓరుగల్లులో నొకనాఁటి వేకువను ప్రవేశింతురు. గోవిందమంచనశర్మ యీయోరుగంటిపురము నందలి కామమంజరి యనువేశ్యకు ననుపుకాఁడై యుండును. కార్యాంతరవ్యాసంగమున దేశాంతరమున కేఁగిన మంచనశర్మ యచట మిత్త్రుఁడుగా లభించిన టిట్టిభసెట్టితోఁగూడఁ బురప్రవేశము గావించి, సాయంకాలమువఱకు నానగరవీథులలోఁ గానవచ్చెడి వివిధవినోదములను బరికించుచు, రాత్రి వేళకు సంకేతస్థలమునకుఁ జేరును. అచట జారజాయాపతు లయిన కామమంజరీమంచనశర్మలు చంద్రునకు గొజ్జంగి

వ్రాసి రక్షయిచ్చుటతో నీకథ ముగియును. ఈనడుమ వారిరువురు (మంచెన టిట్టిభులు) గాంచినట్లు తెలిపిన వినోద విషయములలో నాఁటిపరిపాటు లెన్నియో తెల్లమయినవి.

సాంప్రదాయిక విషయములు

గోవిందమంచనశర్మను వర్ణించిన తీరునుబట్టి యానాఁటి రసికవిప్రులపద్ధతి తెలియవచ్చుచున్నది. వారు నీర్కావి దోవతి పింజె విడిచి కట్టెడివారు. పరిమళోదకముతో మేదించిన విభూతి పాలమునఁ దాల్చెడివారు. ఒకచేత జలపాత్రము దాల్చెడివారు. పట్టుజన్నిదములు చెంగావిరంగుటుత్తరీయములు ధరించుచుండెడివారు. ఆనాఁటివిప్రులు వేశ్యవాటికి భోగార్థము పోయెడివారయినను నిత్యకర్మానుష్ఠానమును సక్రమముగ నిర్వర్తించుచునేయుండెడివా రని మన క్రింది వచనము తెలియఁజేయుచున్నది.

> "అనుదితనియమవ్రతంబు గావున నిటక్రితంబ సంధ్యాగ్నిహోత్రక్రియాకలాపంబులు నిర్వర్తింపంబడియె. నీవు ముఖమార్జనంబు సేసి యిష్టదేవతాభివందనము గావించితివిగదా! గోధూళీలగ్నంబునం బురంబు ప్రవేశింపవలయు. విశేషించి యుషఃకాలంబు సర్వప్రయోజనారంభంబులకుఁ బ్రశస్తంబు"

అనినాఁడు మంచనశర్మ టిట్టిభునితో. దీనినిబట్టి యానాఁడు విప్రులు నిత్యాగ్నిహోత్రపరులై యుండెడివారనియు, వారిలోఁ గొందఱు అనుదితహోమపక్షము (సూర్యోదయమునకు ముందే అగ్నిహోత్రహోమము

సేసెడు) వారనియు, మఱికొందఱు ఉదితహోమపత్రము వా
రనియుఁ దెలియవచ్చుచున్నది. వైశ్యులును మొగము కడుగు
కొని యిష్టదేవతాధ్యానము నెఱపుచుండెడివా రనియు
నెఱుఁగవచ్చుచున్నది. ఆనాఁటి పురప్రవేశాదికమునకు
మంచివేళ నరయుచుండెడివా రనియుఁ దెలియవచ్చు
చున్నది. రసికులయినవారి కర్మనిష్ఠయే యిట్లుండఁ గేవల
వైదికకర్మనిష్ఠాపరుల నియమము లెంత నియతముగ సాగు
చుండెడివో ?

ఆనాఁడు దేవాలయము లేవి గానవచ్చినను నచటి
దేవతల కందఱకు మొక్కుచుండెడివా రనియు, అట్టు
మ్రొక్కుట వారివారి కార్యములు సఫలమగుటకు సాధనమని
యెంచెడివా రనియు, ఆనాఁడు వీరపురుషులకుఁగూడ దేవాల
యములు నిర్మింపఁబడుచుండెడి వనియు, తత్తదాలయము
లలో వీరగాథలు వాద్యసహకారముతోడఁ బాడుట జరుగు
చుండెడి దనియు, కొందఱు పాత్రధారులు తత్తత్కథావిష
యములను సముచితవేషధారణముతో నభినయము సేయు
చుండి రనియు నెఱుఁగనగుచున్నది.

ఓరుగంటిపురమున పల్నాటివీరుల కాలయముండుట,
యచట పల్నాటివీరచరిత్రము స్త్రీ పాడుట, పురుషులు వేష
ధారులై యభినయించుట యిందులకు నిదర్శనము. ఆయాల
యమునందు గచ్చువలకపై పల్నాటివీరచరిత్రము చిత్రిత
మయిన దనుటచే నానాఁటిజనుల కావీరగాథలపైఁ గల

యాదరము దెలియవచ్చుచున్నది. 'ఈవీరపురుషులు మనకుం గార్యసిద్ధి సేయుదురుగాక' యనువాక్యముచే నానాఁటి ప్రజల కావీరపురుషవిగ్రహములయెడ దేవతాసమానబుద్ధి నెలకొనియుండెడి దని వ్యక్తమగుచున్నది.

అచట ఏకవీరాదేవియాలయ ముండుట, ఆయేకవీర యానాఁ డేయేగ్రామములందు నెలకొనియుండెనో, ఆమె జాతర లెట్లు జరుగుచుండెనో తెలుపఁబడినది. ఏకవీరాదేవి కాకతమ్మకు సైదోడఁట. ఈయిరువురకు నచట దేవాలయము లుండినట్లులును, ఏకవీరాదేవియెదుటఁ బరశురామచరితము నానాఁడు పాటలుగాఁ బాడుచుండెడివా రనియు విదితమైనది. వీరుల కేకవీర యానాఁ డిలవేల్పుగా గణింపఁబడినట్లులు కూడ నెఱుఁగవచ్చుచున్నది.

ఆనాఁడు సంతానార్థులైన గృహస్థులు కొందఱు కామేశ్వరీవ్రతము నెఱపుచుండెడివా రనియు, నావ్రతమున నేడ్వు రక్కల నారాధించుచుండెడివా రనియు, అక్క లేడ్వురు నాడుట, కామవల్లిమహాలక్ష్మీవ్రతకథను బాడుటయు, తద్దర్శనము సకలకలుషహరముగా భావింపఁబడెడి దనియుఁ దెలియవచ్చినది. మైలారదేవాలయము, మైలారవీరభటులు సాహసకృత్యములు నెఱపుట, గొరగవడుచు మొగ్గవ్రాలి, తొట్టెనీళ్లలో మునిఁగి ముక్కర ముక్కున గుచ్చికొంచు లేచుట, నాలుకతో నల్లపూసలు గుచ్చుటయు తెలుపఁబడినది. దేవతోత్సవములలో నెఱపువినో

దము లెట్టివియో దీనినిబట్టి తెలియవచ్చుచున్నది. మైలార దేవుని తోడిజోడు భైరవదేవుడు గూడ నచటఁ గలఁడఁట. ఈ దేవాలయములలోని దేవీదేవులను మందనటెక్ట్రభు లిరువురు దర్శించుచు వారువారు తమకభ్యుదయము గలిగించెదరు గాత మని యర్థించుటలో నాఁటివారి వీరి దేవతాపూజాపద్ధతులు తెలియవచ్చినవి.

ఆనాఁడు గ్రామదేవతల యుత్సవములు నెఱపునపుడు సింహధ్వజము నెత్తుట, వేపాకుతోరణములు గట్టుట, ఆబాల వృద్ధముగా జలపూర్ణకలశములు దాల్చి నీరుగ్రుమ్మరించుట యుండినట్లు తెలియవచ్చుచున్నది. ఈపరిపాటి యీనాఁటి కిని గొన్నితావులందుఁ గానవచ్చును. మఱియు నాయుత్సవ ములలో నాసాదులు మద్యమును ద్రావి డప్పులు మున్నగు వాద్యములు మ్రోఁగుచుండ కడునుత్సాహముతో నృత్యము సేయుపరిపాటి యుండినట్టు తెలుఁగవచ్చుచున్నది. మఱియు నోరుగంటిలో భైరవాలయము, చముడేశ్వరీశక్తినిలయము, వీరభద్రేశ్వరునిగుడి, బౌద్ధవిహారము, మసానమ్మగుడి, కుమారస్వామియాలయము, పాండవులగుడి, తురకలమసీదు, కేశవస్వయంభూస్వామియాలయము నుండినట్టులు దెలియ వచ్చినది. ఆనాఁటిజనులు వీని నన్నిటిని సమానదృష్టితో దేవతాసమారాధనబుద్ధితో దర్శించువారనియు విదితమగు చున్నది.

ఆమోరుగల్లులో ఆంధ్రప్రభుభవనమునకు (కోటకు) ముంగిలివాకిలిలో గడియారము ముండినట్లును, ఆఘటికాగార

ములో మధ్యాహ్న వేళ పదునాలుమూలులు గంటలమ్రోఁత వినవచ్చె ననినాఁడు. అనఁగా పదునాలుగడియల ప్రొద్దెక్కి నప్పటికి మధ్యాహ్న మగుట గణితశాస్త్రసంప్రదాయము. ఒక్కొక్కగడియ కొక్కొక్క గంటదెబ్బగా లెక్కించిన పదునాలుగడియలకు పదునాలుమూలులు ఘంటారావము చేసెడివా రనియు, ఆగడియారము ఘటికలను దెలుపు అగాముర (గృహ) మనియు నీపద్యమునుబట్టి విదితమగుచున్నది.

ఇంతియఁగాక యాపురమునఁ బూఁటకూటియిం డ్లుండెడి వనియు, అచట నాహారవిహారములు రెండిటికి నవకాశ ముండెడి దనియు, నీవీధి యెఱిఁగించుచున్నది. ఒక రూక నైకొని తృప్తికరమైన భోజన మొసఁగెడివా రని యీక్రిందిపద్యము చాటుచున్నవి.

ఉ. కప్పురభోగివంటకము కమ్మని గోధుమపిండివంటయుం
గుప్పెడు పంచదారయును క్రొత్తగఁ గాచిన యాలనేయి పెస
ర్పప్పును గొమ్ముమ్మనల్లనఁటిపండులు నాలుగు నైదు నంజులుం
లప్పలతోఁడఁ క్రొంబెరుగు లక్ష్మణవజ్ఝులయింట రూకకున్.

ఈభోజనమునను దెలుపుపద్యము శ్రీనాథుని యితరప్రబంధములందలి భోజనప్రకరణపద్యమును బోలిన దనియు, ఆతనికిఁ బ్రియమైన పెసరుఁబప్పు దీనఁ గూడినది గావున నీచాటుకృతి శ్రీనాథకృతి యనినారు. కాని యీ పద్యమునడక శ్రీనాథుని యేయితరపద్యమునడకకుఁ జాలి యుండ లేదు. చాల కుంటుగనే సాగినది. దీన రచనాసమృద్ధి

యేపాటియుఁ గానరాదు. శ్రీనాథునిరచన భోజనావసర ములం దత్యుదాత్తముగాఁ గొనసాగునే గాని బెండువడదు.

ఆనాఁడు వినోదమునకై వారకాంతలఁ జూడఁబోవు విప్రులను ఔదార్యవతులైన వారవనితలు సగౌరవముగ నమస్కారాద్యుపచారములు నెఱపుట, విప్రులు వారిని దీవించుటయు జరుగుచుండెడిది. మంచెనశర్మ ప్రతాపరుద్ర ధరణీశోపాత్తగోష్ఠీప్రవీణయగు మాచల్దేవి యనువారకాంత విభవమును జూడఁబోయి దీవించినప్పుడామె, మంచము దిగివచ్చి మంచెనకు నమస్కరించి కుశలప్రశ్నము చేసి యాతనిదీవనలను బడయుట యిందులకు నిదర్శనము. వార కాంతలు చిత్రశాలాప్రవేశము సేయుట, దర్పణము చూచుట మున్నగుమంగళకృత్యములు శుభలగ్నములందుఁ జేయుట, ఆసమయమున విప్రులచటికిఁ జేరి వారి నాశీర్వదించుటయు నానాఁటిపరిపాటిగాఁ జూపట్టుచున్నది. మాచల్దేవి వారాంగన శుభవేళఁ బ్రవేశించినచిత్రశాలలో మదనవికారోద్బోధకము లైన చిత్రములు లిఖింపఁబడినట్టులు వర్ణింపఁబడినది. ఆవర్ణ నమునకు నైషధ హరవిలాసములందుఁ గానవచ్చిన సత్య వతీపరాశరుల, అహల్యేంద్రుల, మేనకావిశ్వామిత్రుల, రతీ మన్మథుల సమాగమఘట్టముల వర్ణనాక్రమము సహాకరించి నది. పెక్కుమంది తరువాతికవులకు శృంగారభావోద్దీపనమున కీవర్ణనాక్రమ మాదర్శమైనదికూడ.

చిత్రశాలనుండి వెలువడిన మంచెనటిట్టిభు లిరువురు నుత్సవపరాయణ యైయుండిన యొకవారవనితయింటికిఁ

బోవఁగా నచట మంచెనశర్మకు పూర్వానుభూతయగు నా గాంధర్వికి జనించిన 'మదనరేఖ' యనుకన్య దర్పణదర్శనము చేయనైయున్నది. ఆగాంధర్వి మంచెనశర్మను గౌరవించి, యాతనిఁ "దనతొడపైఁ గూర్చుండఁబెట్టికొని కూఁతుచే నద్దము చూపించి, శ్రీవర్ధస్వంబు చెప్పు"మన్నది. వారవనిత కానాఁడు ముకురదర్శన మవశ్యకర్తవ్యవిధి యనియు, ఆపరిపాటిని బాటింపకుండ వేశ్యకు మన్మథవేధదీక్ష వహింపరా దనియుఁ దెలియవచ్చుచున్నది. ఆసామయికాచార మిట్లు చిత్రముగఁ దెలుపఁబడినది.

గీ. ముకురదీక్షావిధానంబు మొదల లేక
తెలపడంతికిఁ గాఁరాదు విటునిఁ గవయ
యాయజూకున కెట్లు చేయంగవచ్చు
నరణిసంగ్రహ మొనరింప కధ్వరంబు.

యజ్ఞము సేయువాఁ డరణిసంగ్రహము సేయకుండ యజ్ఞ మెట్లు సేయుటకు వలనుపడదో, వారకాంతకు ముకుర దర్శనము సేయకుండ విటుని గవయుట యట్టులే వలనుపడ దఁట. ఇది యుదాత్తమైన ఉపమానసామగ్రి.

గీ. లంజెవారికి శ్రీమహాలక్ష్మి గాదె
దర్పణము విప్రముఖ్య! గంధర్వగణము
పుణ్యచారిత్ర! దృష్టాంతభూమి గాదె
దర్పణము వివర్తవాదముల కెల్ల.

వేశ్యలకు దర్పణము లక్ష్మీస్థానము, గంధర్వగణము లోనిది. వివర్తవాదమునకు సైతము దర్పణము ప్రధానము.

ఈవిధముగ దర్పణాదర్శనప్రాధాన్యము నెఱుంగించుటలో నప్పటి సంప్రదాయప్రదర్శనమున కిది దర్పణప్రాయమైనది.

కృష్ణానదీతీరమునం దానాఁడు శ్రీకాకుళక్షేత్రము నందు జరిగెడి తిరునాళ్లు వర్ణించుపట్టునం దీగ్రంథమున నసభ్యమైనశృంగార మధికముగఁ గొంత వర్ణింపఁబడినది. ఈతిరునాళ్లముచ్చటలు రసగ్రహణతత్పరుల హృదయముల కెడబర మనిపించుతీరులో నడచినవి. దవనపున్నమనాఁడు శ్రీకాకులక్షేత్రవాసియైన తెలుఁగురాయని తిరునాళ్లు జరుగు ననియు, గరుడధ్వజారోహణము మొదలుగా శ్రీపుష్పయోగ పర్యంతమైన కృత్యములు కల్పోక్తమంత్రప్రకారమున నచట జరుగుననియు, పెక్కురు త్రైర్థికు లాయుత్సవములఁ జొల్గొను టకు వత్తురనియు, పరనారీసంగమాదిక ములపుడు విరివిగ జరుగుచుండెడి దనియు నెఱుఁగవచ్చుచున్నది.

నాఁటి విశేషములు

వేషముమైచుకొనిన పాములవాఁడు నాగస్వరము పాడుచు పాముల నాడించుట, దానిఁ జూచి ప్రేక్షకు లానం దించుటయు నుండెడిది. కోడిపందెములు గొట్టెపొట్టేళ్ల పందెములు నానాఁటివారికి వినోదస్థానములై యుండినట్టు లును రూపింపఁబడినది. జారధర్మాసనము—అచటికి వచ్చెడి తగవులు, విటులను వంచనసేయ నేర్పుగల వృద్ధవేశ్యలు విటులను వంచించెడితీరు, దానికి శిక్షావిధానము ననువిష యము లానాఁడు నేఁడును గూడ సరిపడుతీరునఁ జూపట్టినవి.

దీనినిబట్టి యానాఁటి విటవిటీవర్తనములు నెఱుఁగవచ్చుచున్నవి.

ఆనాఁడు వేశ్యలయెడ వావివరుసలు తప్పించి వర్తించినపుడు, కొంత కలవరపడియు నెట్టులో సరిపెట్టుకొనుచుండెడివారు. శ్రీధరుఁడు మహాలస యక్కయగు మధుమావతిని బొరఁబడి కవఁగూడినపుడామె, మంచెనశర్మను ధర్మమూర్తన్న మడుగఁగా నాతఁ డిట్లు తెలిపినాఁడు.

"వారకాంతను దల్లి దాసి యప్ప చెలియలు కూఁతురు దాది యని
కేళిగేహంబునం బరిహరించుట విటధర్మంబు గాదు."

ఆ. జాణతనము గల్గి సవరతనము గల్గి
తెలివి గల్గి మోర తీరు గల్గి
చేయలంతి తనకుఁ జేకూడినప్పుడు
వావి వలదు లంజెవారియింట.

లంజెరికము సాగించువారికిఁ గూడ పరమేశ్వరానుగ్రహము నెడఁ బరమప్రత్యయ మానాఁడు గల దనుట క్రింది పద్యము తార్కాణము.

చ. కొడుకులు కూఁతులుం గలిగి కూడును బాడియుఁ ద్రవ్యతండమై
విడిముడి లాఁతుగాఁ గలిగి వెండియుఁ బైడియు నిండ్లలోపలన్
దడఁబడఁ దారు బంధువులుఁ దామరతంపరలై సుఖించువా
రుడుపతిమౌళిమౌళి నొక యుమ్మెతపూ విడువారు వేడుకన్.

సంతోషముతో పరమేశ్వరునిమౌళిపై (శిరముపై) నొకయుమ్మెత్తపూవు నర్పించినపుణ్యమునఁ బోవువారు కొడుకులు కూఁతులు, కూడు పాడి ధాన్యము ధనము వెండి

పైఁడి సమృద్ధిగాఁ గలిగి తరుగనిబంధుసంపదతోఁ దుల తూఁగుచుందు రని నాఁటివారి విశ్వాసము. ఇట్టి యమూల్యమైన సామయికాచారములకు పరిపాటులకు నీ క్రీడాభిరామ మొకకాణాచి. శ్రీకాకుళస్వామితిరునాళ్లను వర్ణించు ప్రకరణములో 'హైమగ్రావనితంబ' 'పేర్చినసందడిం బెదవి పీల్చి' 'ముంజెవదనైన' 'లవలవఁజన్నుదోయి' ఇత్యాది పద్యములు లేకుండిన దీని కింతకంటె వేయిమడుంగు లుదాత్తత యేర్పడియుండెడిది.

### కొన్ని మధురఘట్టములు

క్రీడాభిరామమునందలి వల్లభామాత్యునిరచన పెక్కుపద్యములం దెగుడుదిగుడుగను నీరసముగను నడచినను, గొన్నిపట్టులందు మాత్ర ముదాత్తమైన భావసన్నివేశములతోడను, కల్పనాచమత్కృతితోడను, చక్కనినుడికారపుఁ బెంపుతోడను గొనసాగినది. అట్టి పట్టులను గొన్ని యుదాహరించెదను. కోడికూఁతను జిత్రించినతీరు కనుగొందము.

ఉ. మంచన వింటివో వినవొ; మన్మథుఁ డేకశిలాపురంబులోఁ
జంచలనేత్రలం బతుల శయ్యలపై రతికేళి రాత్రిఁ బో
రించి ప్రభాతకాలము పరిస్ఫుటమైనను ధర్మదార వ
ట్టించుచునున్నవాఁ డదె కుటీగతకుక్కుటకం*ఠనాదముల్.

మంచనశర్మా! నీవు వింటివో వినలేదో కాని, మన్మథుఁ డీయోరుగంటిపురములో ప్రియురాండ్రను ప్రియు

* కంఠనాళముల్, కంఠకాహళిన్.

లను రాత్రివేళ స్త్రీలమీఁద మన్మథకేళిలో యుద్ధము చేయించి, తెల్లవాఱినంతనే ధర్మధారను (యుద్ధవిరామమును దెలుపు కొమ్ముబూరను) పూరింపఁజేయుచున్నాఁడు. అవియే యీగుడిసెలలో నుండెడికోళ్ల కూఁతలు. కోడికూఁతలను యుద్ధవిరామసూచకములైన ధర్మదారలను బూరించుటఁగాఁ జిత్రించుట మధురోదాత్తమైన యొకకల్పన. ఇట్టికల్పన పొడముటకు మూలము త్రిపురాంతకవిరచితమైన ప్రేమాభిరామమే గావచ్చును. కాని యీపద్యమునందలి భావ సామగ్రికిఁ గొంత లోపము గాన్పించుచున్నది. శీతకాలమునఁ గోడికూఁత అరుణోదయమునకుఁ గూడ ముందే మొలతేరు చుండును. తెల్లగ తెల్లవాఱునంతకు రతికేళిని మన్మథుఁడు పోరింపఁజేయుట 'అనుదితహోమవ్రతమును' బాటింపఁజేసిన సంప్రదాయమునకు విరుద్ధము. మఱియు ధర్మదార వట్టించుట యనఁగా జయించినపక్షమునం దుండెడివిజేత, ఓడిన పక్షమువారి నన్యాయముగ హింసింపకుండుటకై యుద్ధ విరామసూచకముగాఁ జేయుపని. పెఱచోటులం దీధర్మదార ప్రయోగ మట్టులే గానవచ్చుచున్నది. ఇచట శయ్యలపై రాత్రివేళ నిరుపక్షములవారిని బోరించినవాఁడు మన్మథుఁడు. ఆతఁడు మధ్యవర్తియై యుండి యీధర్మదార వట్టించువాఁడు. ఇది సంప్రదాయానుగత మయినట్టులు గానవచ్చుట లేదు.

సూర్యోదయవర్ణనము. ఇందు మొదటిపద్యమునందలి భావ ముదాత్తముగా నాసూత్రితమైనది.

మ. అదె మాణిక్యపుఁబూర్ణకుంభము నభస్స్థాయి కార్యంబు సిద్ధిక్కై
ముందలం దోఁచిన యట్టి మంచిశకునంబుంగా విచారింపరా
యుదయంబయ్యెడు భానుబింబము దిగాకాశ ప్రదేశంబులం
బదియార్వన్నె పసిండితీఁగలగతిం బ్రాకెం బ్రభాజాలముల్.

మంచనశర్మ టిట్టిభసెట్టికి సూర్యోదయమునందుఁ గానవచ్చెడి శుభసూచకవిధానమును దెలుపుచున్నాఁడు. చెలికాఁడా! ఈయుదయించెడి భానుబింబము మాణిక్యపుఁ బూర్ణకుంభమై మనకార్యసిద్ధికి ముందుగఁ గానవచ్చిన మంచిశకునముగా భావింపురా! చూడుము. ఆసూర్య బింబము కాంతులు పదియాఱువన్నె బంగారుతీఁగలవలె దిక్కులందును, ఆకాశమునందును వ్యాపించినవి. ఇచట నుద్యద్భానుబింబమును మాణిక్యపూర్ణకుంభమునుగను భాను కిరణములను పదాఱువన్నె బంగారుతీఁగలుగను భావింపఁ జేయుటలో నుదాత్తత గలదు. 'బుంగా విచారింపరా' అను పది యతి కుదుర్చుటకుఁ బాదపూర్తికి నవతరించినది.

ఈక్రిందిపద్యమునందును మధురమైన భావన గలదు గాని కొంతకుఁగొంత సరిపడినట్టులు గానరాదు.

శా. ఓరుంగంటిపురంబుసౌధములపై నొప్పారెడిన్ జూచితే
యీరెండల్ మణిహేమకుంభములతో నేకాంతముల్ సేయుచున్
స్వారాజప్రమదాఘనస్తనభరస్థానంబులం బాసి కా
శ్మీరక్షోదము ప్రాణవల్లభస్పృహాశ్లేషంబున గ్రాలెనన్.

ఓరుగల్లుపురమునందలి మేడలమీఁది మాణిక్యఖచితమైన బంగారుకలశములతో నేఁతయెండలు మంతనములు

(రహస్యాలోచనములు) చేయుచున్నవి. చూచితివా ? ఇంత వఱకు నిది యొక మధురమైన కల్పన. తరువాతి రెండు పాదములందు నొకయుత్ప్రేక్ష సాగినది. స్వర్లోకాధిపతియైన యింద్రుని భార్యయగు శచీదేవి లేక యచ్చరల పెద్దదైన స్తనభారస్థానమును పిడి, ప్రాణప్రియుని గాఢాలింగనముచే కుంకుమపుఁబుప్పొడి రాలెనో యనునట్లున్నది. ఏదియో యెఱుఁగరాదు. అవి యీ రెండ లేనా ? ఈయర్థము సంబద్ధమైనట్లు గానరాదు. స్తనభరమునందుండెడిది కాశ్మీరాంగరాగముగాని, కాశ్మీరక్షోదము గాదు. ప్రియునియాలింగనముచే కుంకుమపుఁబుప్పొడి రాలుసమయము రాత్రివేళ గావలయునుగాని ప్రభాతకాల మగుట యెట్టులో యెఱుఁగరాదు. ఈ రెండవదానికిఁ గాశ్మీరక్షోదసమానకాంతి నూహింపఁజేయుటకీయుత్ప్రేక్ష యనుకొనిన, బాలాతపము తూర్పుదెస క్రింది భాగమునుండి క్రమముగ మీఁది కెగఁబ్రాకిన ట్లుండును. అప్పుడది మీఁదినుండి రాలి మేడలమీఁదఁ బడుట యెట్లు పొసఁగును ? కావున నీయలంకారముకూర్పులో నేదియో లోప ముండినట్లే కానవచ్చుచున్నది. ఉత్ప్రేక్షను సక్రమ పద్ధతిలో నడిపించుతీ రిది గానేరదు.

కర్ణాటాంగనను వర్ణించినతీరు హృద్యముగ సాగినది. కనుఁడు.

మ. కటిభారంబును జన్నుదోయిభరముం గల్పించె నాబ్రహ్మ పి
న్నటికేఁడీఁగకు మున్నె యిప్డు విమలాపూర్ణపూర్ణమై యొప్పనీ

ఘటిభారం బొకఁ డెక్కుడయ్యె ననినం గర్ణాటి క్రాల్గంటితోఁ
బటి తాళించుచు నవ్వె నీలకబరీభారంబు కంపింపఁగాన్.

ఈకర్ణాటిని సృజించిన బ్రహ్మ, సన్ననైన యీమె నడు మనుతీఁగకు పిఱుఁదులబరువు, చన్నులజంటబరువు మున్నే కల్పించిపెట్టినాఁడు. ఇప్పు డీమె కాబరువులకుఁ దోడు మంచినీళ్లకుండబరు వొక టెక్కువయినది. అని మంచనశర్మ యీమెను బరిహసించినంతనే యాకర్ణాటాంగన నల్లని జడముడి కదలాడఁగా తళుకుఁగన్నులతో నాఁపు కొనుచు నవ్వినదఁట. పరిహాస మతిసరసమై జాలువాఱి నది. కాని క్రాల్గన్నులతో చూచుటయో, నవ్వుటయో సరిగా తెలియఁగవచ్చుట లేదు. నీలకబరీభారంబు కంపించుట, పటి తాళించుచు నవ్వుట యను నీరెండుక్రియలుకూడ మధు రములై మూర్తిసాక్షాత్కారమున కనువై సాగినవి. క్రేఁగం టితోఁజూచుచు, పరిహాసమునకు రేకెత్తిననవ్వును గన్ను లలోనాఁపుకొనుచు నవ్వినదని భావింపవలయునేమో? ఏమయిన నిది సరసమధురమైన భావన.

ఈక్రిందికందమును శార్దూలమును ప్రశస్తమైన పద్య ముల చిట్టలో శాస్త్రిగారే చేర్చినారు. నిజమున కవి యట్టివే.

క. వ్రాలని నీచన్నులతో
వ్రాలెడు జక్కవలు సరియె వలఱం బెట్టం
జాలెడు నీకన్నులతో
బాలకి! సదృశములె కలఁబడు మత్స్యంబుల్.

తరుణి! ప్రాలిపోవని నీచన్నులతో క్రిందికి ప్రాలెడి చక్రవాకపక్షులు సరియగునా? వలలలోఁ బడవేయఁజాలిన నీకన్నులతో వలలలోఁ బడెడి మత్స్యములు సమానమగునా? ఈపద్యమునందు కల్పనాచమత్కారము గలదు. మూఁడవపాదమునందలి 'కన్నులతో' అనుదానికి సరిపడెడి తూఁగునకై కూర్చిన 'చన్నులతో' అనుపదము మాత్రము వినుట కింపుగా లేదు. 'కుచములతో' అనిన బాగుండెడిదేమో?

శా. చాటుప్రౌఢిఁ బిసాళిమాడెదవు కాసల్నాటి బాపండవో
శాటీహాటకనిష్కముల్ వెలిగ జంజాటంబు చాలించు క
ర్ణాట స్త్రీలు కటారికత్తియలఁటే రాపాడఁగాఁ బట్టఁగాఁ
డాటా లీడ గణింపరాదు పెఱచోటంబోలెఁ బైపాలునన్.

తీయనిమాటలాడునేర్పుతో పరిహాసము చేసెదవు. నీవుకాసల్నాటిబ్రాహ్మణుఁడవా? బట్టలో బంగారునాణెములో యిచ్చుట లేని నీయార్భాటము చాలింపుము. కర్ణాట స్త్రీలు రాపాడుటకుఁ జేపట్టుటకు కటారికత్తె లనుకొంటివా? పెఱ (ఇతర) చోటులందువలె వట్టిగా టాటాలుగుణించుట కిచట వీలుపడదు. టాటాలు గుణించుట యనఁగా డంబములు చెప్పుట. నీమాటపసదన మిచటఁ బనికిరాదని భావము.

ఉ. ఈనలినాక్షి దాఁ దిరుపుతెత్తుప్రతోదము చూపి రొప్పుచున్
గానుగ పెట్టెపైఁ దిరుగు కట్టెడి టిట్టిభ! తుంధరాద్రిమం

ఘానక మథ్యమాన తిమిధామ జలభ్రమిము. పేలం బధి
స్థానము గా భ్రమించు నలసంపద చేడియుఁ బోలకుండునే!

టిట్టిభా! యీపద్మనయన యగుగానులవనిత గానుగ పెట్టెపైఁ గూర్చుండి, కొరడా రొప్పి యెద్దును దోలుచుఁ దిరుగును. లేక తిరుగుభాగ్యము, మందరపర్వత మనుకవ్వముచే మథింపఁబడుచున్న క్షీరసముద్రమునందలి సుడిగుండమునఁ బడి తిరుగుచున్న లక్ష్మీదేవిని బోలకుండునా? ఎద్దు తిరుగుటనుబట్టి గానుగ తిరుగుచుండఁగా గానుగ పెట్టెపైఁ గూర్చుండిన గానులదానిని, మందరపర్వతముచే క్షీరసముద్రమును మథించునపుడు లేచిన సుడిగుండమునఁబడి తిరుగునట్టి లక్ష్మితోఁ బోల్చుట యెంతయు సరసముగ నున్నది. కాని పౌరాణికసంప్రదాయమునకు ఇది సరిపడనివిషయము. క్షీరసముద్రమును మథించునపు డేర్పడిన సుడులనుండి యప్సరసలు బయలుదేరిరి గాని లక్ష్మీదేవి యుద్భవింపలేదు. క్షీరసాగరకన్య యొకయుద్భుతమైన పద్మమునుండి మొలతేరినది. పద్మనయన గావునఁ బద్మోద్భవఁ గావించుటయే భావ్యము. శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణహరవిలాసములందు లక్ష్మీదేవిని బద్మోద్భవగాను, అచ్చరలను ఆవర్తసంభవలనుగాను జిత్రించి పెట్టినాఁడు. ఇది శ్రీనాథుని రచన యేపాటియుఁ గాదని తెలుపుట కీయుపమానమే నిదర్శనము కాఁగలదు. ఇచట కట్టిడి యనఁగా భాగ్యము. అది సంపదచేడియను బోలుటెట్లు? కట్టిఁడి=దుష్టుఁడా! అని విశేషణ మనుకొనినను బొసఁగనేరదు.

పల్నాటివీరుల వేషములు దాల్చినవారిని నాఁటివరి పాటివిని జిత్రించినాఁ డీ క్రిందిపద్యమునందు.

ఉ. పచ్చని పిండిగంధమును ఫాలమునేసయు నెజ్జపూవులన్
గ్రుచ్చిన కంఠమాల్యములఁ గొప్పుగ నల్లిన వేణిబంధమున్
కుచ్చుల వీరసంబెటయుఁ గ్రొత్తదుకూలంగను కాసెపుట్టముఙ్
అచ్చున కెక్కినట్టి రవణంబులు వీరకుమారకోటికిన్.

పల్నాటివీరచరితము నభినయించు వీరకుమారులు పచ్చనిరంగుగల గంధము పెట్టికొని, నుదుట నక్షతలు దాల్చి, నెజ్జని పూవులతో గ్రుచ్చిన మాలికలు కంఠములఁ దాల్చి, జడలల్లిన జుట్టులు ముడివెట్టి, కుచ్చులతోఁ గూడిన వీరసంబెట (వీరులు ధరించు ముద్గరమా ?) చేతఁ బట్టి క్రొత్తవస్త్రము కాసెగాఁగట్టి, ప్రదర్శనమునం దారితేరిన దాని కిచ్చిన భూషణములు (పదకములో లేక బిరుదందెలో) దాల్తురఁట. ఈపలనాఁటివీరచరితము నిందు వర్ణించినఘట్టమున ఆసంప్రదాయ మెఱిఁగినఁగాని యెఱుఁగరాని విషయము లెన్నియో యిమిడియున్నవి. ఈవఱకు ముద్రించిన ముద్రణములలో సంప్రదాయ మెఱిఁగి మార్పు చేయవలసిన విషయము గానవచ్చుచున్నది. స్త్రీలు వీరగాథ పాడుట, పురుషులు చరిత్రము నభినయించుట యిప్పటికిని సాగుచున్న విషయమే. అది యీక్రీడాభిరామమునందును జూపట్టుచునే యున్నది.

పల్నాటివీరచరిత్రమును శ్రీనాథుఁడు రచియించె ననుట కీక్రీడాభిరామముసఁ బల్నాటివీరుల గాథాభినయమును

విశేషోత్సాహముగా వర్ణించుటయు నొకహేతువుగాఁ నిరూపించియున్నారు. ఈక్రీడాభిరామరచననాఁటికే యోరుగంటిలో పలనాఁటివీరుల కాలయు మేర్పడి యుండినట్టులును, ఆవీరచరితము గచ్చుపలకపైఁ జిత్రింపఁబడియుండినట్టులును, ఆచరితము నభినయించు వారు జచ్చుల కెక్కి పదకములు పడసియుండినటులును దెలుపుటనుబట్టి, పల్నాటివీరచరిత్ర మావఱకే యాంధ్రదేశమునఁ గడుప్రసిద్ధి వహించియుండె ననుట తెల్లమగుచునేయున్నది. శ్రీనాథున కీరచనతో కృత్యాద్యంతపద్యరచనతో మాత్రమే సంబంధ మున్నట్టులు స్పష్టము. నైషధాదిగ్రంథకర్తయగు శ్రీనాథుఁడే యాపలనాటి వీరచరిత్రరచయిత కూడ నైనచో, దాని కాతనికాలమునందే యంతటి ప్రసిద్ధి వచ్చుట యసంభవము గదా! మఱియు శ్రీనాథుఁడు పల్నాటిసీమపై రచియించిన చాటువులను బరికించిన నాసీమపై నాతనికి సద్భావ మేపాటియు నున్నట్టులు దోఁపదు. కావునఁ బల్నాటివీరచరితమును రచించిన శ్రీనాథుఁడు, నైషధాదిగ్రంథకర్తయైన యీశ్రీనాథుఁడు గాక చెన్నకేశవభక్తుఁడై యుండిన వేఱొకఁడే యగును. అముద్రితమై యున్న పలనాటివీరచరితము కృత్యాదినిబట్టి తెలియవచ్చు శ్రీనాథుఁడు పరమశివభక్తుఁడైన కవిసార్వభౌమునికంటె నన్యుఁడైనప్పుడే శ్రీనాథునికాలమందా చరిత్రమున కంతటి ప్రసిద్ధి వచ్చియుండుట, అట్టిదానిని క్రీడాభిరామమున వర్ణించుటయు పొసఁగియుండును.

మఱి యొక్క మాట. శ్రీనాథునిచాటువులఁ బోలిన రచన యిందుఁను జూపట్టుటచే నిది శ్రీనాథవిరచిత మను టకుఁ దగియున్నదని చాటురచనాసామ్యము నొకకారణ ముగా విమర్శకులు దెలిపియున్నారు. ఒండు రెండు పట్టులం దట్టిరచనాసామ్యముగూడ లేకపోలేదు. కాని శ్రీనాథుని చాటువులుగా నుపలబ్ధమైనవానిలో నెచ్చటను ఓరుగంటికిఁ గాని, తత్పరిసరములకుఁ గాని సంబంధించిన చాటువు లేవి యును గానరావు తక్కమ మూరసిన శ్రీనాథుఁ డోరుగం టిని మెట్టినట్టులే తెలియరాదు. అట్టితఁడిని శ్రీనాథున కోరు గంటితో సర్వథా సంబద్ధమైన యీక్రీడాభిరామముతో రచనాసంబంధ మెట్లు కల్పింప నగునో తెలియరాకున్నది. శ్రీనాథుఁ డీగ్రంథము నాద్యంతము రచించియున్నచో నింత కంటెఁ గడుసభ్యముగను, ఉదాత్తముగను, చమత్కారసమ న్వితముగను రచన సాగించియుండెడివాఁడు. శ్రీనాథుని రచనలై యిందుఁ జేరినపద్యములకు తదితరపద్యములకుఁ గల కవితాంశమునఁ జూపట్టెడి భేదమును నిష్పాక్షికదృష్టితోఁ బరికించినఁనాఁ డదియే యీక్రీడాభిరామము, శ్రీనాథునిరచన కాదని పట్టి యిచ్చును.

జారధర్మాసనము దీర్చినఘట్టములోని యీక్రింది పద్యము చక్కని కవితాచమత్కారముతోఁ గూడినది.

శా. నీకుం జేసిన బాసయొట్టిదియొ తుండీరద్విజశ్రేష్ఠ! మా
రా కాచంద్రనిభాస్య కాకతిమహారాజేనిఁ బుత్తెంచినం

గైకో దెట్టులు ; నేమి సేయుదును ; శృంగారంపులేఁదోఁటలోఁ
పైకొం గొత్తి కుచంబు లొత్తి పరిరంభం బీదు తేఁగ్రోవికిన్.

ఓరుగంటిలో నుండిన యొక పోగరుఁబోతు వేశ్య మాత, తుండీర దేశమునుండి వచ్చిన విప్రవిటునకు ముందుగ సందకత్తెయగు తనకూఁతును జూపించి, యాతనినుండి సొమ్ము గుంజుకొని, రాత్రివేళ నాతని సెజ్జ కొక దాసిని బంపును. తెల్లవాఱినంత నాయఱవ దేశపు విప్రవిటుఁడు, వేశ్యమాత చేసిన మోసము గుర్తించి, యాతగవును తగ వరులయెదుటఁ బెట్టెను. వారు జారధర్మాసనము దీర్చి యా వేశ్యను రప్పింపఁగా, నాజఱభి చెప్పినసమాధాన మిది. ఓ తుండీర దేశవాసిబ్రాహ్మణోత్తమా ? నీ కిచ్చిన మాట యెట్టిదియో గాని, మా చంద్రముఖి కాకతీయమహారాజు కబురంపినను నేవిధముగను నంగీకరింపదు. నే నేమి చేయుదును ? అది యటుండనిమ్ము. ఉద్యానవనములో గోరంటలు పూచుటకు దోహదక్రియకై, పైఁటచెఱఁ గొత్తిగించి, కుచము లంట లేఁత గోరంటమొక్కకైనను కౌఁగిలింత కంగీకరింపదు. అట్టి యీమె నిన్ను గూడుట కెట్టు లంగీకరించును. వెలఁదికౌఁగిలింతవలనఁ గోరంట పూచుట దోహదపరిపాటికిఁ జెందినది. ఈపద్యమునఁ గవితాచమత్కారము రచనాసౌష్ఠవముకూడఁ జక్కఁగ జతపడినవి. కాని యర్థస్ఫూర్తి కొంత దెబ్బతినినది.

మంచెనశర్మ కామమంజరితోఁగూడి మున్ను తా
నున్నప్పటి వినోదము నెఱిఁగించు ప్రకరణములోని దీక్రింది
పద్యము.

సీ. పట్టుపునీలిచేల గడితంబుగఁ గచ్చ బిగించి ద్రిండుగాఁ
గట్టి కటారికోల కరకంజమునం ధరియించి గుబ్బచ
న్కట్టున దోపుటంగి తొడి గ్రక్కున నన్నడురేయి వచ్చి నా
కిట్టైమరన్ జొహారు అనఁ గాంత భటుండయి నవ్వటాలకున్.

ఇది కామమంజరి మంచెనశర్మతో పరిహాసమాడు
టకై ధరించిన భటవేషము. దీనినిబట్టి యానాఁటిభటుల
వేషభాష లభివ్యక్తమైనవి. ఈపద్యము చక్కని తెలుఁగు
నుడికారపుతీవి గలిగియున్నది. ఇట్టిసరసమైనపద్యము లీక్రీ
డాభిరామమునందుఁ బరిమితమైనవియే యున్నవి. సామయి
కాచారములు సాంప్రదాయికవిషయములు, సాంఘికవర్త
నములు దెలుపుటయే యీగ్రంథమునందుఁ గలప్రశస్తి.
శ్రీకాకులపు తిరునాళ్లప్రకరణమునందు వర్ణితమైన శృంగా
రము మిక్కిలి అసభ్యముగను శ్రుతికటువుగను నడచినది.
ఈగ్రంథమునందలిరచన కంతయు నదియే మేలుబంతి యను
కొనెడివా రెవరేని యుండిన వారి సహృదయతకు వందన
ములు. అందును 'పేర్చినసందడిన్...' 'లవలవచన్ను
దోయి;...' 'వ్యామగ్రాహ్యనితంబబింబ' ఇత్యాదిపద్య
ములు చాలనిష్ఠురముగా వినవచ్చునవి యైనవి. 'పూవుం
బోడులు లేరె విప్రవిధవల్' ఇత్యాదిమాటికొన్నిపద్యము లీవ

ర్గముననుఁ జెందినవియే యిందుఁ గలవు. ఇది వీధి గావున నిట్టిశృంగారభావములకూర్పు దోషము కాదనువా రుందు రేమో ? కాని యిట్టి యసభ్యరచన లేకున్నను నది వీధి యగుటకు బాధక ముండదు. ఈక్రీడాభిరామరచనలో సభ్యత పాటింపఁబడలే దనువిషయము ప్రేమాభిరామములోని దని శాస్త్రిగారు క్రీడాభిరామముపీఠికలో నుదాహరించిన శ్లోకములు తదనువాదపద్యములు దార్కాణించుచున్నవి.

సంస్కృతశ్లోకానువాదములు

శ్లో. పృథులజఘనభారం మంద మాందోలయన్తీ
ప్రచలితకుచకుంభా సంభ్రమత్కర్ణపూరా,
మృదుచలదలకాన్తా ముగ్ధశృంభావలీలా
మభినయతి హరిద్రాపేషణచ్ఛద్మనైషా.

ఈవనిత, విస్తారమైన జఘనభారమును మెల్లఁగఁ గదలించునదియై, మిక్కిలిగఁ జలించుచున్న కుచకుంభములు గలదియై, కదలాడుచున్న కర్ణభూషణములు గలదియై మెల్లఁగఁ గదలుచున్న ముంగురులు గలదియై పసుపునూఱుట యనునెపమున మనోహరమైన పురుషాయిత (ఉపరతి) క్రీడ నభినయించుచున్న దని యీపద్యభావము. ఇది సుకుమారమైన సరణిని దృశ్యసాక్షాత్కారము గావించినపద్ధతి. దీని కనువాద మెట్లు సాగెనో పరికింపుడు.

స్రగ్ధరావృత్తము :

పరిణాహశ్రీఖర్వ్యఖిన్నాపరతిసమయసంభ్రాన్తసంభోగభంగిన్
దరుణీరత్నంబు హేలాతరళగతి హరిద్రారజఃకర్దమంబుఁ

గుజు లల్లాడంగ పీఁగుఁబదములు గదలం గొంతుగూర్చుండి నూఱెన్
గరవల్లీకాంచిభూషాకలమధురఝణత్కారము ల్తోరముల్గాన్.

మొదటిపాదమునందలి యర్థము సరిపడునట్టులు గాన రాదు. క్రమముగ వచ్చెడి స్వల్పమైన దురదతోఁగూడిన యుపరతిసమయమునందలి శంగారుతోఁ గూడినసంభోగము వలె ననుట అనన్వితము. ఖర్వఖర్జువైన సంభ్రాంతసంభోగ మేర్పడుట యెట్లు ? ఈవర్ణనక్రమ మసభ్యముగా నున్నది. విలాసత్తోఁ గూడిన చంచలమైనపద్ధతితో ననుట గూడ నర్థములేనిదే. పీఁగుఁగుదములు కదలిన నసహ్యమై చూప ట్టును. తీఁగలవంటి చేతులకు గాజులసొమ్ములు పెట్టుకొనినపు డవి కలమధురఝణంఝణారావము లొదవించె ననుటలో సారస్య మేమియుఁ గానరాదు. హరిద్రారజమును (పసుపు గుండను) బురద చేయుటకు గొంతుగూర్చుండి నూఱు నక్క ఱయే యుండదు. 'గొంతుగూర్చుండి నూఱెన్' అనుటలో వెగటు చూపట్టుచున్నది. సంస్కృతమూల మెంత శ్రుతి మధురముగ నడచినదో యీ తెలుఁగుపద్య మంత శ్రుతికటు వుగ సాగినది. శ్రీనాథుఁడే యీపద్యమును రచించి యున్నచో నింత నీరసముగను అనన్వితముగను శ్రుతికటువు గను సాగింపలేఁడు. ఇది వల్లభరాయని యనువాదము గావు ననే మూలమున కింతదూరముగ కావ్యగుణవిరహితముగఁ గొనసాగినది.

ఈక్రిందిశ్లోకముకూడ శాస్త్రిగారికి సాహిత్యచింతామణిలోఁ గానవచ్చినది, ప్రేమాభిరామములోనిదే కావచ్చునని నారు.

శ్లో. పరారిసందర్శితసన్నివేశౌ
పరుత్పరాభూతపయోజకోశౌ,
ఇహైషమ స్తాళఫలోపమానౌ
స్తనౌ కియన్తౌ పురతో భవేతామ్.

ఈ మె స్తనములు గడచినసంవత్సరమునకు వెనుకటి సంవత్సరమున మొలకచూపినవి. నిరుడు తామర మొగ్గలను మీఁజినవి. ఈయేడు తాటిపండ్లను బోలియున్నవి. ముం దెంతటివి కానున్నవో? ఇది యీశ్లోకమున కర్థము. దీని యనువాద మెట్లు సాగెనో కనుఁగొందము.

చ. దొరసెమునందుఁ జుట్టుకొని తోరణకట్టె నురోవిభాగమం దా
నిరుడు పయోజకోశరమణీయతఁ దాల్చెను వర్తమానవ
త్సరమున నొప్పె హేమకలశంబులభాగున ముందమేటికిం
గరినిభయాన చన్నుఁగవ కౌఁగిలిపట్టులు గాకయుండునే!

ఉరోవిభాగమును తోరణకట్టె ననఁగా వక్షఃప్రదేశము నంతను వ్యాపించెననుట. ఇట్లనుటలో మొలకచూపెననుటలోని యంద మెక్కడిది? తాళఫలోపమములైనవానిని కనకకలశంబులతోఁ బోల్చుటలో నౌచిత్యము గానరాదు. తుదికిఁ బోయి కౌఁగిలిపట్టులు గాకయుండునే యనుటలో సారస్య మేపాటియుఁ జూపట్టదు. 'ముం దెంతటి వగునో?' యనునప్పటి మధురభావన కీయనువాదమునఁ

దా వే లేకుండఁబోయినది. ఈవిధమైన యనువాదసరణిలో నడచిన యీరచనను శ్రీనాథున కతికించుటకంటె విషమమైన పని యుండదని యెవ్వరికైనను దోఁపకమానదని నా యూహ. శ్రీనాథుని నైషధాదిప్రబంధము లన్నియు సంస్కృతానువాదరూపములే. వానిలో నెక్కడఁ బట్టిన నక్కడ మూలమునకు మెఱుఁగు వెట్టిన రచనయే చూపట్టునుగాని, మూలమునందలి భావనమునకుఁగాని, పదబంధమునకుఁగాని యీడురాని నీరసరచన యిసుమంతయుఁ గానరాదు. అందును శృంగారభావములను గూర్చు నీఘట్టములందు శ్రీనాథుఁడే యీరచన సాగించియున్నచో నింత పేలవముగ మూలమున కింతదూరముగ సాగింపఁగలఁడా ? కావున నిది శ్రీనాథునిరచన యెన్నఁడును గాదు.

శ్రీనాథునియనుమతిఁ గూడనే గావచ్చును. లేక తరువాత నెవరైనఁ జేర్చినవి గావచ్చును. ఆతనిశాలివాహన సప్తశతిశ్లోకముల కనువాదరూపములైన పద్యము లిందు చేరినవి. అవి మూలమున కెంత సన్నిహితముగను సరసముగను ననువాదసరణిలో రూపొందినవో కనుఁగొందము.

సంస్కృతచ్ఛాయ :

శ్లో. పటుజంఝూవాతో త్తృణితే, గృహే రుదిత్వా నిస్సహానిషణ్ణామ్
దర్శయతి గతపతికాం, విద్యుదుద్యోతో జలధరాణామ్.

దీనికి శ్రీనాథుని యనువాదపద్యము :

మ. పటుజంఝూపవనోత్తృణాలయములో భద్రంబునం బట్టెకం
కటిపై ముచ్చుముణింగి నిర్భరవియోగగ్లాని శోషిల్లి యొ

క్కూటి నిద్రించుచున్న వాడపనితన్ గర్జావచఃప్రౌఢిమన్
గట్టిసుద్యోతము చూపు నట్టిచటారే భాస్కరశ్రేణికిన్.

పైశ్లోక మార్యాగీతియే యైనను, మత్తేభవిక్రీడితపద్యమునం దనువాదము సాగినను, మూలమునందలి భావము చెడకుండ మూలమునకుఁ గడుసన్నిహితముగ రచన సాగినది. శ్రీనాథుని యనువాదసరణి యట్టిది. నిజమున కీపద్యమున కిచ్చట ప్రసక్తి లేనేలేదు. ఈప్రకరణములో వర్షాకాలప్రసక్తి వచ్చినది గావున, అందమైన పద్యమగుటచే నిది యిచటికిఁ జేర్పఁబడినది. ఈపద్యమునకు వెనుక నున్న వచన మిది— "ప్రావృట్కాలప్రవాసంబును మరణంబును రమణీరమణులకు నొక్కసమంబ." యనునంతటితో నా ప్రస్తావమే ముగిసిపోయినది. 'అది యెట్టిదనిన' యని పైశ్రీనాథునిపద్య మీతావునఁ గూర్పఁబడినది. ఇచటి యీవచనమునకుఁ బద్యమునకు సంబంధ మున్నట్టులే తోఁపదు.

ఇటులనే శీతకాలపు వేకువప్రసక్తి వచ్చినది. కోడికూఁతను వర్ణించు ప్రసంగమునకును నీక్రిందిపద్య మొకటి చేరినది.

గీ. శీతకాలంబు కడి మాడసేయఁ గుడుచు
భాగ్యవంతుండు ఉపాడి పల్లెపట్లఁ
గొఱ్ఱెయోరెంబు నిగురావకూరతోడఁ
బిచ్ఛిలంబైన నేతితోఁ బెరుగుతోడ.

దీనికి సంస్కృతమూల మీక్రిందిశ్లోకము.

శ్లో. తరుణం సర్షపశాకం, నవౌదనం పిచ్ఛిలానిచ దధీని
స్వల్పవ్యయేన సుందరి!, గ్రామ్యజనో మృష్ట మశ్నాతి.

ఇది శ్రీనాథుని యనువాదముకావునసే మూలమున కనూన్యానాతిరిక్తముగా మూలమునకు వన్నె దెచ్చుచు సాగి నది. 'స్వల్పవ్యయేన' అనుదానికి 'కడిమూడసేయు' అనునది చక్కని తెలుఁగుజాతీయముతోఁ గూడినయనువాదము. 'తరుణం సర్షపశాకం' అనుదానికి 'ఇగురావకూర' యనునది మఱింత సొగసైన తెలుఁగుజాతీయము. సంస్కృతమున కాంధ్రానువాద మన నెట్టు లుండవలెనో యానరణికి మేలు బంతి యీపద్యము, ఈక్రిందియనువాదపద్యమును.

గీ. మాఘమాసంబు పులివలె మలయుచుండఁ
బచ్చడం బమ్ముకొన్నాఁడు పసరమునకు
ముదితచన్నులు పొగలేని ముర్మురములు
చలికి నోఁగోయ కేలుండు సైరికుండు.

దీనికిమూలమైన శాలివాహనసప్తశతిలోని సంస్కృత చ్ఛాయాశ్లోక మిది :

శ్లో. విక్రీణీతే మాఘమాసే, పామరః ప్రావరణం బలీవర్దేన
నిర్ధూమముర్మురనిభౌ, శ్యామలాయాః స్తనౌ పశ్యన్.

మాఘమాసము పులివలె చెలరేగుచుండ హాలికుఁడు పచ్చడము నెద్దునకై యమ్ముకొనియున్నాఁడు. ఇంటఁ దన వనితచన్నులు పొగలేని కుమ్ములై యుండ చలిమీఁదికిఁ గత్తి దూయ కేలయుండును ? అని యిచటిభావము. లేదా తెలివి తక్కువచే నెద్దునకై పచ్చడమునమ్ముకొనిన యీకాఁపు, చలికి నోఁగోసికొనిపోక యేలయుండును ? ఏమయిన నిచటి యనువాదసరణి మధురముగ సాగిన దనుట తెల్లము.

ఈ క్రిందిపద్యముకూడ శ్రీనాథునిచే ననూదితమై సరసముగ రచన కొనసాగి యిందుఁ జేరినది.

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకునమూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము.

దీనికి మూలమయినసంస్కృతభీమఖండమునందలి శ్లోకమిది:

శ్లో. ఉషస్స్యాద్గార్గ్యసిద్ధాంత శ్శకునంతు బృహస్పతేః
వ్యాస్మతంచిత్తనైర్మల్యం విప్రవాక్యం హరే ర్మతమ్.

ఈశ్లోకము దక్షారామప్రవేశసమయమున నగస్త్యుఁడు వ్యాసునితోఁ గాలశుద్ధినిగూర్చి తెలుపు ప్రకరణములోనిది. కావున 'వ్యాసమతము మనఃప్రసాదాతిశయము' అనువాక్యరచనకూడ శ్రీనాథునిదేగాని వల్లభరాయునిదిగాదు. వల్లభరాయుని రచనయైనచో నింత ప్రసన్నముగ సాగియుండెడిది గాదనియే చెప్పవచ్చును. పైన నిరూపించిన సంస్కృతశ్లోకముల యనువాదసరణిని బట్టిచూచిన నిందు వ్యత్యస్తముగఁ గొనసాగిన యనువాదసరణితోఁ గూడిన పద్యములకూర్పు వల్లభరాయునిదేగాని శ్రీనాథుని దెన్నఁడును గానేరదనుట సుస్పష్టము.

రచనాసామ్యము

శ్రీనాథుని యితరప్రబంధములతోడి రచనాసామ్యమీక్రీడాభిరామమునఁ బెక్కుతావులందుఁ గన్పట్టుచుండుటచే నిది శ్రీనాథకర్తృకమే యగునని తెలుపుక్రమమున

శాస్త్రిగా రిట్లు వ్రాసియున్నారు. "ముఖ్యముగా శ్రీనాథుని రచన సర్వాంధ్రకవులరచనకంటె శయ్యాసౌభాగ్యమున నసాధారణమై యెక్కడఁ బట్టిన నక్కడ స్పష్టముగా గుర్తింపఁ దగినదై యుండును. అట్టిశయ్యాసౌభాగ్య మీగ్రంథమునం దనుపదమును గానవచ్చుచు శ్రీనాథుని పేరు పట్టియిచ్చుచున్నది." అని కొన్ని తావులందలి రచనాసామ్యమును జూపించియున్నారు. ఆవిషయ మెంతవఱకుఁ బొసఁగి యున్నదో పాఠకు లెఱుఁగుటకై యాతావులనే కొన్నిటిని వివరించెదను.

శ్రీనాథునిరచనలో నేపద్యమునందైనను శైలిలో నెగుడుదిగుడు లెచ్చటను మచ్చునకైనఁ గానరావు. అనఁగా సంస్కృతపదభూయిష్ఠమైన శైలిని బాటింపఁ దలఁచినచో తుదివఱకుఁ బద్యము గాని గద్యముగాని మొదటినుండి తుదివఱకు నట్టులే సాగును. తెలుఁగునుడికారపుసరణి చేఁబట్టిన నదియు నాతీరునందే కొనసాగును. ఈవిషయమును నిర్ధారించుట కాతనిప్రబంధములలోఁ బరశ్శతము లుదాహరణములు గలవు. పద్యముగాని గద్యముగాని యేకధాటిలో నడిపించుట యేగాని యెగుడుదిగుడుగా నడిపించుట యాతనిచేతకు విరుద్ధమైనవిషయము. ఈక్రీడాభిరామరచనమునందలి శైలిలోఁ బెక్కుపట్టులందు వ్యత్యాసములు గాన్పించుచున్నవి. వానిఁ బరికింపుఁడు.

శా. మౌళిం గోహళి సంఘటించినక్రియ న్మధ్యాహ్నవేళ న్మహా
కాళింగైన నభోవిభాగమున వీకం గాసె బీరెండ యా
ప్రాలేయాహితసంప్రదీప్తకిరణప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టిగై.

—హారవిలాసము.

శా. ప్రాలెం దిక్కుల భానుభావ్యతికరప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టులై
కోలంబంబులు మూతి ముట్ట వెలిచెం గ్రొవ్వేఁడి బీరెండలం
జాలం గ్రాగి కరంబు వేఁడియగు కాసారాబ్జమై రేయముల్.

—క్రీడాభిరామము.

హారవిలాసమునందలి పద్యము తుదిరెండుపాదములకు మూలము అనర్ఘరాఘవమునందలి ఈక్రిందిశ్లోకపాదములు.

శ్లో. ఉద్దామద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టయః.

శ్రీనాథుఁడు సంస్కృతకావ్యములందలి శ్రుతిసుఖదమైన పదములనుగాని సమాసములనుగాని తనరచనలయం దతికించి పెట్టుకొనుటలోఁ గడు నేర్పుగలవాఁడు. కావున మురారిశ్లోకమునందలి దీర్ఘసమాసమును మధ్యాహ్నకాల వర్ణనమునందు చక్కఁగ సరిపడునట్లు కూర్చుకొనినాఁడు. ఆతనిపోకడలో నడపింపవలయు ననిన నాతనికిఁగల సంస్కృత భాషాపాండిత్యము జతఁగూడియుండవలయును. లేకుండిన నాతఁడు వాడిన సమాసములనుగాని శబ్దములనుగాని చేఁబట్టిన రచన కాఘాతమే వచ్చును. క్రీడాభిరామము వల్లభామాత్యవిరచితము గావున నే 'భానుభావ్యతికరే'త్యాదిసమా

సమును శ్రీనాథునివలెఁ గూర్పవలె ననుకొని యనన్వితము చేసినాఁడు. ఈతనిరచనలో మొదటి రెండుపాదములందలి విషయమునకుఁ 'కర్త' యేదియో తెలియవచ్చుటలేదు. మొదటి రెండుపాదములనడక వేఱు. వాచాలకోయష్టులెవ్వాలిన వేవియో ! తరువాతి రెండుపాదముల నడక వేఱు. మఱియు 'క్రొవ్వేఁడి, వేఁడి'-అని శబ్దపునరుక్తి యేర్పడినది. ఈపద్యమునుగూడ శ్రీనాథుఁడే రచియించియున్నచో నీతీరయిన పునరుక్తిదోషము వచ్చునట్లులు చేయలేఁడు. ఈవిధమయిన యన్వయము సరిగాలేని యీరచనను శ్రీనాథుని దనుట యెట్లు పొసఁగునో సహృదయు లరసెదరుగాత మని నామనవి. సమాసములు కూర్చినంతమాత్రమున నన్వయము సరిపడకుండ నుండినప్పు డాతనిరచనయే యిది యని యెట్టులు పట్టి యీయఁగలదు ? హారవిలాసపద్యమునం దిట్టి దోషము లేదుగదా ! రోలంబంబులు కాసారాబ్జమై రేయములు మాతిముట్ట వెఱచు ననుటలోఁగూడ సారస్యమంతగాఁ గానరాదు.

క్రీడాభిరామముపీఠికలోని పీక్రింది వాక్యములు :

" 'వ్యాఘ్రగావ్యా'పదప్రయోగమున శ్రీనాథునకుఁ బ్రీతి మెండు. బహువారము లాతఁ డాపదమును బ్రయోగించును." దీని కుదాహరణముగా 'వ్యాఘ్రగావ్యాపయోధరల్' అను పదప్రయోగముగల కాశీఖండ హారవిలాస పద్యములను 'వ్యాఘ్రగావ్యాస్తనులు' అనుశృంగారనైషధ

ప్రయోగమును, 'వ్యామగ్రాహ్యకుచంబు లంటి' అని శివరాత్రిమాహాత్మ్యప్రయోగమును నిచ్చియున్నారు. ఈపద ప్రయోగమునకు మూలముగా నీక్రింది అనర్ఘరాఘవశ్లోక భాగమును నుదాహరించియున్నారు.

"వ్యామగ్రాహ్యస్తనీభి శ్శబరయువతిభిః కౌతుకోదఞ్చదక్షమ్
కృచ్ఛ్రాదన్వీయమానః క్షణ మచల మసౌ చిత్రకూటం ప్రతస్థే."

క్రీడాభిరామమునందుసైత మీపదము గలదని యెఱిఁగించుచు 'వ్యామగ్రాహ్యనితంబబింబకుచహారాభీలభద్రాకృతుల్' అని యుదాహరించియున్నారు.

క్రీడా. పీఠిక. 17 పుట.

శాస్త్రిగారే ఈపీఠిక 31వ పుటలో నిట్లు వ్రాసియున్నారు.

"హరిశ్చంద్రోపాఖ్యానమునఁ దాళపత్త్రప్రతి ముఖపత్త్రమం దీక్రిందివ్రాఁతను జూచితిని. కాకుళ్లతిరునాళ్లనాఁడు చెప్పిన శ్రీనాథవీథి నాటకం - హైమగ్రావనితంబబింబకుచహారాభీలభద్రాకృతుల్ కామాంధల్ ౯౯వ పుటలో సమగ్రపద్యము చూడనగును."

ఆసమగ్రపద్యమును నేనిట నుదాహరించుచున్నాఁడను.

వ్యామగ్రాహ్యనితంబబింబకుచహారాభీలభద్రాకృతుల్
కామాంధల్ వెలనాఁటికోడెవిధవల్ కాకొల్నితిర్నాళ్లలో
నామాం*థాతృఁడు భీమసేనుఁడు హిడింబాధీశ్వరుం డోపునో
యేమో కాని తెమల్పనేర రితరుల్ హేలారతిక్రీడలన్.

ఇచట వ్యామగ్రాహ్యపదమున కన్వయము కుదురదు. వ్యామగ్రాహ్యము నితంబబింబమా లేక కుచములా లేక ఉభయమునా? నితంబబింబము వ్యామగ్రాహ్య మనిన

---

* మాంధాతుఁడు.

నెడబరముగా నుండును. ఇంతకు 'హైమగ్రావ' యను పాఠమునందే యన్వయము కుదురును. పర్వతమంతటి నితంబబింబ మనినపుడే యది భయంకరాకారముగలది యగును. అందుచే నిచట వ్యామగ్రాహ్యపద మసంబద్ధము. ఇది శ్రీనాథునిదిగా చేయఁదలఁచి యాపదమును గూర్చుకొన్నను నతుకదు. వెలనాటి పొగరుఁబోతువిధవ లయినపుడు వారు కుచములపై హారములు దాల్చు టెట్లు? ఏతులసిపూసలవే రయినఁ దాల్చిన దానిచే భద్రాకృతి యేర్పడు టెట్లు? శ్రీనాథుఁ డీవ్యామగ్రాహ్యశబ్దమును ప్రయోగించినతావులం దెచ్చటను నిట్టి యసభ్యవిషయమును జతగూర్చియుండలేదు. ఈకావ్యము వీథి గావున నిచట నసభ్య మనిపింపదనుకొనినను, ఆపదము ప్రయోగించినతావుల నెచ్చటను దాని ననన్వితముగా నస్థానమున శ్రీనాథుఁడు గూర్చిపెట్టలేదు. శ్రీనాథునకు వ్యామగ్రాహ్యపయోధరము లభిమతము గావున, నీపదప్రయోగము నీక్రీడాభిరామమునందుసైతము చేసియుండెను గావునను నిది శ్రీనాథకర్తృకమే యనుటకు సాధన మగు నని శాస్త్రిగారి యభిప్రాయము. కాని యీ విరుద్ధపాఠ మిచట నెట్టులును బొసఁగ నేరనిదగుటచేత నీపదప్రయోగ మిచట నుండుననుకొనుటయే యిది శ్రీనాథుని రచన కాదనుటకు నిదర్శన మగును.

### ప్రయోగసామ్యము

నైషధాదిరచనలలోఁ గానవచ్చెడి యసాధారణములైన ప్రయోగము లిందుఁ గానవచ్చుచుండుటచే నిందలి

పద్యములు శ్రీనాథునిరచన యిది యని పట్టియిచ్చుచున్న వనినారు. దానికిఁ బ్రథమోదాహరణ మీక్రిందిపద్యము.

శా. పంచారించిన నీపయోధరము లాస్ఫాలింతునో లేఁతబో
మ్మంచుం గెంజిగురాకుమోవి ణిసిధాత్వర్థం బనుష్ఠింతునో
పంచాస్త్రోపనిషద్రహస్యపరబ్రహ్మస్వరూపంబు నీ
కాంచీదామపదంబు ముట్టుదునో యో కర్ణాటతాటంకినీ!

ఈపద్యము నడక కొంత యెగుడుదిగుడులు లేకుండ సాగిన దనవచ్చును. కాని యర్థసందర్భమునఁ బొసఁగుఁ బాటు గానరాదు. శ్రీనాథుఁడు నైషధమునం దుపయోగించిన 'పంచారించిన' 'బొమ్మంచు' 'ణిసిధాత్వర్థము' అను పదములును, భీమేశ్వరపురాణమునందలి 'గంధర్వోపనిషద్రహస్య' శబ్దమువంటి 'పంచాస్త్రోపనిషద్రహస్య' శబ్ద మిచట జతపడిన వని యిది యాతనిరచనయే యనఁదగి యున్న దని నారు. కాని యీపద్యమునం దాయోజించినయర్థ మెట్లు సాగెనో పరికింతము. "విజృంభించియున్న నీపాలిండ్లను చఱతునో, లేఁతయెఱుపుగల కెంపుఁజిగురాకువంటి మోవిని (ఓష్ఠమును) ముద్దుపెట్టుకొందునో, మన్మథోపనిషద్రహస్య రూపమైన పరబ్రహ్మస్వరూపమగు నీకటిప్రదేశమును ముట్టు కొందునో!" యని దీనియర్థము. పాలిండ్లను ఆస్ఫాలించు టలో సారస్య మేమి? బొమ్మంచు అనఁగా ఎఱ్ఱనిది. లేఁత బొమ్మంచు అని విశేషింపఁ జేసినతరువాత, మోవిని కెంపు చిగురాకుతోఁ బోల్చుట పునరుక్తప్రాయమైన ప్రయోగము.

గాంధర్వమునకు వేదవ్యవహారము గలదు గావున దక్షా రామ దేవగంధర్వాప్సరోభామినులచే శ్రీనాథుఁడు భీమేశ్వర పురాణమున గంధర్వోపనిషద్రహస్యములు వక్కాణింపఁజేసి నాఁడు. కామశాస్త్రమేగాని మన్మథ వేద మనునదియే గాన రాదు. వేదమే వినరానప్పుడు, దాని కుపనిషత్తు లుండుట గాని, తద్రహస్యమైన పరబ్రహ్మస్వరూప ముండుటగాని యసంభవము. మఱియు నిచట కవి కుద్దిష్టమైన రహస్య పరబ్రహ్మస్వరూపము జఘనముగాని, కాంచీదామపదంబు (కటిప్రదేశము) మాత్రము గాదు. ఇంతియగాక నైషధము నందు 'ణిసిధాత్వర్థ మనుగ్రహింపు' మనిపించినాఁడు. ఇచట ణిసిధాత్వర్థ మనుష్ఠింతునో యనుట సభ్యముగాఁ దోఁపదు. కావున నీపద్యమునం దర్థము సర్వథా అనన్వితమై చూపట్టు చున్నది. కావున నిట్లనన్వితముగా నుండిన యీపద్యము శ్రీనాథునిరచన గానేరదనియే యనుకొనఁదగును.

ఇటులనే శివరాత్రిమాహాత్మ్యమునందలి 'ఆదికాల మున మాయావిలాసినియైన మురదైత్యదమనుని మూర్తి వోలె' ఇత్యాదిపద్యమును బోలియున్నదని తెలిపిన 'కమ తావతారంబు గైకొన్న దైత్యారి' ఇత్యాదిపద్యముకూడ అర్థ సంశుద్ధి లేకయే యున్నది. కనుఁడు—

సీ. కమఠావతారంబు గైకొన్న దైత్యారి
   కమనీయచరమభాగంబువోలె
నాదియుగంబునం దావిర్భవించిన
   జిననాథదేవుని శిరసువోలెఁ

గసటుపోవఁగఁ ద్రోమి కడిగి బోరగిలంగఁ
పెట్టిన తామ్రంపుబిందెపోలె
గంగమట్టియతోడి సాంగత్య మెడలిన
ననుపారు ముని మిట్టనుదురుపోలెఁ
జిఱుతప్రాయంపునాఁటి సజ్జకపుఁ జాయ
తొలఁగ మర్తయ కాలంపువిలసనమునఁ
దరుణులకుఁ బంచబాణమందిరము లమరు
సుసరభేత్తను నీమందు సోఁకినపుడు.

మంచనశర్మయు టిట్టిభసెట్టియు హట్టమార్గమునఁ బడి పోవుచుండ నొకబోటి 'సుసరభేత్తని' ఘోషించుచుండెను. అది విని మంచన 'కిరాట! ఇది యేమి ఘోషించుచున్న'దని యడుగఁగా సెట్టి తెలుపుచు, ఇది సుసరభేత్తను మందు. దీనిని తరుణు లుపయోగింతురు. ఈమందుసోకినపుడు తరుణులకు మన్మథమందిరములు, కూర్మావతారము దాల్చిన విష్ణుదేవుని యందమైన తుదిభాగమువలెను, ఆదియుగమున వెలసిన జిననాథదేవుని శిరస్సువలెను, కిలముపోవునట్లు త్రోమి కడిగి బోరగిలఁబెట్టిన రాగిబిందెవలెను, గంగమట్టిని దాల్చని మునీశ్వరుని యెత్తయిన నుదురువలెను, అమరు నని యనినాఁడు. ఎత్తుగీతిలోని మొదటిరెండుపాదము లందును అర్థమునకుఁ జొసఁగుఁబాటే కానరాదు. ఇఁక ఆదివరాహముయొక్క తుదిభాగ మనిన, తాఁబేటితోఁక యుండుచో టగును గాని, నునుపన కభిమతమైన మీఁదిభాగ మను నర్థము రాదు. జిననాథుఁ డాదియుగమునం దావిర్భ

వించినట్లు నైతిహ్యము వినరాదు. జైనతీర్థంకరుల యుద్భవమే యర్వాచీనము. అట్టిస్థితిలో ఈయుపమానసామగ్రికి సరిపడిన జిననాథుఁడు మొదటియుగమునఁగాని, యుగప్రారంభమునఁగాని యావిర్భవించుట యెట్లు పొసఁగఁగలదు. ఇఁక నిర్మలినముగాఁ దోమి కడిగి బోర్లించి పెట్టిన రాగిబిందెతోఁ బోలిక చెప్పుట యేవగింపు గలిగించు నర్థమును స్ఫురింపఁ జేయుచున్నది శ్రీనాథునిరచనలో మునినాథుని నుదు రెచ్చటను గంగమట్టితో సాంగత్యము లేనిదిగఁ జిత్రింపఁబడినతావే గానరాదు. ఇట్టి యీపద్యరచన శ్రీనాథునిదిగా నెట్లు భావింపవచ్చునో సహృదయు లరసెదరుగాక.

మఱియొక్కమాట. 'సురరభేత్తు' అనుపదమే యిచట విరుద్ధమైనది. సరభేదనసమర్థమైనది సంస్కృతవ్యాకరణపరిపాటి ననుసరించి 'సరభిత్' అయి, 'సురరభిత్తు' అగునుగాని, 'సురరభేత్తు' కానేరదు. సంస్కృతవ్యాకరణమునం దఖండపాండిత్యము గలిగి సాధుశబ్దప్రయోగముమాత్రమే చేయఁజాలిన శ్రీనాథుఁడే యీపద్యమును రచించియున్నచో నిట్టి పదప్రయోగము చేయఁజాలఁడు. కావున నీపద్య మేవిధముగఁ జూచినను శ్రీనాథునిరచన గానేరదు. ఇది వల్లభరాయవిరచిత మనుటకు, శ్రీనాథునివలె రచనసాగింపఁ దలపెట్టి యపరిణతముగను, అనన్వితముగను సాగించుటయే తార్కాణము. ఈరచన వల్లభామాత్యునిదిగావుననే సీసము నాలుగు పాదముల నడక సమానమైన తూఁగులో లేదు. శ్రీనాథుని

సీసరచనయందలి శిల్పము కడువిలక్షణమైనది. సీసపాదములు నాల్గింట నుపక్రమోపసంహారములు సమానముగా నుండి సమానమైన శయ్యాసౌష్ఠవము జతపడియుండును. ఈవిధముగ నెగుడుదిగుడు నడకగల సీసపాదములు పెక్కులీరచనయందుఁ జాలపద్యములలోఁ గానవచ్చుటయే యిది శ్రీనాథుని రచన కాదనుటకు ప్రబలనిదర్శనము. మచ్చునకొకసీసపద్యము నుదాహరించి కొదువపద్యముల మొదళ్లను సూచించెదను.

సీ. ఎందుండి వచ్చితి రీరు ? కాసల్నాట
 నుండి వచ్చితి మేము ముత్పలాక్షి
యెవ్వారివారు మీ ? రేము సంకృతిపూంతి
 మాషమాధవుని కుమారవరుఁడ
మీఁదివ్యనామకం బేదియో ? గోవింద
 మంచనశర్మ సమాహ్వయులము
మీర లిచ్చటికి రాఁ గారణం బెయ్యది ?
 చేరి మీబోంట్ల నాశీర్వదింప
నైన విచ్చేసి కూర్చుండ నవధరింపు
 డార్చి వచ్చెద మటవోయి వనరుహాక్షి
యిచ్చటికి వార్వఁ బోయెద రెఱుఁగఁ జెప్పు
 డక్కవాడకు మేము బ్రాహ్మణుల మగుట.

**ఈతీరున నడచినవియే యీక్రిందిపద్యములు.**

1. రాజమార్గంబు వారణఘటాఘోటక...
2. శోణాగ్రసంఘర్ష ఘుమఘుమధ్వని...
3. అదె నీతమారిత మదనరేఖాకన్య...

4. అలకాపురంబున నంగారపర్ణుఁడక్ ...
5. ఏమి చెప్పుదును మా కీవు తోఁబుట్టుగవు...
6. మును తనకూఁతు దీముగఁ జూపి...

ఇత్యాదిపద్యములు సీసపాదముల కెట్టులో పదము లతికించి సరిపెట్టినట్టులు గానవచ్చునే గాని సీసపుఁబొంక మేపాటియుఁ గానరాదు. వీనిలోఁ గొన్ని శ్రీనాథునిపోక డలో నడిపించుట కుపక్రాంతమై దెబ్బతినినవి గలవు. ఈ కృత్యాదిలో నుండిన శ్రీనాథుని సీసపద్యములను బోలినవి గాని, శ్రీనాథుని యితరప్రబంధములందలి సీసములను బోలిన పద్యములుగాని యేయొక్కటియుఁ గానరాదు. ఆవిషయ మును వివరింప మొదలుపెట్టినచదియే యొక పెద్దగ్రంథమై పోవును. కావున నీవిషయము నింతటితో విరమింతును.

శ్రీనాథుని వీథినాటకములోని పద్యములుగాఁ బెక్కురు లాక్షణికులచేఁ దమతమలక్షణగ్రంథములం దుదాహరింపఁ బడిన పద్యములు 'కందుకకేళిసల్పెడిప్రకారమునన్' 'కుసుమం బద్దిన చీరకొంగు వొలయన్' ఇత్యాదులు రెండు నీక్రీడాభి రామములోనికిఁ జేరినవి. వల్లభరాయని యీవీథిలో నీపద్య ములు రెండును గూర్చినతావులం దవి లేకుండినను కథా గమనమునకుఁగాని వర్ణనాక్రమమునకుఁగాని లోప మేపా టియు లేదు. అందును కర్ణాటాంగనను వర్ణించినపద్యము నాస్థానమునఁ గూర్చుటయే యీక్రీడాభిరామము శ్రీనాథ కృతము గాదనుటకు నిదర్శనమై వెలయుచున్నది.

మ. కుసుమం బద్దిన చీరకొంగు వొలయం గ్రొవ్వాలు పాలిండ్లపైఁ
ద్రిసరంబుల్ పొలుపాఱ వేణి యకటూదేశంబుతో రాయ న
ప్పస మెవ్వాఁడో యొకండు రాత్రి రతుల న్బగ్లాని గావింపఁగా
వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం గంటిరే!

ఈపద్యమున సురతమ్రుదితయై విశ్లథావయవయైన కర్ణాంగనసౌందర్యము వ్యక్తమయినది. ఆమె కట్టిన చెంగావిరంగుచీరకొంగు తొలఁగిపోయినది, పాలిండ్లక్రొవ్వు తరిగి హారములు చెదరిపోయినవి. కొప్పు బిగి సడలి ముచ్చిలిగుంటపై వ్రేలాడినది. రాత్రియంతయు నెవఁడో యొకఁడీమెను సురతమ్రుదితను గావింపఁగా, అవయవములు వసివాళ్లువాడుచు వచ్చుచున్న దీయంగన. ఈమెను గనుఁగొంటిరా? యని యీపద్యభావము. దీనిలో కర్ణాటాంగన సౌందర్యము చిత్రముగాఁ జిత్రింపఁబడినది.

ఈపద్యము తరువాతఁ గ్రీడాభిరామమునం దీక్రింది రెండుపద్యములు కర్ణాటాంగనాస్వరూపచిత్రణమునఁ గూడినవి. అందు మొదటిది—

గీ. వాహకుం డెక్కి విడిచిన వారువంపుఁ
గొదమయుంబోలె రతికేళిమదము డిగ్గి
యలసభావంబుతోడఁ గర్ణాటవేశ్య
వచ్చుచున్నది యది విప్రవర్య! కంటె?

ఈపద్యము శ్రీనాథునిది గావుననే నీప్రయోగమే శివరాత్రిమాహాత్మ్యమునందును జేరిన దనినారు. అచటి వచన మిది. "వాహకుం డెక్కి విడిచిన వారువంపుఁ గొద

మఱియుం బోలె సంభోగంబునం దృప్తిచని, తనివోవని కౌతు
కంబున సుకుమారుఁ గౌఁగిటంజేర్చి (చండాలాంగన) యి
ట్లనియె." అచటి విషయము సాయంసమయమునకుఁ జెంది
నది. ఇచటిది ప్రాతఃకాలమునకుఁ జెందినది. అచటఁ గౌతు
కము తరుగలేదు. ఇచట రతికేళిమదము తరిగిపోయినది.
అచటఁ గానవచ్చెడి సౌకుమార్య మిచటఁ గానరాదు.
శ్రీనాథుని యితరప్రబంధములందలి పదవాక్యము లిం
దెట్టులో చేరినంతమాత్రమున నర్థసౌష్ఠవము, ఆతనిరచన
యందుఁ జూపట్టెడి భావమార్దవము లేనప్పుడు దీని నాతని
రచనగా నెట్లు తీర్పఁగలిగెదము ? నా యూహాలో వల్లభా
మాత్యుఁడు శ్రీనాథుని ప్రబంధము లన్నిటిని జూచినను
జూచియుండవచ్చును. ఏమన శ్రీనాథుఁడు తాను రచింపఁ
బూనిన ప్రబంధముల నన్నిటిని కృతిసమర్పణము చేయఁదల
పెట్టిన సమయమునఁ గాక, యంతకు ముందే, సంస్కృత
గ్రంథములందలి మేలిరచనల ననువదించి కూర్చుకొని
యుండెనని నాయూహ. తన్మూలముగ వల్లభరాయనితో
సారస్వతసంబంధము గలిగించుకొనునాఁటికే కాశీఖండ
శివరాత్రిమాహాత్మ్యముల రచన ముగిసియుండి, శ్రీనాథుని
యనుమతితోడనో, చనువునుబట్టియో, అందలిపదవాక్యము
లీక్రీడాభిరామమున వల్లభామాత్యుఁడు కూర్చుకొని యుండ
వచ్చును. ఆయాప్రబంధములందలి శైలీపరిణతిని నిశితముగఁ
బట్టి చూచిన, నీవిషయము తెల్లమగును.

ఒకప్పుడు శ్రీనాథుఁ డీగ్రంథమును సంస్కరింపఁ దలపెట్టి, యిందుఁ గొన్ని తనపదములను గూర్చి, వానినే తరువాతఁ దన కాశీఖండ శివరాత్రిమాహాత్మ్యములలోఁ జేర్చుకొని యుండరాదా ? యని యనుకొనుటయుఁ బొసఁగుట లేదు. శ్రీనాథుఁడు దీనిని సంస్కరించి యుండినచో నీరచన యింత యసంబద్ధముగ సాగియుండెడిది కాదని నాయూహ.

ఇచటి రెండవపద్యము 'కుసుమంబద్దిన' ఇత్యాదికము నందలి భావమునే సంతరించుకొని యవతరించినది.

ఉ. ఈమఱి నింక నొక్కమఱి యింకొకమాఱిక నొక్కమాఱు నా
నోములపంటగా యనుచు నొవ్వులఁ బెట్టుచు రేయొకండు నా
ల్గాలును దీనితోఁ గుసుమసాయకతంత్రము సల్పఁబోలు లే
దా మృగశాబనేత్ర యఖిలాంగకము ల్వసివాళ్లు వాడునే?

'అప్పస మెవ్వాఁడో యొకండు రాత్రి రతులం బల్గాసి గావింపఁగా' అను పైపద్యమునందలి యొక్కపాదముచే గంభీరముగ నొడివిన యర్థ మీపద్యమున మూఁడుపాదములలో కవితాచమత్కార మంతగ లేనిపద్ధతిని వివరించిన ట్లయినది. శ్రీనాథుఁడే యైనచో నిట్టి పునరుక్తప్రాయమైన రచన సాగించువాఁ డెన్నఁడును గాఁడు. శ్రీనాథునిరచనలో విశేషమేమియు లేకుండ శబ్దార్థపునరుక్తి యెచ్చటను జూపట్టదు. మఱియు నీపద్యమున సొగ సేమియుఁ గానరాదు. ఇట్టి నీరస పద్యమును పాఠకుల కుబలాటముగలిగించు పరిపాటిలో నాతఁడు రచించునలవాటు గలవాఁడు గాఁడు. కావున

సీపద్యవిన్యాసమునుబట్టియు నీరచన శ్రీనాథునిదిగాదనియే తెల్లమగుచున్నది.

శ్రీనాథుఁడు హరవిలాసమునందలి 'కటుక మగు విషము విషధర' ఇత్యాదిపద్యమును యథాతథముగనే భీమేశ్వరపురాణమునందుఁ గూర్చిపెట్టినాఁడు. భీమేశ్వరపురాణమునందలి 'ధరియింపనేర్చిరి ధర్మభవెట్టెడి వ్రేళ్ల' ఇత్యాది సీసమును మార్పేమియు లేకుండ కాశీఖండమునందుఁ గూర్చినాఁడు. కాశీఖండమునందలి 'అరుణగభస్తిబింబ ముద యాద్రిపయిన్' అనుపద్య మాతీకుననే శివరాత్రిమాహాత్మ్యమునందుఁ జేర్చిపెట్టినాఁడు. అట్టియలవాటు గలశ్రీనాథుఁడే యీక్రీడాభిరామమునుగూడ రచియించియున్నచో, శివరాత్రిమాహాత్మ్యమున, చలి నతిసరసముగాఁ జిత్రించిన పద్యములను క్రీడాభిరామమునం దేల కూర్పలేదు. లేదా, యిందున్న చలిపద్యములను గొనిపోయి శివరాత్రిమాహాత్మ్యమునం దేల యతికించుకొనలేదు. ప్రకరణము సమానమైనపు డిక్కడివి యక్కడికి అక్కడివి యిక్కడికి మార్చు పరిపాటి యాతనికిఁ గలదుగదా! అట్లు చేయకుండుటయే క్రీడాభిరామము శ్రీనాథవిరచితము కాదనుటకు నిదర్శనమై వెలయుచున్నది. మఱియు చలినిగూర్చి వర్ణించినక్రమమున శ్రీనాథునికూర్పులోఁ గలతీర్పిక్రీడాభిరామమునం దేపాటియుఁ గానవచ్చుటయే లేదు.. ఈ రెండు కృతులందుఁ గూర్చినపద్యముల వ్యత్యాసము పరికింపుఁడు.

గీ. చలి ప్రవేశించు నాగులచవితి నాఁడు
మెఱయు వేసవి రథసప్తమీనాఁటను
అన్నసీతు ప్రవేశించి పెచ్చుపెరుగు
మార్గశిర పౌషమాసాలనడుమ.

గీ. ఇనుఁడు కోదండరాశిపై నెక్కినపుడు
నిక్షుకోదండవల్లి నెక్కెడు మారుండు
సమదవేదండగమనమహాసత్తులఁ దయ్యెఁ
దనువు వంచును నల్లన ధనువువోలె. — శివరా.

సీ. ప్రక్కలు వంచి వంచి మునిపండ్లను పండ్లను రాచి రాచి యూ
ర్ముక్కిలఁజేసి చేసి తల యల్లనఁ గాళ్లకు నంది యుంచి లో
చక్కికి నొక్కి నొక్కి యురుసంబడ గుమ్మడిమాటఁగట్టి పై
పెక్కు దుప్పాళిచేసి చలి యెక్కడ నక్కడఁ బెట్టు వేఁకువన్.
— క్రీడా.

శా. బింబోష్ఠీకుచకుంభభారము లురఃపీఠంబునన్ హత్తి మో
దం బారన్ మృదుకేళిశయ్యల శుభాంతర్గర్భగేహంబులన్
దాంబూలీదళపూరపూరితముఖుల్ ధన్యాత్ములు ల్పీత కా
లం బెంతేనియు నిద్రవోదురు నిశ ల్సంభోగలీలావధుల్.
— శివరా.

శా. స్థూలద్విత్రిపటావగుంఠనములున్ ధూపోపచారంబులున్
గాలాగుర్వనులేపనంబులు వధూగాఢోపగూహంబులున్
గేలీగర్భనికేతనంబులను నగ్గెంగాక లేకున్న నీ
ప్రాలేయాగమ మెవ్విధంబున భరింపన్వచ్చురా? టిట్టిభా!

శివరాత్రిమాహాత్మ్యమునఁ గానవచ్చెడి కవితాశిల్పమే పాటియుఁ గ్రీడాభిరామమునఁ గానరాకుండుటయే యీ రచన శ్రీనాథునిది గాదనుటకుఁ దార్కాణమై యున్నది.

## చా టు వు ల పా లి క

శ్రీనాథుని చాటుపద్యములను బోలినపద్యములు కొన్ని యిం దుండుటయు నొక హేతువుగా సమర్థించియున్నారు. ఆపోలికతీరుకూడఁ బరికింతము.

### క్రీడాభిరామములో గానులదాని వర్ణనము.

ఉ. మీనవిలోచనంబులును మీఁటిన ఖంగను గుబ్బచన్నులిం
పైనవయోమృతంబు సొగసైన మదాలసమందయానముం
గా నొనరించి దీని గణికామణిఁ జేయక నిర్దయాత్ముఁడై
గానులదానిఁ జేసిన వికారవిధిం దలపొత్తగాఁదగున్. క్రీడా.

### దాసరివనితను వర్ణించినచాటువు.

ఉ. వాసన గల్గుమేను నిడువాలుకనుంగవ గబ్బిగుబ్బలున్
కేసరిమధ్యమున్ మదనకేళికి నింపగు బాహుమూలని
న్యాసముఁ గల్గినట్టి యెలనాఁగను బోగముదానిఁ జేయ కా
దాసరిదానిఁజేసిన విధాతను నేమనవచ్చు నీశ్వరా!

చాటువులోని భావము పదసంయోజనము సుకుమారమై కానవచ్చుచున్నది. క్రీడాభిరామపద్యము దీనిఁ బోలియుండుట నిక్కువమేగాని నడకమాత్రము నసిగా లేదు. అర్థశుద్ధికూడ లేదు. శ్రీనాథుఁ డుపోజములను బెక్కుతావులందు బహుభంగులఁ జిత్రించియున్నాఁడు. కాని యింతటి ధ్వని యెక్కడను వినిపింపఁజేయ లేదు. 'మదాలసమందయానముంగా నొనరించి' యనుప్రయోగము కేవలము పాదముల నెట్టులో పూర్తిచేయుట కాయోజించినట్టులు గాన

వచ్చుచున్నది. దీనికి వెనుకటిపద్యమునం జాగానులదాసి గానుగుపెట్టెపైc గూర్చుండినతీరు చిత్రించినాcడు. ఆతరువాతిపద్యమునం దామెగమనవిలాసమును వర్ణించుటయు పొసగుబాటు గలదిగాc గాన్పింపదు. చాటువులో 'విధాతను నేమనవచ్చు?' ననుటలో సౌకుమార్య మట్టిపడుచున్నది. 'వికారవిధిం దలమొత్తcగాc దగున్' అనుట కటువుగా వినవచ్చుచున్నది. కనుక నిట్టివ్యత్యాస మీవీధి శ్రీనాథునిది కాదనుటకే దోహదము నిచ్చుచున్నది,

ఈక్రిందిసీసపద్యములు రెండిటc గూర్చిన శబ్దార్థభావసందోహమును బరికింపుcడు. శ్రీకాకులపుతిరునాళ్ల వర్ణనము· వితంతువుల కాశీస్సులు.

సీ. చెలcగి చెలcగి పొత్తిచీరలు గట్టెడు
        మాసకమ్మకు దీర్ఘ మాయు రస్తు
సారెసారెకు దేవసదనంబులకు నేcగు
        చెడిపెకు సంకల్పసిద్ధి రస్తు
నిత్యంబు వ్యభిచారనిష్ఠతో నుండెడు
        విధవకుc బుత్త్రాభివృద్ధి రస్తు
దళముగాc దులసిపేరులు ధరించినయట్టి
        విశ్వస్త కారోగ్యవిభవ మస్తు
మిండముండకు సంపత్సమృద్ధి రస్తు
పరచుతెంపికి నిత్యసౌభాగ్య మస్తు
వదరుcబోcడికి నీప్సితావాప్తి రస్తు
బలవితంతువ మైథునప్రాప్తి రస్తు.

క్రీడాభిరామమునం దీవిధవల వ్యభిచారవర్ణన మంతయు మిక్కిలి శ్రుతికటువుగనే సాగినది. దీనికి మూలము ప్రేమాభిరామ మైనప్పుడు దానిలో నింత హేయముగ రచన సాగియుండదు. శ్రీనాథుఁ డింత పచ్చిగ శృంగారమును వర్ణించినపట్టు లెచ్చటను గానరావు. రసికహృదయములకు జుగుప్సను గలిగించెడి యీతీరయిన యీరచనాక్రమమే క్రీడాభిరామము శ్రీనాథునిది గాదని పట్టియిచ్చుచున్నది. దీనికిఁ బోలికగల చాటువును జూడుఁడు.

సీ. శ్రీరస్తు భవదీయచికురంబులకు మహా
భూర్యబ్దములు సితాంభోజనయన!
వరకాంతి రస్తు తావకముఖనఖముల
కాచంద్రతారకం బబ్జవదన!
మహిమాస్తు నీకటిమధ్యంబులకు మన్ను
మిన్ను గలన్నాళ్లు మించుఁబోఁడి!
విజయోస్తు నీగానవీక్షల కానీల
కంఠహారిస్థాయిగా లతాంగి
కుశల మస్తు లచ్ఛాతశాతకుంభ
జంభభిత్కుంభి కుంభాభిజృంభమాణ
భూరిభవదీయవక్షోజములకు మేరు
మందరము లుండుపర్యంత మిందువదన!

ఈచాటువులో శ్రుతికటువైన పదసంయోజనముగాని భావాభివ్యక్తిగాని గానరాదు. భావించినకొలఁది మధురోదాత్తమైన భావము స్ఫురించు శబ్దార్థసంయోజన మీపద్యమున జతపడియున్నది. శ్రీనాథునిరచన గావుననే యీపద్యమింత సరసముగ సాగినది.

## దేవదారువనవిహారము

శ్రీనాథుని హరవిలాసమునందలి దేవదారువనవిహార నిరూపణఘట్టమునందు వర్ణించినశృంగారము సభ్యము గాకుండుట యాతని శృంగారిత్వమునకు నిదాన మనినారు శాస్త్రిగారు. కాని శివమహిమా ప్రతిపాదకములైన గ్రంథములలో నీదేవదారువనవిహారము పరమేశ్వరుఁ డురులింగ స్వరూపుఁడై యవతరించినమహిమ నభివర్ణించునట్టిఘట్టము. శైవకవులకు పరమేశ్వరాశ్రయముగ శృంగారరసము నావిష్కరించుట కనువైన సన్నివేశ మిదియే. వాగ్రూపమున నీశ్వరార్చనకళాశీలురైన సత్కవుల కిది మధురభావసన్నివేశమునకు వలనైన తావు. కావుననే కవితాముఖమునఁ బరమశివలీలలు వర్ణింపఁబూనిన పెక్కురు కవు లీదేవదారువనవిహారమును దమతమ భక్తిభావానుసారముగ నాయోజించుచు వచ్చిరి. ఈపరమేశ్వరలీలలోఁ గలవిశేష మేమన, దీనిలో నుదాత్తమైన శృంగారరసమును భక్తిభావానుభావయోగ్యమును గావించుటకు వలయుసామగ్రి సమకూడియున్నది.

శృంగారైకరసార్ణవమైన శ్రీహర్షనైషధము నాంధ్రభాషాకావ్యముగా నంతరించుసమయమునందును, దన యీశ్వరార్చనకళాశీలత్వము నభివ్యక్తముచేసిన శ్రీనాథుఁడు పరమశంకరవిలాసమయిన దేవదారువనవిహారమును భక్తిభావపర్యవసాయిని గావింపక, పామరహృదయములను గిలిగింతలువాఱించు శృంగారమయఘట్టముగాఁ జిత్రింపఁగలఁ

డని యూహింపఁజాలము. శ్రీనాథుఁ డీఘట్టమున శృంగార
మును గొంత మోటుగ నడిపించె నని కొందఱ యూహ.
ఆయూహ పొడలుటకుఁ గారణముగ గతానుగతికముగ విన
వచ్చుచున్నది యీక్రిందివిషయము. హరవిలాసము పంచ
మాశ్వాసముతుదిని గొంతకాల మముద్రితమై యుండి, తరు
వాత ముద్రితమైనభాగములో, పరమేశ్వరు నురులింగావిర్భా
వము నెఱిఁగించుచు పురుషవరాంగమును దలపింపఁజేయుచు
"కట్టినకౌపీనంబు దలంగఁద్రోచి, ప్రాచీనబర్హిశ్శుండాదండ
సన్నిభంబైన మదనధ్వజదండబు నిగుడించి" యనువాక్య
ముండుటయే. ఇంతమాత్రమున కీరచనయంతయు నసభ్య
మని గాని, ఇది శ్రీనాథుని శృంగారిత్వమునకు సమర్థక మని
గాని సహృదయులయినవారు భావింపనేర రని నాయూహ.
ఇంతియగాక యీదేవదారువనవిహారఘట్టమున శ్రీనాథుఁడు
నిరూపించినది బ్రహ్మానందసబ్రహ్మచారియైన భక్తిభావసము
ద్భావయోగ్యమైన శృంగారరసముగాని శృంగారము గాదు.
ఇచటివిషయము పామరహృదయోల్లాసజనకమైన శృంగా
రమైయుండినచో, దానిని వర్ణించినాఁ డని శ్రీనాథుని
శృంగారిఁగా భావింపనగును. కాని యీఘట్టమున శ్రీనాథుఁడు
శృంగారరసమును నురులింగావిర్భూతిసాధనముగఁ బరమ
సంయమియై యెట్లు నిర్వహించియున్నాఁడో, యీవిషయ
మును నాయూహచొఱఁబాఱినంతకు వివరింతును.

శ్రీనాథుఁడు బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడు. తత్ప్రసాద
లబ్ధవాణీప్రసారమునఁ బరమేశ్వరు నారాధించుశీలము నల

వఱుచుకొనిన కవివతంసుఁడు. సంస్కృతకవులలోఁ గవితా పుష్పోపహారములఁ బార్వతీపరమేశ్వరసమర్చనము గావించిన మహాకవి కాళిదాసు. ఆతనియడుగుజాడలలో మెలఁగినవాఁడు ఈకవిసార్వభౌముఁడు. వివిధరసభావములను బరమేశ్వరాలంబనముగఁ జిత్రించుటలో నిరువురకుఁ బెక్కు విషయములందు సామ్యము గానవచ్చుచున్నది. హరవిలాసమునఁ బార్వతీకళ్యాణకథను దీర్చినాఁడు కుమారసంభవ కావ్యానుసరణము గావించుట యిందులకుఁ బ్రథమనిదర్శనము. కుమారసంభవమునందలి పరిణయావధికథావస్తువును తృతీయచతుర్థాశ్వాసములలో నిమిడించి, అందలియష్టమ సర్గలోని విషయమును వదలి, శృంగారరసమును బరాకాష్ఠ నందించుటకై శివపురాణమునందలి దేవదారువనవిహారమును గైకొనియున్నాఁడు శ్రీనాథుఁడు. కావునఁ బరిణయ ప్రకరణమునఁ బరిగ్రహించిన శృంగారరసభావములను లలిత మధురసన్నివేశములతోఁ బెంపొందింపఁజేసినాఁడు.

శైవకవులు శంకరవిలాసములలో నీదేవదారువన విహారము నుత్తమముగ గణించియు, తదాశ్రయముగ శృంగారరసము నాయోజించుటలో సంయమము నంతగఁ బాటించినట్టులు కన్పట్టదు. శ్రీనాథునకు సమకాలికుఁడు, ఈతనికాశీఖండకృతిభర్తయగు వీరభద్రారెడ్డి యనుజన్ముని దొడ్డారెడ్డిని గృతిభర్తగాఁ జేసి శివలీలావిలాసమును రచించిన నిశ్శంకకొమ్మనామాత్యుఁడు, ఈదేవదారువనవిహార

మును దనకృతిలోఁ గూర్చుచు శృంగారము నతిమాత్ర ముగఁ జిత్రించి పెట్టినాఁడు. పరమేశ్వరాశ్రయముగ నంతటి శృంగార చేష్టల నాయోజించుటలో సంయమ మేపాటియుఁ జూపట్టలేదు. ఆవిషయమున శ్రీనాథుఁ డెంతయు నౌచిత్య మును బాటించుచు, కావ్యోపస్కారకమైన వస్తువును మాత్రమే గ్రహించుచు, తదనుకూలసన్నివేశములను క్రొత్తగఁ గూర్చుకొనుచు భక్తిరసభావపరిష్కారమును గావించియున్నాఁడు. ఇందులో జతగూడిన భావసామగ్రిగాని, శైలీపరిష్కారముగాని, సారస్యముగాని మఱే యితరకవి కృతులందును గాన్పింప దనుట యతిశయోక్తి గాదు. తత్క్రమ మెట్టులు సాగెనో పరికింతము.

శంకరుఁడు పార్వతిని బెండ్లాడి, మన్మథుని పునరుజ్జీవి తుని గావించి, పారిషదగణము తన్ను భజించుచుండ శీత నగమున నవ్యకుటుంబభారసమన్వితుఁడై సంసారసుఖ మనుభవించుచుండెను. పర్వతరాజపుత్రిమీఁదివలపుచేఁ ద్రిలోకాధీశ్వరుఁ డిపుడు హిమవంతునింట నిల్లటముండెను. ఏనాఁడైనను నెట్టివానికైనను భార్యమీఁదివలపుచే నల్లున కత్తవారింట నిల్లటముండుట సహజ మనువిషయము నిట్లు వివరించియున్నాఁడు.

"ఆర్యపైఁ గూర్మి మెట్టిదో! యద్రియింట
నిల్లటంబుండెఁ ద్రిభువనాధీశ్వరుండు."

త్రిలోకాధిపతికైన నిల్లాలిపై నుండెడివలపుచే నత్త వారియింట నిల్లటముండుట యనివార్యమనువిషయ మిందు ధ్వనితమైనది.

ఇప్పటి యీశ్వరవేషము శ్వశురగృహనివాసయోగ్య నూత్నాలంకారపరిశోభితమై యున్నది. ఇంతకుముందు నాగ యజ్ఞోపవీతధారియైన శివుఁ డిపుడు బంగారుజన్నిదములు సవ రించుచున్నాఁడు. రుద్రుఁ డిపుడు గజచర్మము వీడి పట్టు పచ్చడములు దాల్చుచున్నాఁడు. భస్మాంగరాగము నుజ్జగించి కస్తూరితో మేదించిన శ్రీగంధ మలఁదుచున్నాఁడు. ఎము కలపేరులు వదలి ముత్యాలహారములు ధరించుచున్నాఁడు. జడలపైఁ బాగడచౌళ్ళము వెట్టి యామీఁద బాలచంద్రు నవతంసముగఁ గూర్చుచున్నాఁడు. ఇట్లు చంద్రశేఖరుఁడు పెండ్లికొడుకున(అల్లున)కుచితమైనవేషము దాల్చి హిమవం తునింట మనువుగుడుచుచుండెనఁట. పరమశివు నెన్నఁడును పెండ్లికొడుకునుగా రూపించుట శ్రీనాథున కొకవినోదము. అతనితోపాటు అల్లురైనవారి నందఱను పెండ్లికొడుకులను జేయుచుండును.

శంకరుఁ డీవిధముగ దివ్యవేషభూషితుఁడై, తన వాహనమగు వృషభమును వాహ్యాళికి వదలి, అశ్వ మధిరో హించి, ప్రమథులు వెంటరాఁగ నోషధిప్రస్థపురవీథులలో నడయాడఁదొడఁగెను. తమప్రభు వీవిధముగ మహావిభవాభి శోభితుఁడై యోషధిప్రస్థపురమున విహారము సేయుచుండ,

ననుచరులగు ప్రమథులు వీట నెవ్వ రెదురు లేక యవకతవక చేష్టలు చేయ మొదలుపెట్టిరి. వేశవాటమున స్వేచ్ఛగాఁ జరింపఁ దొడఁగి విద్యాధరగంధర్వాప్సరో గరుడభామినీవిటులను బహువిధముల బాధింప మొదలుపెట్టినారు. ఇది మామ కల్లునిపైఁ గోపమువచ్చుటకుఁ గారణముగాఁ బరిణతము గావలయును.

సీ. పులికి శౌసములు గప్పుదురు పాఱఁగఁబాఱ
  విద్యాధరాంగనావిటగణంబు
గంధర్వకామినీకాముకవ్రాతంబు
  లాతాలఁ గొని మోది లజ్జఁగొండ్రు
కకపాల జెలిబూడిఁ గన్నులలోఁ బ్రామి
  బాధింతు రప్సరఃపల్లవులను
గరుడభామాభుజంగప్రతానముఁ బట్టి
  బాధింతు రురుయోగపట్టికముల
నాగడీలు మహాఘోస్తు లగడుఁగాను
లుద్ధతులు గొంట్లు పలుఁగాకు లఁదుకుమిడుకు
లాకతాయలు శకులు గయ్యాళు లగుచు
నోషధిప్రస్థ మిల్లిల్లు నుడుకుచుండ. —హర. 5-10.

తనయల్లుని పరివార మిట్లోషధిప్రస్థపురంబున క్షుద్రోపద్రవంబులు సేయుచుండ హిమవంతుఁ డదియంతయు నెఱింగి, మేనాదేవియు దానును మంతనంబుండి 'యీశ్వరునితోడి పొత్తింతియ చాలు' నని తనకూఁతు రావించి యామెతో "నీమగఁడు ప్రమథగణములు భూతములు పిశా

చములు మున్నగు ధూర్తగణముల నాదరించును. నీభర్త యగు గరళకంఠుఁడు వారిదుశ్చేష్టితములు మాన్పవలదా? అమంగళాకారుఁడై బ్రహ్మకపాలము చేతఁ దాల్చి వాడ వాడల భిక్షమెత్తినకూడుగాక యిట్టిదివ్యాన్నము లాతనికి రుచించునా?" యని హిమవంతుఁడా యాదిభిక్షుకుని స్వరూపమును వికృతముగా వివరించెనఁట.

సీ. తలమీఁది చదలేటి దరిమీలఁ దినఁ జేరు
 కొంగలు చెలఁగి కొంగొంగు రనఁగ
మెడఁ దన్ను పునుకల నిడుపేరు లొండొంటిఁ
 బోరిఁ బోరిఁ దాఁకి బొహొబ్బొఁగు రనఁగఁ
గట్టిన పులితోలు కడకొంగు సోఁకి యాఁ
 బోతుతత్తడి చిట్టు బుట్టు మనఁగఁ
గడియంపుఁబాములు కకపాలలో నున్న
 భూతి మైఁ జిలికిన బుస్సు రనఁగ
తమ్మిపూఁజూలిపునుకకంచమ్ము సాచి
దిట్టతనమున బిచ్చము దేహి యనుచు
వాడవాడల భిక్షించు కూడుగాని
యిట్టి దివ్యాన్నములు మెచ్చునే శివుండు. —హర. 5-16.

పీనులవిందయిన తెలుఁగునుడికారపుఁదీరులో నీపద్యమునఁ బరమేశ్వరుని బిక్షాటనస్వరూప మభివర్ణితమైనది. అవహేళన కనువైన పదములకూర్పులో భావ ముదాత్తమై జతగూడినది. నాదసౌష్ఠవ మూహాతీతగతిని పరిస్ఫుటమైనది. దారుకావనవిహారమున కీభిక్షుకస్వరూపమును బీజభూతముగను బ్రిభాసరసనిర్వహణసమర్థముగను జిత్రించిపెట్టినాఁడు.

హిమవంతుఁ డింతటి యీశ్వరరూపము నమంగళాకారముగ నిరూపించి, తనయల్లు నవమానింపఁ దలపెట్టుటయే పరమేశ్వరుని దేవదారువనప్రయాణమునకు నిదానమై జంగమభిక్షుక వేషధారణమునకుఁ గారణమైనది. మరల నా జంగమభిక్షువేషధారణము మునిపత్నీహృదయ సమ్మోహకమై శంకరుని యాదిమభిక్షుస్వరూపావిష్కృతికి మూలమైనది. ఇ ట్లీయితివృత్తమున శ్రీనాథుఁడు గూర్చిపెట్టిన త్రివిధభిక్షుకస్వరూపములకుఁ గార్యకారణభావము సమన్వితమైనది. హిమవంతుఁడు, తనకూఁతు నెదుట నల్లుని యమంగళాకారము నిట్లు వివరించిన, నామెకు మాన మేర్పడి, తన భర్తను హెచ్చరించు ననియు, తన్మూలమున నోషధిప్రస్థపురమున కీశ్వరపరివారమువలనఁ గలిగెడి క్షుద్రోపద్రవములు లేకుండఁ బోవుననియు భావించి యీపలుకులు తన పుత్రితోఁ బలికినాఁడు. ఆసమయమునందే యఖిలలోకేశ్వరుఁ డగునీశ్వరుఁడు, మామమనసులోని విసుగును, జారగణములకు గలుగు వేసటను, ప్రమథగణములు సేయు ధూర్తకృత్యములను నెఱిఁగికొని, వెంటనే దేవదారువనమునకుఁ బోఁదలఁచెను. తలఁచిన వెంటనే పరమేశ్వరుఁడు నందివాహనారూఢుఁడై, కతిపయప్రమథగణ పరివారపరివృతుఁడునై, మామ కెఱింగింపక, గౌరితోఁ జెప్పక, దేవదారువనమునఁ బ్రవేశించెను.

శివలీలావిలాసమునందలి దేవదారువనవిహారేతివృత్తమును శివభక్తితాత్పర్యసముద్బోధకమే. పరమేశ్వరభక్తి

విముఖులై కర్మఠులైన దేవదారువనవాసిమునులకు శివభక్తి తత్పరత నొదవించుటకై హరిహరులు మాయావిటీవిటరూపములు దాల్చి తమవిలాసచేష్టితములచేఁ దవాశ్రమవాసులైన మునులందఱకుఁ గామవికారములు గలిగించి, ధూర్తవిచేష్టితములచే మునిపత్నులపాతివ్రత్యమునకు భంగ మాపాదించి, తన్మూలమున నచటిమునుల నీశ్వరభక్తితత్పరులను గావింతురు. హరవిలాసమున నీశ్వరుఁడు గావించిన దేవదారువనవిహారము మహాలింగావిర్భావమునకు నిదానము. శివపురాణాంతర్గతకథావస్తువు దీనికి మూలము. కాళిదాసవిరచిత కుమారసంభవకావ్యవస్తు పీఠబంధాగ్రతమైన వస్తునిర్మాణమున కాదర్శభూతము. కావునఁ, గావ్యసామగ్రి సముత్సేషమునకు వలయు వస్తుసమున్నలన మిందుఁ గావింపవలయును. అందులకై దేవదారువనసౌందర్యము నిందు వర్ణింప సమకట్టినాఁడు. ఇందలిరసము శృంగారము. అది భక్తిభావసముద్దీపకము గావలయునుగాన దానికి సరిపడు ప్రకృతివర్ణనము సేయఁదలఁచి, యావనమును తపోధనులకు దేవతామిథునములకు విహారయోగ్యముఁ గావించినాఁడు. దానికి హిమవత్పర్వతవర్ణనముతో నుపక్రమము చేసియున్నాఁడు.

దేవదారువనము హిమవత్పర్వతదక్షిణసీమలో గౌరీతపోవనమున కుపాంతదేశమునం దుండుటచే మునిజనసంసేవ్యమై యొసలారినది. ఆ పర్వతం బెట్టి దనిన—

సీ. వృద్ధకశ్యపరాజావీ పంక్తిపీఠంబు
సురతరంగిణి వెల్లసిరసు పాఁగ
మహిమండలమునకు మానదండము మేను
పూర్వాపరాబ్ధులు పొరుగుటిండ్లు
కాత్యాయనీదేవి కన్యకారత్నంబు
చేసికన్నులవేల్పు పెండ్లికొడుకు
పాలనీయు మశేషశైలసామ్రాజ్యంబు
యాగహావిర్భాగ మోగిరంబు
మాల్యవన్మేరు కైలాస మలయ సహ్య
గంధమాదన మందర క్రౌంచ వింధ్య
భూధరంబులు చుట్టాలు పొగడఁ దరమె
సకలగుణధాముఁ బర్వతసార్వభౌము.

కావ్యలక్షణసమన్వితికై పర్వతవర్ణన ముపక్రాంతమైనది. హిమవత్పర్వతసార్వభౌమునిమహిమ సకలవిభవాభిశోభితము వర్ణనాతీతమును. అతనికిఁ జతఁగూడిన మహత్త్వమితరపర్వతములకంటె విలక్షణమైనది. ఆపర్వతము మహర్షిజనతపశ్చర్యాయోగ్యము దేవబృందపరిభోగయోగ్యమును నై యున్నది:

క. అందు విహరించుఁ గాంచన
కందరమందిరములందుఁ గౌతుక మొప్పన్
బృందారకమిథునంబులు
కందర్పవిహారములఁ బగళ్లును రేలున్.

ఈపర్వతము కేవలము మహర్షితపశ్చర్యాయోగ్యమగుట యేగాక, రసికజనవిహారయోగ్యము కూడ నని తెలు

పుట కీవర్ణనము. ఆరసికజనము బృందారకమిథున మని తెలుపుట యాప్రదేశము దేవాధిదేవుని విహారమున కధియోగ్య మని యెఱిఁగించుటకు. ఇటు లాహిమవత్పర్వతము నుభయవిధసామగ్రీసమన్వితము గావించి ప్రత్యేకముగ దేవదారువనమున కీక్రిందివిభవమును సమన్వితము చేసియున్నాఁడు.

సీ. కర్ణికామాణిక్య కనకపద్మములతోఁ
    గల్పవల్లీకుడుంగములతోడ
విమలచింతారత్న వేదికాస్థలులతో
    సిద్ధరసాపగాశ్రేణితోడ
దివ్యలోకాప్సరః స్త్రీకదంబములతోఁ
    గామధుగ్ధేను సంఘములతోడ
దివ్యౌషధీలతాదీపమాలికలతో
    సకలర్తుసన్నివేశంబుతోడ
మదనవైరికి గారాపుమామయైన
మంచుగుబ్బలిఱేని సీమాంచలమున
దేవతాముని సేవ్యమై తేజరిల్లు
ధర్మసంజీవనము దేవదారువనము.

హిమవత్పర్వతసీమాంచలమున నుండిన యీదేవదారువనవిభవము నభివర్ణించిన క్రమము, కాళిదాసు రచించిన అభిజ్ఞానశాకుంతలమునందలి కశ్యపాశ్రమమును వర్ణించిన యీక్రిందిశ్లోకమును దలఁపింపఁజేయుచున్నది.

శ్లో. ప్రాణానా మనిలేన వృత్తి రుచితా సత్కల్పవృక్షే వనే
తోయే కాంచనపద్మరేణుకపిశే ధర్మాభిషేకక్రియా,

ధ్యానం రత్నశిలాతలేషు విబుధ స్త్రీసన్నిధౌ సంయమః
యత్కాంక్షన్తి తపోభి రన్యమునయ స్తస్మిం స్తపస్యన్త్యమీ.

ప్రాణాయామము నభ్యసించుట కనువయిన కల్పవృక్షములు గలవనములు, కాంచనపద్మపరాగముచేఁ గపిశవర్ణమై స్నానయోగ్యమైన జలము, ధ్యానముచేయుటకు యోగ్యమయిన రత్నమయమైన శిలాస్థలములు, చిత్తసంయమమున కనువైన దేవతాస్త్రీలసాన్నిధ్యము ననునివి గలతావులు తపస్సుచేసినఁ గాని లభింప వనినాఁడు కాళిదాసు. అట్టి తపశ్చర్యకు యోగ్యమైన సామగ్రి యంతయు దేవదారువనమునకు సమకూర్చిపెట్టియు నంతటితోఁ దనివితీరక శ్రీనాథుఁడు కామధుగ్ధేనుసంఘమును దివ్యౌషధీలతాదీపమాలికలను సకలర్తుసన్నివేశమును జతఁగూర్చి యీవనమును దేవతామునిసంసేవ్యమును ధర్మసంజీవనమును గావించియున్నాఁడు.

ఇఁక నచట వసియించు సంయమిసందోహమును పంచబాణసదృశమును, వారిబింబాధరలను సౌందర్యకళానిర్జితబృందారకసతులనుగాఁ జిత్రించియున్నాఁడు. పరమేశ్వరుఁ డిపుడు జంగమవేషధారియై తన్మునిపత్నుల పాతివ్రత్యమును భంగింపఁజేయనై యుండెను. కావునఁ దద్వనితామణుల కంతటిసౌందర్యమును గూర్చిపెట్టినాఁడు. మఱియు వారియందుఁ బరమేశ్వరవాల్లభ్యయోగ్యత నాపాదించుటకై యావనమున వారు నెఱపెడి విహారములలోఁ గొన్నివిలాసములు గాన్పింపఁజేసియున్నాఁడు.

శా. ఆయా వేళల మౌనిభార్యలు గృహవ్యాపారలీలాభవ
శ్రాంత్యుత్క్లేశము లుజ్జగింతురు లసత్కర్పూరరంభాఫల
చ్ఛాయాశీతలచంద్రకాంతమణిపాషాణప్రదేశంబులన్
వాయుప్రేరణఁ బచ్చకప్పురము పైవర్షింప నక్కాననన్.

మహర్షులభార్య లాయావేళలం దింటిపనులను నిర్వర్తించుటలో శ్రమగొనినపుడు, కర్పూరపుటనంటిచెట్లనీడలలోఁ జంద్రకాంతశిలావేదికలపైఁ గూర్చుండి, వాయుప్రసారముచేఁ బచ్చకప్పురము మీఁద వర్షముకురియుచుండఁగాఁ బరిశ్రమమును బోఁగొట్టుకొందురఁట. మఱియు మధ్యాహ్నకాలమున గృహవ్యాపారములచే మేనులందుఁ జెమటలు పొడమినపుడు నచటిసెలయేళ్లలో జల్లులు చిలుకులు నాడుదురఁట. ఇట్లాతపోవనపరిసర మంతయు మౌనిజనవనితావిహారయోగ్యమైన సామగ్రితో విరాజిల్లుచుండె నని తెలుపుట కీయుపక్రమము గావించియున్నాఁడు.

ఇఁక నాతపోవనప్రకృతి తపశ్చర్యానివిష్టమనస్కులైన మహర్షులకుసైత మనుకూలమైన సామగ్రితోఁ దుల తూగుచుండినట్లును జిత్రించిపెట్టినాఁడు. అచటిమునులు జ్యోతిష్టోమాదియాగముల నాచరించుచుండ త్రేతాగ్నిసముద్భూతమై పుణ్యధూమరేఖావృతమైన పరిమళము పాతకసంఘము నణఁచివైచును. అచటి గండుకోయిలలు సామము లేడింటిని బఠించును. తుమ్మెదలు ప్రణవాక్షరము లాలపించును. శుకశారిక లాగమసిద్ధాంతములను బ్రస్తావించును.

నెమిళ్లో శాస్త్రము లావర్తించును. ఈతీరుగ నచటి ప్రకృతి యంతయు సద్భావసముద్బోధకమై వెలయుచుండు నని నాఁడు. ఈవర్ణనపరిపాటి భారతమునందలి శకుంతలోపాఖ్యానమునఁ గానవచ్చెడి కణ్వాశ్రమవర్ణనాక్రమమును దలఁపింపఁ జేయుచున్నది. మహర్షులయాశ్రమములు వర్ణించుపట్టులందు శ్రీనాథుఁడు కాళిదాసువలెనే కొంతప్రణిధానమువహించును.

ఇఁక నచటి నీవారముష్టింపచులైన మునులు మన్మథునేపాటియు లెక్కింపక, కామక్రోధాదివికారములు దరిఁ జేరనీయక పరలోకసాధనపరాయణులై ప్రశాంతచిత్తులై నియమవంతులై యాశ్రమోపాంతములఁ జరింతురఁట. తత్ప్రశాంతతపోవనమున మునికన్యకాకదంబము పసిఁడికుండలఁ సెలయేటినీటిని గొనితెచ్చి కన్నెలతలకు నీరుపోయుటను మనోహరదృశ్యముగఁ జిత్రించియున్నాఁడు. ఈవర్ణనము ఈప్రబంధమునకుఁ గావ్యత్వము నాపాదించుటకే యుపక్రాంతమైనది.

సీ. జిలుఁగైన కనకంపుఁ జీనాంబరముఁగొలఁగు
పాలిండ్లబిఁకంబు బయలుపఱుప
భ్రమరకంబులఁ జుట్టు ప్రస్వేదకణములు
నొసలి కస్తురిబొట్టు నూలుకొలుప
దరవిశ్లథంబైన ధమ్మిల్లభారంబు
చిమ్మచీకట్లకుఁ జిట్టమిడుకఁ
దరళహాటకరత్నతాటంకదీప్తులు
చెక్కుటద్దములపై జీరువాఱఁ

బసిఁడికుండల నిర్ఝరాంభస్సు దెచ్చి
పోయుఁ గంకణనిక్వాణములు సెలంగఁ
గన్నెలతలకు మునికన్యకాకదంబ
మభిమతంబైన యుపవనాశ్రమమున.

ఈపద్యమున మునికన్యల కట్టు బొట్టు జుట్టు అను నీమూఁడును గడుఁ బొంకముగఁ జిత్రింపఁబడినవి. మునికన్యలు కన్నెలతలకుఁ గుండలతో నీరుపోయుట వారియాడుదనకు సరిపడిన తపశ్చర్య. హిమవత్పర్వతమును సకలవస్త్వాకరముగ నిరూపించుటనుగాఁబోలు మునికన్యకాజనమునకుఁ జీనాంబరములు తాటంకములు కంకణనిక్వాణములు సమకూర్చి పసిఁడికుండలతోఁ లతలకు నీరుపోయించినాఁడు శ్రీనాథుఁడు. ఇది యెంతయు సరసమధురమైన భావన. ఇటులనే తదాశ్రమమునందలి గోవు లుండెడి గొట్టములలో లేఁగదూడలు గంతులువేయుట నెంతయు సహజరమణీయముగను లలితసుకుమారముగను జిత్రించి పెట్టినాఁడు.

శా. ఆనందంబునఁ ద్రుళ్లుఁ బుచ్ఛములు పెల్లల్లార్చుచున్ లేఁగ ల
క్కానన్ గోకులగోష్ఠదేశమున జంఘాలాఘవం బొప్ప హో
మానుష్ఠానవిధిప్రకారపరతంత్రాత్మప్రసూకామధు
గ్ధేనూధస్యసుధాప్రవాహలహరీతృప్తాంతరంగంబులై.

దేవదారువనమునందలి గోష్ఠప్రదేశములందు లేఁగదూడలు మునుల హోమానుష్ఠానమునకు వలయుపాలు వారు గొనినతరువాత, తమమాతలగు కామధేనువులపయస్సుధాల హదులు గ్రోలి, యానందమునఁ దోఁకలు కదలించుచు

గంతులు వేయుట చూడ ముచ్చటగొల్పునఁట. అచటి ధేను
వులు కామధేనువు లగుటచేఁ దదూధస్య మమృతప్రవాహమై
దూడల కానందము నొదవించి జంఘాలాఘవము నొడఁ
గూర్చినది. ఆవు లేఁగదూడలు పాలుద్రావిన వెనుక గంతులు
వేయుతీరు సహజమధురమైన యొక ప్రేక్షణీయదృశ్యము.
దాని నెంతయు లలితముగ సాక్షాత్కరింపఁజేసినాఁ డీఘట్ట
మున. శృంగారరసమును నిర్వహించుట కుపాత్తమైన యీ
ఘట్టములో నిట్టి పవిత్రభావసంచారము గావింపఁజేసిన
శ్రీనాథుని హృదయము నెట్టు లూహింపవలయునో సహృ
దయు లారయుదురుగాక.

ఈతీరుగనే పర్ణశాలాభ్యంతరములందు మునికన్యలు
చెంచుచిగురాకుఁబోణుల వేడబములు దాల్చి, వారిచేష్టల
నభినయించుట ఆరణ్యకప్రకృతి కనుకూలముగఁ గడుమనో
హారముగఁ జిత్రింపఁబడినది.

సీ. సెలయేటి తెలినీటఁ జలుపంతి పసుపాడి
సేసక్రొమ్ముళ్లఁ బిచ్చియలు తుఱిమి
గురువింద పేరులు గుబ్బచన్నులఁ దాల్చి
నెమిలిపించంబుఁబుట్టములు గట్టి
పయ్యెదమాలుగాఁ బొలుటాకు లమర్చి
చాఁదునఁ దిలకంబు సంతరించి
కంకేళిచిగురాకుఁ గర్ణపూర మమర్చి
కుసుమపూవులధూళిఁ గురులఁ జల్లి

చెంచుఁజిగురాకుఁబోఁడుల చేఁత లెల్ల
నభినయించుచు పర్ణశాలాంతరములఁ
దండ్రు లెందేనిఁ జనినప్డు తల్లులెదుర
గారవమ్మున మునికన్యకాజనమ్ము.

అరణ్యకప్రకృతిలో నాగరకుల కభినేయవిషయములు ముగ్ధలైన చెంచుఁజిగురాకుఁబోండ్ల చేత లగుటకు, వారి స్వరూపము నంతకు ముందే పొంకముగఁ జిత్రించి పెట్టినాఁడు.

శా. ఆమోదంబున వేఁటలాడుదురు నీహారాద్రికాంతారరే
ఖామధ్యంబునఁ జాపటంకృతులతోఁ గంధర్వపుత్రీజనుల్
క్షామక్షామమనోజ్ఞమధ్య లురుగుంజాభూషణాలంకృతల్
వ్యాఘ్రగ్రాహ్యపయోధరల్ శబరసేనానాథసీమంతినుల్.

ఈవిధముగ సహజసౌందర్యముతోఁ గూడియున్న దేవదారువనోపాంతప్రదేశ మంతయుఁ దపశ్శాలుర తపోనుష్ఠానమునకు సరిపడినసామగ్రితోఁ గూడియుండినది. ఆముష్యాయణులైన యచటిమునులు కామము పొడసూపకుండ నెంతటినియములు పాటింతురో, వారికిఁ గామోద్బోధము సేయుటకు, వారలవ్రతములు భంగింపఁజేయుటకుఁ బదునాల్గుజాతుల యప్సరోంగనలు జాతి కొక్కొక్క వాడ యేర్పడ స్థిరావాసము లేర్పఱుచుకొని తమతమభవనములందు ఆత్మోత్పత్తిస్థానలాంఛితములైన పతాకల నెగురవైచికొనుచు మునులకు మదనవికారము లొదవింపఁజేయుటకై ప్రతిభవనభిత్తిభాగములందును జిత్తరువులు సంతరించుకొని యుండిరఁట.

ఆచిత్తరువులను, ఆయూతావులం దుండెడి యచ్ఛరపూఁబోం
డ్లను శ్రీనాథుఁ డిట్లు చిత్రించియున్నాఁడు.

"కోరకితనేత్రత్రిభాగుండై కుసుమకంకపత్త్రంబుల
వంకలొత్తుచు రతీదేవివృత్తస్తనంబులమీఁద నత్తమిల్లియున్న
చిత్తభవు విక్రమసంపత్తిప్రకారంబును, నట్టేటం బట్టపగలు
యోజనగంధి యఃనుగంధగజగమన వట్టువచనుంగవ చూచి
తొట్రుపడు వసిష్ఠపౌత్రుని దృష్టిప్రియత్వంబును, నాచార్య
భార్యయగు తారాదేవిమీఁదఁ దారకరాజు వలపుచీటంబు
వాటంబుసేయు లలితకటాక్షవీక్షావిక్షేపమ్ములును, ధృతి
మాలి మాలినీసైకతమ్మున నేకతంబుంబలెఁ బొదలుకురు
వింద పొదలలో వేలుపులంజియ కెంజిగురుంబెదవి చవిచూచి
చొక్కిన కుశికనందను రాగావేశంబును, కుసుమకోదండుని
విజయడిండిమంబగు విభాండకసుతుని వనితామండలాస
క్తియు, బృందావనంబునందు ముకుందుం డొనరించిన
నందవ్రజవధూవిహారాడంబరంబును నంబురుహానూతి ధృతి
చెడి యాఁడుఁబట్టిం బట్టుకొనిన దోషంబుపట్టునుం, బురు
హూతుండు గౌతమకళత్రంబుమీఁదం గల్పించిన చీకటి
తప్పునుం జూడఁ జూపఱకుఁ జిత్తంబు లువ్విళ్లూరు నఁట"

ఏతచ్చిత్రోల్లిఖితవస్తుదర్శనము మన్మథవికారోద్బో
ధకము. ఇవి యన్నియుఁ బురాణప్రసిద్ధములైన కథావస్తు
వులతోఁ గూడినవి. వీతరాగులకు చిత్తవికారములు గలిగిం
చినపట్టు లివి. ఇట్టివి తదాశ్రమవాసితపోనిష్ఠుల నిష్ఠాభంగము

నకై చిత్రింపఁబడినవి. ఇటులనే తదావాసంబుల నివసించు నప్సరోంగనలను త్రిభువనవశీకరణయోగ్యవిభ్రమవ్యాపారాలాపాదివిభూషితలనుగాఁ జిత్రించి పెట్టినాఁడు. కనుఁ డా క్రమము.

“ఇట్టు వసించియుండు నచ్చేడియలలో విబుధమత్తకాశినీజనోత్తమయగు తిలోత్తమయు, వశీకృతకుసుమనారాచయగు ప్రమ్లోచయు, నలకూబరనఖరేఖాంకితస్తనకుంభయగు రంభయు, గుణపేశియగు సుకేశియుఁ, గలమంజుఘోషయగు మంజుఘోషయు, శృంగారవారాసియగు నూర్వశియు, రూపానురూపస్థానకయగు మేనకయు,యనునవ్వరారోహలు, అలవోకకలికిచూపుల, హేలాసందర్శితమేఖలాకలాపంబులగు విభ్రమవ్యాపారంబుల, హాటకతులాకోటిఝుళఝుళత్కారమధురంబులగు మందగమనంబుల, వికస్వరకపోలఫలకంబులగు మొలకనవ్వుల, నమృతరసరూపంబులగు నాలాపంబులఁ ద్రిభువనంబులు వశీకరింతురఁట.”

విబుధమత్తకాశినీజనోత్తమంబుల సౌందర్యంబు చిత్తసమాకర్షకం బగుటయేగాక వారలచూపులు మందగమనములు మందహాసములు మధురాలాపములు త్రిభువనమోహనసాధనము లని చిత్రించి పెట్టినాఁడు. మధురహావభావవిభ్రమోపస్కృతమైన సౌందర్యసృష్టి నిచటఁ గావించియున్నాఁడు కవి. ఇంతటి సంమోహనసామగ్రి యుండినను వికృతి నందని వచటివీతరాగులయిన మునులచిత్తవృత్తు

లనియు, అట్టి దేవదారువనమున మహాసిభార్యలకు మదన వికారము నావిర్భవింపఁ జేయఁ బూనినపరమేశ్వరసౌందర్య మూహాతీత మని నిరూపింపఁ దలఁచి, త్రిభువనసమ్మోహన స్వరూపవతు లయిన యాయచ్చరలప్రోల శివునిచే భిక్షా టనప్రవృత్తి కుపక్రమింపఁజేసియున్నాఁడు. అట్టి దేవదారు వనంబునం దీశ్వరుఁడు తనపరివారము నంతయు నిటనట నుండ నియమించి,

గీ. "పసిఁడికప్పెర లాతాపుఁబచ్చకోల
జోగపట్టియ కకపాల జోలెసంచి
కలికి కాటుక గిర్బొట్టు పలుఁగుపేరు
జాతిగాఁ దాల్చి సెలిమిండజంగ మగుచు."

నావేశవాటమునకు భిక్షాటనమునకై వచ్చెను. ఈ జంగమరూపచిత్రణములో శ్రీనాథునినాఁటి జంగమభిక్షుక స్వరూపము ప్రతిఫలించుచున్నది. ఇట్టి జంగమరూపము దాల్చి ప్రాలేయాచలకన్యకాధిపతి దేవదారువనమున భిక్షా టనమునకై బయలువెడలి తొలుత నప్సరోవేశవాటమునఁ జరింప మొదలిడినాఁడు. అచటి యచ్చర లందఱు వింత యొయ్యారములు మొలతేర నాజంగమభిక్షువునకు భిక్షా న్నము లిడ దొరకొనిరి. 'ప్రస్లోచ మోచాఫలస్థూలాపూప ఘృతాన్వితంబయిన భిక్షమును, నఖాంకురద్యుతులతో మాణిక్యముద్రాలంకారకాంతులు గీలుకొన కెంగేలితోఁ బెట్టినది. రంభ, రంభాప్రమఫలసమగ్రమయిన భిక్ష కామా

రికి, నలకూబరుఁడు దనరాపుఁజన్నులకెలనఁ బట్టి రొమ్మొత్తిన నఖక్షతరేఖలు బయల్పడునట్లు పెట్టినది. మంజుఘోష, కలఘోషభరితకంకణనూపురాద్యలంకారభూషితయై యెదురుగా నల్ల నేతెంచి, హేమపాత్రమునఁ గొని తెచ్చిన యమృతదివ్యాన్నపాయసాహారభిక్ష నొసఁగెను. హారిణి దాక్షాయణీభర్తకుఁ జక్షూరాగ మెలర్పఁగా మాధుకర భిక్షాన్నము వడ్డించెను. ఊర్వశియు నల్లనఁ జేరవచ్చి శ్రీవల్లభకూర్మినెచ్చెలికి వారణాసిరికి మంచుఁగొండరాజల్లునికి ధవళాన్నము భిక్షముగాఁ బెట్టెను. తిలోత్తమాప్సరస పులకండముతోడను ఘృతంబుతోడను గూడినభిక్షమును, పసిఁడిసిబ్బెములు గలపయ్యెదకొంగొకించుక జాఱి చన్కట్టు ఫాలలోచనుని మూఁడుకన్నులకు ముచ్చటగొలుపునట్టులు పెట్టినది. సహజసౌజన్యయగు సహజన్య దోర్మూలకూలంకషంబైన వీఁగుఁబాలిండ్లు పైఁటచెఱఁగు వీడుకొలుప శంకరునకుఁ బుణ్యభిక్ష పొసఁగ వడ్డించెను. చిత్రరేఖ కనకనూపురమేఖలాకలకలము రత్నకంకణములతో రాయిడింప, నభవున కమృతాన్నభిక్ష మొసఁగెను. తక్కు-లేఖాంగనలును భుజంగభూషణునకు నపాంగరంగస్థలలాస్యలంపటంబులగు కటాక్షవీక్షణంబులతోఁగూడ భిక్షాన్నంబులు సమర్పించిరి!

దేవదారువనవేళవాటమున మదనవైరిభిక్షాటనము సేయునపుడు అప్సరోవిలాసవతుల విలాసము లేవియు నేపాటియు నాతనిమనము నపహరింపలేదు. ఆక్రమమున నే ధార

లిచ్చు చందనధూపదీపాద్యుపచారంబులు గైకొనుచు, నంత
టితోఁ దనివివనక, కనకగర్భకపాలపాత్రం బర్ధపూర్ణంబై
కరపల్లవంబున నుల్లసిల్ల నల్లనల్లన యోగపాదుకాయుగ
ళంబు గల్లుగల్లున మొరయ మునిజనాశ్రమంబులఁ బ్రవే
శించినాఁడు శివుఁడు. ఇచట మునివాటంబున శివునిభిక్షా
ప్రవృత్తికిఁ గారణము వేశవాటమునం దాతనిభిక్షాపాత్ర మర్ధ
పూర్ణ మగుటచే దానిఁ బూరింపఁజేయుట కని కడుసున్నిత
ముగఁ దెలిపియున్నాఁడు. అటనుండి మునిపత్నీమనోహరణ
సమర్థమగు సౌందర్యమును, తత్సముచితమైన విభ్రమభంగిని
శంకరు నెడఁ గాన్పింపఁజేసియున్నాఁడు.

హరుఁడు మునిమందిరములమోసల నిలిచి, 'భవతి
భిక్షాం దేహి' యని వారివాహగర్జాగంభీరస్వరంబునఁ బలు
కుచుఁ గులాంగనాజనంబు నపాంగదృక్తరంగంబునఁ జిఱు
నగవు లిసిఱింతలువాఱఁ గనుంగొనుచు, సంయమివధూపాతి
వ్రత్యభంగంబు దనకుఁ బరమప్రయోజనంబుగా నర్మగర్భోక్తి
సందర్భంబుల నిజాభిలాషంబు దేటపఱుచుచుఁ బర్యటింపం
దొడంగె;

శా. హాసంబుల భ్రూలతానటనముద్రావిభ్రమప్రౌఢిమన్
త్రహాసోక్తుల భావగర్భరససంపల్లాపటాలోకన
స్ఫురణాభంగుల మౌనికాంతలమనంబు ల్చూరలాడె న్మహే
శ్వరుఁ డుద్దామవిలాసి దారువనికావాటప్రదేశంబునన్.

౭. సులభ మార్కండేయ శునక మహాంజాయన...
శుక శైల కుళసంప్రసూతులింట్లఁ

గీ. పుణ్యగృహిణులఁ బతిభక్తిపూర్ణమతుల
భాగ్యసంపన్నలను బుత్రపౌత్రవతుల
సతుల ముత్తైదువలను నిశ్శంకవృత్తి
రజనికరఖండమౌళి విరాళిగొలిపె.

ఉద్దామవిలాసి యగుమహేశ్వరుఁడు దారుకావనవాట ప్రదేశంబుల మునికాంతల మనములను మందహాసములతోడను భ్రూభంగవిభ్రమప్రౌఢిమలతోడను నర్మభాషితములతోడను భావగర్భితాలోకనములతోడను జూఱలాడెనఁట. ఇచట పరమేశ్వరాశ్రయముగ శృంగారరసభావావిష్కరణమునఁ బాటించిన సంయమ మూహాతీతము. ఇట్టి పట్టులందు శృంగారరసావిష్కరణతత్త్వము నెఱిఁగిన కాళిదాసాదిమహాకవులకుఁ గొందఱకేగాక సంయమము పాటించుట యనునది యందఱకు నలవిగాని పని. ఇట్టితరుణములందు శృంగారభావములను తదుద్భూతచేష్టాదికము నెంత విరివిగనైనఁ బ్రపంచింపవచ్చును. ఈతరుణమునందుసైతము భావము నతినిబిడముసేయుచు నౌచితికిభంగము గావింపక, జుగుప్సావహాభావము లేపాటియు సోఁకకుండ హాసవిలాసాదికమునే శ్రీనాథుఁడు వ్యక్తీకరింపఁగలిగె ననుటలో నాతనికిఁ బరమేశ్వరునెడఁ గలభక్తిభావాతిరేకము, రసభావావిష్కరణయోగ్యమైన ప్రతిభాసంపత్తియుఁ బ్రధానకారణములు. పరమేశ్వరుఁడు తనవిలాసములచేతనే తనప్రయోజనమును సాధించె ననుటకు, 'పతిభక్తిపూర్ణమతులను పుణ్యగృహిణులను పుత్రపౌత్రభాగ్యసంపన్నులను సతులను

ము త్తైదువలను సైతము విరాళిగొలిపె' నని వివరించి యున్నాఁడు. మఱియు మునిపత్నీపాతివ్రత్యమును భంగింపఁ జేసినక్రమము నతిగంభీరముగను భావగర్భితముగను సముచితగతిని స్వాగించియున్నాఁడు.

"వ. ఇట్లు ప్రతిగృహంబున భిక్షాటనంబు సేయుచు మహోక్షలాంఛనుఁడు, వాంఛానుకూలప్రకారంబునఁ జోరసురతవ్యాపారపరాయణాలై మగల కన్నుమొఱంగి, సంధ్యాసమయంబుల ననుష్ఠానార్థంబుఁ బురుషులు సమిత్కుశాహరణార్థం బెందేనిఁ జనినయెడకు వేచి, శపథశతక్షణోష్ఠంబును నిరుద్ధనిశ్వాసోచ్ఛ్వాసంబును నివారితసల్లాపంబును నిబిరీసభయకంపంబు నైనసంభోగంబు లభిలషించు నారంభోరువుల మదనలేఖాకథాసందేశవాక్యంబులను సంకేతస్థానకంకేళిమంజులనికుంజక్రోడసంవేశక్రీడల, నుపాంత్యదూతీపరామర్శంబులను, భ్రూలతాదేశంబులను నపాంగరంగస్థలలాస్యలంపటకటాక్షవీక్షావిక్షేపంబులను, మందహాసకందళితపరిస్పందంబులను గందర్పబ్రహ్మానందం బనుభవింపఁ జేసె మిసిమింతుఁడును గాక దేవదారుకాంతారమధ్యంబున ఖట్వాంగపాణి భిక్షాటనవృత్తిఁ జరించుచుండె నఁట."

శంకరుఁడు నెఱమిండజంగమవేషము దాల్చి తన హావభావవిలాసాదులచే హృదయములఁ జూఱఁగొనఁగా, నాతనిఁ గవయఁగోరు రంభోరువుల వాగ్విలాసాదివిభ్రమప్రదర్శనమాత్రముననే హరుఁడు కందర్పపరబ్రహ్మానంద మనుభ

వింపఁజేసె నని చిత్రించుటలో శృంగారరస వ్యంగ్యము మహితమై పరాకాష్ఠ నందినది. ఈవర్ణనమునఁ గవికిఁ గల సంయమ మతివేలమై చూపట్టినది. ఈఘట్టమునందే నిశ్శంక కొమ్మనామాత్యుఁడు తనశివలీలావిలాసరచనలో సంయమము నేపాటియుఁ బాటింపక మునిపత్నులతోడి పరమేశ్వర విహారవర్ణనమునందు బంధాదికమునుగూడఁ జిత్రించి వదలినాఁడు. దారుకావనము పరమసంయమితపశ్చర్యానిలయము. ఋషిపత్నులు పాతివ్రత్యనిష్ఠాగరిష్ఠలు. తత్పాతివ్రత్యభంగ ప్రవృత్తుఁడైన శంకరుఁడు యోగీశ్వరేశ్వరుఁడు. తదాలంబనముగ నిర్వహింపవలసిన శృంగారరసవిషయమున సంయమము పాటింపకున్న నది సహృదయులకు వైరస్యమును గలిగింపక మానదు. కావుననే శ్రీనాథుఁ డిప్పట్టునఁ బరమసంయమి యైనాఁడు.

ఈఘట్టమునం దారంభించిన యాక్రమమునే, దేవాసురుల కమృతమును బంచియిచ్చుటకై జగన్మోహినీరూపమున నవతరించిన శ్రీమహావిష్ణువు దేవాసురులను మోహింపఁజేసినపట్టునందును ప్రపంచించియున్నాఁడు. ఆపట్టునందును నిట్టి భావసంయమమునే పాటించియున్నాఁడు. 'ఒక నీలాంభోజపత్త్రాక్షి దివ్యవేషభూషాదిధారిణియై విద్యుల్లేఖ విధమున నాకాశంబునుండి దిగివచ్చి దేవదానవులపంక్తుల నడుమ నిలిచి హావభావవిలాసంబులన నిరువాగులవారిని భ్రమియింపఁజేయుచు,

సీ. పాకశాసనునకుఁ బరిహాసవచనంబుఁ
గాలకేయునకు శృంగారలీల
వైవస్వతునకు భ్రూవల్లరీనటనంబు
కరటిదానవునకుఁ గలికిమాపు
పాశపాణికిఁ గుచప్రాంతోరుదర్శనం
బంధకాసురునకు నలఁతినగవు
ధననాయకునకు నుత్కంఠతావిశేషంబు
మహిషునకును నగ్రసుస్మితకలన
గంధవహునకు సిగ్గు జలంధరునకుఁ
గలికితనముఁ బావకునకుఁ గాను బలికి
వలపు నటియించుచును వారవార తనకుఁ
దాన వారికి వారికి సైనయట్లు.

మెలఁగె నఁట.

ఈక్రమమును బరికించిన హావభావవిలాసప్రదర్శనముల వలపు పుట్టించి చిత్తము లాకర్షింపఁ జేయుటయందే శ్రీనాథుని కవితాప్రసారము చూపట్టుచున్నది గాని, సహృదయులహృదయముల కెడబర మనిపించెడి శృంగారభావములను జిత్రించుట కాతని యుద్యమ ముండినట్లు గన్పట్టదు. మునిపత్నులహృదయముల నావర్జించుట కుపయుక్తమైన హావభావవిలాససామగ్రినే జగన్మోహిని దేవతాసురహృదయముల నావర్జించుట కుపయోగించుటలో నాతనిభావనాలక్ష్యము శృంగారరసభావముల నతిసంయమముతో నిరూపించుట యని సహృదయులయిన భావుకులకుఁ దోఁపక మానదు.

ఇంతవఱకు నీశ్వరుఁడు మునిపత్నుల పాతివ్రత్యమునకు నిగూఢముగ భంగము నెఱపినాఁడు. ఆప్రవృత్తి ప్రత్యక్షమై మహర్షులందఱకుఁ గానవచ్చిననాఁడుగాని, వారందఱు హరుని బంధించుటకుఁ బ్రయత్నము సేయరు. తత్ప్రయత్నమునఁగాని మహాలింగావిర్భావము జరుగనేరదు. తదుపక్రమమునకై యాదిభిక్షుని భిక్షుకస్వరూపమును మఱింత మనోహరముగఁ జిత్రించి పెట్టినాఁడు.

సీ. మువ్వన్నెపులితోలు మొలద్రిండుగాఁ గట్టి
కర్కోటకాహి పాగా ధరించి
చిలువపోగులను వ్రేల్చెవులఁ గీలనచేసి
వలరాచనీఱు మైఁ గలయ నలఁది
చిన్నారిపొన్నారి శిశిరాంశుఁ దలఁ దాల్చి
కొనగోటిజత లేటికొదమఁ బూని
పచ్చియేనికతోలఁ పచ్చడంబు ధరించి
గిలుకుమువ్వలకోలఁ గేలఁ బట్టి
పసిఁడిజలపోసనముతోడ నెసక మెసఁగ
బిసరుహాసను పుఱియకెప్పర ధరించి
పెద్దనడివీథి నిలుచుండి భిక్ష యడుగు
నాశ్రమంబులయందు ఖట్వాంగపాణి.

ఇప్పుడు పరమేశ్వరుఁడు స్వస్వరూపముతో ఘంటాపథమధ్యంబున నిలిచి, ఋష్యాశ్రమములందు భిక్ష నడుగఁ దొడఁగెను. ఇంతవఱకు ముండజంగమురూపమునం దుండిన యీశ్వరుని నిజస్వరూపము ప్రత్యక్షమైనది. ఈప్రత్యక్ష భావమే యాతని బంధించుటకు యత్నింప హేతువయినది.

"ఇవ్విధంబున మన్మథమథనుండు మదనోన్మాదంబునఁ గన్నుగానక మునికళత్రంబుల పాతివ్రత్యంబు పొలివుచ్చుచు విచ్చలవిడిఁ జరింపంబూనిన నిలింపమహానివ్రాతంబు వారికి వారికి నెఱింగి గుజగుజవోవుచు వంచనంబుప్రకాశింపఁజాలక లోలోన యడంచుకొని యుండుచుండ, నప్పాటం బ్రతిభ వనంబునఁ బాటిల్లు చీకటితప్పు కప్పిపుచ్చ నెరవుపడ కుండు నట్టుగాఁ బ్రకాశించినఁ గట్టాయితంబై యందఱు నాజగజెట్టి వేల్పుతేనిం బట్టుకొనువారై చుట్టుముట్టిరి."

పరమేశ్వరకర్తృకమై యింటింటఁ గప్పిపుచ్చుటకు వలనుపడని యాచీకటితప్పు బయటఁబడినపుడు, మహర్షు లందఱు నేకమై జగదేకవీరుఁడైన యీశ్వరుని శక్తిసామర్థ్యములు తా మెఱిఁగియుఁ బట్టుకొని బంధింపఁ జుట్టుముట్టిరి. తత్సన్నాహము చూచి పరమేశ్వరుఁడు మందహాసము సేయుచుఁ దనవరాంగమును నింగిదాఁకఁ బెరిగించి, తత్సాధనంబున నామునుల సన్నాహము నణఁచివైచి, సోమార్కమయసోపానంబుల డిగివచ్చి వియద్గంగాప్రవాహంబున నాలింగంబున కభిషేకం బాపాదించి, తల్లింగోత్సేధంబున బ్రహ్మాండకర్పరం బప్పళింపఁజేసినాఁడు. బ్రహ్మలోకపర్యంత వ్యాప్తమైన యాపరమేశ్వరలింగమునకు బ్రహ్మ తనకరకమండలుతీర్థంబున నభిషేకం బాపాదించి, గంధపుష్పాద్యుపచారంబులతో నుపాస్తి యొనర్చి, బ్రహ్మాండపరివ్యాప్తమైన యాయురులింగంబు నుపసంహరింపు మని స్తుతిపూర్వకముగఁ

ప్రార్థించెను. పరమేష్ఠిప్రార్థన నంగీకరించి, పరమేశ్వరుఁడు 'లింగార్చనాపరులకు మత్సాంగత్యము కృప చేసెద'నని తెలిపి నిజమహాలింగంబును స్తంభింపఁజేసెను. దేవదారువన దివ్యాశ్రమస్థులగు గృహస్థులు పరమేశ్వరుని మహత్త్వము గాంచి, తమమనంబుల నాతనియెడ నీర్ష్యాద్వేషము లుడ్గించి, యాశేషాహిభూషణుని బహువిధభక్తివిశేషముల భజించిరఁట.

ఈవిధముగ నీదేవదారువనవిహారఘట్టమున శృంగార రసమును బరాకాష్ఠనందింపఁ దలపెట్టి, తత్సమగ్రసామగ్రిని సమకూర్చి తుదికిఁ దద్రసనిర్వహణమును బరమేశ్వరభక్తి భావపర్యవసన్నము గావించినాఁడు. శ్రీనాథుఁ డేరసమును నిర్వహింప సమకట్టినను దానిని బరమేశ్వరాశ్రయముగ నే చిత్రించును గావున, తత్తద్రసపోషకభావసామగ్రి యంతయు నైహికవిషయములతో నారబ్ధము లయ్యును నాధ్యాత్మిక భావపర్యవసన్నము లగుచుండును. అత్తవారిమీఁద నలవో కగా నలుక వహించి ధూర్తవిచేష్టితమునకుఁ గడఁగినశంక రుఁడు సకలలోకసముపాస్యమైనట్టి లింగస్వరూపమున నవత రించుట యీవనవిహారమునకుఁ బ్రధానఫల మగుటయే నిదర్శనము. ఇట్లు శివభక్తులకుఁ బరమోపాదేయము పర మోపాస్యమునైన యీదేవదారువనవిహారఘట్టమును పరమ సంయమియై నిర్వహించిన శ్రీనాథుని శృంగారభావసంయ మమును సావధానముగ సద్భావముతోఁ దిలకించిన సహృ

పెయిలకు నిం దెడబరమైన శృంగారవర్ణనము గలదని గాని,
తన్నిర్వహణమున శ్రీనాథుని శృంగారిఁగా భావించుటకు వలను
పడు సనిగాని యూహింపరాదని నామనవి.

### ఊర్వశీ ప్రణయ భంగము

శ్రీనాథుఁడు హరవిలాసమున శృంగారరసమును నిర్వహించినక్రమమును పైదేవదారువనవిహారఘట్టమున వివరించియుంటిని. శ్రీనాథుఁడు శృంగారభావముల నెంతటి సంయమముతో నెంతసుకుమారముగఁ జిత్రించునో యనుట కీగ్రంథమునందే యాయోజించిన ఊర్వశీప్రణయభంగఘట్టమొక విలక్షణమైన తార్కాణము. తదనుసంధాన మెట్లు కొనసాగెనో కనుఁగొందము. హరవిలాసము భక్తిశృంగారవీరరసభావముల కొకసంగమక్షేత్రము. ప్రథమద్వితీయాశ్వాసములలోఁ జిఱుతొండని భక్తిభావములోని వీరత్వమును, తృతీయచతుర్థపంచమాశ్వాసములలో పార్వతీపరమేశ్వరాశ్రయమైన శృంగారరసమును సర్వాంగపరిపుష్టమై పరాకాష్ఠ నందినది. షష్ఠాశ్వాసములో హాలాహలభక్షణనిరూపణమునందును, సప్తమాశ్వాసమున కిరాతార్జునీయకథాసంయోజనమునను వీరరసము చరమసీమకుఁ గొనిపోఁబడినది. ఇట్టి రసబంధురమైన కావ్యసామగ్రికి సూత్రధారభాషితముగా నుండునట్లు కృత్యాదిని పార్వతీపరమేశ్వరుల వసంతవిహారవిలాసములను మనసార నిట్లు స్మరించియున్నాఁడు.

సీ. వేదండవదన శుండాకాండగండూష
కాండసిక్తాప్రసూనోపవనములు
గంధర్వకన్యకా కనకసౌగంధిక
మాలికాలగ్నపాదాగ్రతురములు
నందీశ్వరక్షిప్తనారంగఫలపాక
తరళవిద్యాధరీస్తనభరములు
గణపలీలావతీ కస్తూరికాపంక
విహితనిశ్శేషాంగభృంగిరిటులు
వీరభద్రవితీర్ణ కర్పూరచూర్ణ
ధవళితాకాశచరవనితాముఖములు
శాంభవీశంభుమధుకేళిసంభ్రమములు
పొదలి వాసించుఁగాత నాహృదయవీథి. హర. I-6.

గజాననాదిప్రియనందనులు, నందీశ్వరాదిపరివార ముఖ్యులు, పాల్గొని వినోదించు పార్వతీపరమేశ్వరవసంత కేళీవిలాసములు తనహృదయవీథిలో వాసించుఁగాత మని యాశాసించుచుఁ గవి, కావ్యారంభము గావించుటలో నీకావ్యమున భక్తి శృంగార వీరరసభావము లోతప్రోత మనువిషయ మాసూచితమైనది. కృతిపతియైన అవచి తిప్పయసెట్టి ద్వీపాంతరములనుండి రావించిన సుగంధద్రవ్య సమృద్ధియు, నది శాంభవీశంభుమధుకేళిసంభ్రమముల కుప యుక్తమగు ననుటయు నిట వ్యక్తమగుచున్నది. ఇంతియగాక యీకావ్యమున శృంగారరసము భక్తిపర్యవసాయియై యుటఁ బ్రాధాన్యము వహించియుండు ననుటయు నాసూచితమైనది.

పరమేశ్వరభక్తిపరాకాష్ఠ నానూత్రించుటకుఁ జిఱుతొండనంబిచరిత్రమును, శృంగారరసచరమసీమ నభివ్యక్తము సేయుటకు దారుకావనవిహారమును నిందు సంకలితములైనవి. హరుని దివ్యవిలాసము శైవభక్తులలో వీరుఁడయిన చిఱుతొండని భక్తిపరీక్షతో నారంభమై వీరాగ్రేసరుఁడయిన విజయుని సత్త్వపరీక్షతో ముగిసినది. కావ్యవస్తూన్మీలన ప్రారంభమున గిరిరాజనందనచే నీర్ష్యాతిరేకమున లీలారవిందముతో మొత్తించినాఁడు. అది చిఱుతొండని భక్తశిఖామణిఁగా నిరూపించుటకు బీజమైనది. తుదిని ఏపాకమునకు రాని పాకశాసననందను నూర్వశి లీలారవిందముతో వేయుట యాతనిధీరోదాత్తత నభివ్యక్తము చేయుటకు నిదానమైనది. ఈవిధముగఁ గార్యకారణభావము నానూత్రించి యీప్రబంధమును రసబంధుర మొనర్చినాఁడు శ్రీనాథుఁడు.

రసనిబంధనమునందును ఔచిత్యనిర్వహణమునందును శ్రీనాథుని ప్రతిభ యద్వితీయమై చూపట్టును. అందును నీయూర్వశీప్రణయభంగమును నిర్వహించు నెడ రచనాసంవిధానము సాటిలేనిదై యొప్పలారినది. దేవదారువనవిహారమునందుఁ బరమేశ్వరుఁడు భిక్షాటనమునకై అప్సరోవేశవాటమునఁ జరించునప్పుడు, నంతకు ముందును రంభాద్యప్సరోవనితల రూపరేఖలఁ జిత్రించినక్రమమునఁ జిత్రింపక, నారాయణుని యూరుకాండజనిత యయినయూర్వశి కొక ప్రత్యేకత కల్పించి పెట్టినాఁడు. దేవదారువనమునందలి ఋషుల

వ్రతభంగములు సేయఁబూనిన యచ్చరలేమల విలాసములు వర్ణించు ప్రకరణమున రంభను నలకూబరనఖరేఖాంకితకుచకుంభనుగాఁ జిత్రించి, యీమెను 'శృంగారరసవారాసి యగు నూర్వశి' యని నిర్దేశమును జేసి వదలినాఁడు.

ఇటులనే పరమేశ్వరున కాయచ్చరలేమలచే భిక్ష పెట్టించు ప్రకరణమున వారివారివిలాసములు కాన్పింపఁజేయు నపుడుసైత మొకవిశిష్టతను గాన్పింపఁజేసినాఁడు గాని, వికారమేమియుఁ జూపింపలేదు. కనుఁ డాతీరు.

ఉ. అల్లనఁ జేర వచ్చి ధవళాన్నముఁ గమ్మని కూరనేతితో
బెల్లముతోడ నాల్కుడుపుఁ బేశముతోఁ దనిపంగ్లతోడ శ్రీ
వల్లభుమూర్తి నెచ్చెలికి వారణవైరికి మంచుఁగొండరా
జల్లునికిం బినాకికిఁ బ్రియంబుగ నూర్వశి పెట్టె భిక్షమున్.

హర. 5-48.

భిక్షాటనమునకై వచ్చినవాఁడు మంచుఁగొండరాజల్లుఁడు. మంచుఁగొండ యూర్వశికి జన్మప్రదేశమును విహారభూమియును. ఇంతియగాక పరమేశ్వరుఁడు తనజనకుఁడైన శ్రీవల్లభునకుఁ గూర్మినెచ్చెలికాఁడు. మఱియు నాతఁడు గజాసురసంహారి. కావున నూర్వశి తనవిలాసము లేవియుఁ గాన్పింపనీక ప్రీతితో నాతని కిష్టమైనభిక్షము పెట్టినదఁట. అంతకు ముందు వెనుకలలో నేయచ్చరలేమచే భిక్ష పెట్టించినను నామెయం దేదోయొక శృంగారచేష్టితమును గాన్పింపఁ జేయుచునే వచ్చినాఁడు. తిలోత్తమ భిక్ష పెట్టినతీరు పరికింతము.

ఉ. పెక్కెఁ డిలోత్తమాప్సరస భిక్షుఁ బ్రియంబున భూతభర్తకున్
గ్రక్కునఁ జిందిపోవఁ బులకండముతోడ ఘృతంబుతోడఁ గ్రొం
బక్కుపసిండిసిబ్బెముల పర్యాప్తకొం గొకకొంత జాళి చ
న్పక్కులు లలాటలోచనుని కన్నులపంటికి విందు సేయఁగన్.

హర. 5-48.

ఇట్లా దేవదారువనవాసినులయిన యప్సరస లంద అకు నేదియో యొకవిలాసమును గాన్పింపఁజేసిన శ్రీనాథుఁడు, తరువాతి యీప్రకరణమున నర్జునునిచే నూర్వశికి మొక్కింపనైయుండుటచేఁగాఁబోలు నామెయం దేవిలాస మును గాన్పింపఁజేయ లేదు.

అర్జునుఁ డూర్వశి తన్ను వలచినపు డామెను ద్రోసి పుచ్చిన దాతనియందు రసికత లేక కాదు. అంతకు మున్నొక ప్పుడు పాండవసోదరులు తమలోఁ దాము చేసికొనిన నియ మమునకుఁ బ్రమాదవశమున భంగమువాటిల్లినపుడు, తద్దోష పరిహారమునకై తీర్థయాత్రలకుఁ బయనించిన యేఁడాదిసమ యములో ఉలూపిని చిత్రాంగదను సుభద్రను వలచి వల పింపఁజేసిన రసికావతంసుఁడు కిరీటి. కాని యాయదను వేఱు. ఈసమయమున నూర్వశియే గాదు; మఱి యేసుందరి వచ్చి మీఁదఁబడినను విజయుఁడు వల దని త్రోసిపుచ్చు వాఁడే. అట్టి వాతావరణమును శ్రీనాథుఁ డెట్టులు కల్పించి పెట్టినాఁడో పరికింతము.

ఊర్వశి కర్జునునివలనఁ బ్రణయవిఘాతము గలుగుట ఆతనికిఁ బాశుపతాస్త్రము లభించినతరువాత జరిగినసంఘట

నము. అర్జునుఁడుపాశుపతవ్రతనిష్ఠాగరిష్ఠతతో, బాహుపరాక్రమప్రదర్శనపూర్వకముగ మాయాకిరాతవేషధారియైన పరమేశ్వరుని మెప్పించి, యాతనివలన పాశుపతాస్త్రమును బడసియున్నప్పు డాతపోవనమున కుపస్థితుఁడైన యాఖండలుఁడు, విజయుఁడైన పుత్రుని గాఁగిలించుకొని, యాపోవని తనివితో నేత్రసహస్రమున నానందాశ్రువులు పొదలఁ గుమారునితో "నీవు నివాతకవచ కాలకేయాదిరాక్షసులఁ బరిమార్చి, పిమ్మట నమరావతిలోఁ గొన్నిదివసము లుండి, వ్రతోపవాసప్రయాసం బపనయించుకొని, మరల మధ్యమలోకంబునకు వచ్చునది. మాతలిసారథికమ్మగు రథమ్ము పుత్తెంచెద" నని, గోమహర్షుఁ డనువానిని పాండవుల కర్జునుని కుశలవార్త యెఱిఁగింపఁ బంచి, తా నమరావతికి వెడలిపోయెను. అర్జునుఁ డంత మధ్యాహ్నకాలంబున నిర్వర్తింపవలసిన శంభుపూజ ముగించి, కందమూలాదు లాహారించి, యొకచెట్టునీడను విశ్రమించి యుండఁగ, మాతలి దివ్యస్యందనంబు గొనితెచ్చి యాతని నమరావతికిఁ గొనిపోయెను.

మాతలియుఁ దాము పయనించుమార్గములోఁ గానవచ్చెడి గ్రహనక్షత్రాదిమండలవిశేషముల నొక్కటొక్కటిగ నెఱిఁగించుచు, నమరావతికి విజయునిఁ గొనిపోవుచుండఁగ, నందనోద్యానవనముమీఁదుగ నొకమందమారుతము వీచినది. ఆయనిలప్రసార మీవిధముగ సాగినది.

అజ్జునివిూఁదఁ బొలసెఁ బఠ్యాత్తరమున
నభ్రగంగాతరంగాగతానిలంబు
నందనోద్యానవీథి కానవలతాంత
సౌరభాసారలహరీవిహారమగుచు. హార. 7-115.

ఈవాయు వాకాశగంగాతరంగసంపర్కముచే శీత
లము పవిత్రమునై నందనోద్యానవీథిని నవకుసుమసౌరభల
హరిలో విహరించి పరిమళభరితమై తపోవ్రతాయాసభరితుఁ
డైన విజయునకు హాయిని గొల్పున దైనది. ఈమారుతాస్ఫా
లనానంతరమునం దాతని కింద్రు డభినందనము జరిగినది.
ఆరథమువిూఁదఁ బయనించుచు నమరావతికిఁ బ్రవేశించు
నరికి నర్జునుఁడు దివ్యాంగనాపాంగభంగీసమాలంగితసౌభా
గ్యుఁడై మహేంద్రునర్ధాసనంబునం దధ్యాసీనుఁ డైనాఁడు.
మనుచరిత్రమునందువలె నీమారుతము 'మగువపొలుపు దెలు
పునది' కాలేదు కాని, ఆతనిసౌందర్యమునకు దివ్యాంగనా
పాంగభంగీసమాలింగనప్రాప్తిసూచక మైన దనవచ్చును.
మఱియు నూర్వశివలెనే భగ్నప్రణయయైన వరూధిని కంటఁ
బడనైయున్నప్పుడు, తత్సూచకమైన మారుత మొలయుట
కిది దారిచూపిన దనవచ్చును.

పిమ్మట దేవేంద్రుఁ డావిజయునకు మందారవిపిన
వీథిలో దివ్యసౌధము నొకటి విడిదిపట్టుగా నిచ్చి, యం
దాతనిఁ బ్రతిష్ఠించి, జయంతకుమారునికంటె నెక్కుడుగ
గారవించెను. ఆభవనమునందు వాసవనందనుఁడు విమల

సుధాంశుకాంతమణివేదికపై హంసతూలతల్పమున నేత్ర
పద్మములు మొగిడ్చి, సుఖసుప్తి నొందియుండ, నాతని నభి
సరింపవచ్చిన యూర్వశి కాతనిలో శేషతల్పమునఁ బవళిం
చిన యంబుజాక్షునిభావము గోచరించినదఁట. ఆనిశాసమ
యమున విజయు నభిసరింప వచ్చిన దప్సరఃకాంత. ఆమె
పదునాల్గుజాతుల దేవతాంగనలలోఁ బేరుపెంపు వహించిన
నీరజాక్షి. నీరజనాభుని యూరుకాండమున జనించిన అయో
నిజ. జలనిధి నాపోశనముగాఁ గొన్న యగస్త్యునకుఁ గన్న
తల్లి. స్వర్గమునందేగాక భూలోకమునందును పురూరవ
శ్చక్రవర్తికిఁ బ్రాణవల్లభ యయినపద్మనయన. ఇట్టి విశిష్టత
గల యూర్వశి,

గీ. కట్టి తొడి పూసి కైసేసి కౌతుకమునఁ
గొసలిగా నీలిపట్టంబు ముసుఁగుపెట్టి
గాజు లెగఁద్రోసి చప్పుడు గాకయుండ
వచ్చె నూర్వశి యర్జునావాసమునకు. హర. 7-121.

ఈనీలాభిసారికావేషము శ్రీనాథునినాఁటిదియే. గాజు
లెగఁద్రోసి చప్పుడుగాకయుండ వచ్చె ననుటలో నభిసారికా
భావమున కభివ్యక్తి సరసమై వెలసినది. ఇప్పు డూర్వశి
సుఖసుప్తిపరిపాకము నందియున్న యర్జునుని మేలుకొలుప
వలయును. ఆమె కాతనిసౌభాగ్యము శేషతల్పమున శయ
నించియున్న యంబుజాక్షుని దలఁపింపఁజేసినది. అప్సరోజాతి
వనిత యగుటచే నూర్వశియు క్షీరసాగరసముద్భూతగా

లెక్కింపఁదగినదియే గావున, నీమె చేసైతము శేషశాయికి క్షీరసాగరకన్యచేఁ జేయించిన యుపచారమునే చేయించి నాఁడు. శ్రీమహావిష్ణువు శేషతల్పమునుండి మేల్కనునపుడు లక్ష్మి పద్మనాభుని శ్రీపాదపల్లవము లొత్తినది. ఇచట నూర్వశియు నటులనే కావించినది.

గీ. మేల్కొలిపె నిందుబింబాస్య మెల్ల మెల్లఁ
బ్రమసనిద్రాపరాధీనుఁ బాండుతనయుఁ
బగడములఁబోలు తనపాణిపల్లవముల
నతని మృదుపాదపంకేరుహంబు లొత్తి. హర. 7-211.

అర్జునున కానాఁటిసంఘటన లన్నియుఁ బ్రమోదావహములు. పార్వతీపరమేశ్వరసాక్షాత్కారము, పాశుపతాస్త్రప్రాప్తి, స్వర్లోకదర్శనము, దేవేంద్రునియాలింగనాదరము, తదర్ధాసనోపవేశము, మందారతరుమధ్య సౌధనివాసము నను నివన్నియు జతఁగూడి సుఖపారవశ్యయుతముగ నిద్రాపరాధీనుని గావించిన వావీరుని. అట్టివానిని మేల్కొలుపుట కూర్వశి యొక్క సుకుమారప్రయోగము గావించినది. అతని పాదపద్మములను పవడములవలె నెఱ్ఱనై పల్లవములవలె సుకుమారములైన తనపాణితలముతో మెల్లమెల్ల నొత్తినది. అట్టి సుకుమారపాదసంవాహనప్రయోగ మాతని సుఖనిద్రనుండి మేల్కొలిపినది.

అట్లు మేల్కాంచిన యర్జునుఁ డేపాటియుఁ దత్తరపాటు నందలేదు. నిద్రాపారవశ్యము గలుగుటకును

డాతఁడు ఘోరతప మాచరించియుండినవాఁడగుటచే నాతని మనోలక్ష్య మింకను బాశుపతాస్త్రప్రదాతయైన పార్వతీపతిపై నిబిడీకృతమైయున్నది. స్వర్లోకప్రయాణమున కింద్రుఁడంపినరథము నధిష్ఠింప నున్నప్పుడుకూడ నాతఁ డుమాపతి పూజగావించియున్నాఁడు. ఘోరయుద్ధమునఁ దనపరాక్రమ విశేషమును గాన్పింపఁజేసి, పార్వతీపతిని మెప్పించి పాశుపతాస్త్రముఁ బడసినమహావీరుఁడు. అట్టివిజయున కచ్చర లేమ నిద్రనుండి లేపినంతమాత్రమునఁ దత్తరపాటు గల్గునా? లేక మనమున బిగువు సడలునా? అర్జునుఁడు లేచి కనుఁగొనఁగా నెదుట నిలిచియున్నది నిర్జరలోకలలామంబైన భామిని. సుధర్మాస్థానిలో నామె నింతకుమున్నే చూచియుండుటచే 'ఊర్వశి' యని గుర్తించి, పాన్పు డిగ్గి యామె కభివాదనము చేసినాఁ డర్జునుఁడు. ఇది యూర్వశిప్రణయమునకుఁ బ్రథమాఘాతము.

అర్జునుఁ డిప్పట్టున నూర్వశి నెట్టయిన దూరము సేయక తప్పదు. అంతకుమున్నే సంక్రందనుఁడు విజయుడైన తనకుమారుని విజయము నభినందించుచు "నీవు నారాయణ సఖుండవైన యాదిమునీశ్వరుండవు. నరనారాయ ణులవలనఁ ద్రివిష్టపంబునకుఁ బెక్కు శ్రేయంబులు రాక్షసబాధలు శాంతింబొందె; నిప్పుడు హిరణ్యపురనివాసులయిన నివాతకవచకాలకేయాదులగు దైతేయులఁ బరిమార్పవలయు" నని తనపై మఱియొక విజయభారము మోపియున్నాఁడు. కావున

నిది ప్రణయవిషయమునుగూర్చి పర్యాలోచనము సేయు నదను గాదు. మఱియు వానినిబట్టిచూచిన నాయచ్చరలేమ తోడిచెలికార మాసమయమునందే కాదు గదా, మఱియె న్నఁడునుగూడ నంగీకరింపరానిది. కావున విజయుఁ డూర్వశి ప్రణయమున కెడ మీాయకుండుటకై, పాన్పు డిగ్గి, భక్తితో నామె కభివాదనంబు సేసినాఁడు. అంతటితో నూరకొనక వినయవినమితో త్తమాంగుఁడై

'గీ. ఈనడికిరేయి నొంటిమై నింతదూర
మేమి కార్యంబు మెఱఁ గోరి యేఁగు దెంచి?
తేను రమ్మన్న రానె? పూర్ణేందువదన!
చెప్పు; మీాపాన్పుమీాఁద విచ్చేసియుండు.'

మనినాఁడు. ఈపలుకులలోఁ బాండుతనయుఁ డామెపైఁ దనకుఁ గలభక్తిభావము తెల్లముచేసినాఁడు. ముందు జరుపఁ బోవు ప్రసంగమున కీపలుకు లాముఖమైనవి. ఆమె తన్ను వలచివలపింపవచ్చిన దనుభావము ముందుగనే పొడకట్టుటచే నామెను వదలించుకొనుటకుఁ దగినప్రసంగము నుపక్రమించియున్నాఁ డర్జునుఁడు.

''ఓచేడియ! త్రేపటియుదయమునఁ జంద్రశేఖరు నుపాస్తి యొనర్చి, యుపాయనముతో నిన్నుఁ జూడఁగ వచ్చువాఁడ ననుకొనుచుండ, 'అడఁబోయిన తీర్థ మెదురైఁ' నట్టులు నీవే వచ్చితివి. ప్రాగ్భవమున నే నెట్టిపుణ్యములు చేసినాఁడనో గదా! శీతాంశువంశో త్తంసంబు పురూరవుండు

మాముత్తాతగారు. ఆభూతలపతికి నీవిల్లాలవగుట నాకు నీవు ముత్తవతల్లివి. అందుచేఁ గూర్మిమనుమనిపైఁ బ్రేమ వాటించుట తెప్పయే. ఓయంబుజాక్షీ ! భువనప్రసిద్ధంబైన యాదినారాయణుని యూరువు నీపుట్టినిల్లు. అట్టి పరమపవిత్రురాలవయిన నీపాదపద్మములకుత్తమభక్తివైభవముతో వందనము చేయుటచే నేను బరమపావనుండ నైతి" యనెను. ఈప్రసంగమామెప్రణలిప్సకు ద్వితీయాఘాతము.

ఈవిధముగ 'నూర్వశి తనకు వందనీయ' యనుభావమును బెక్కురీతుల వ్యక్తముచేసి, నిర్వికారుఁడై నిలిచియున్న పాండుకుమారుఁ డామెకు హితమునే బోధించెను. కానియూర్వశి కాపలుకు లప్రియములే యైనవి.

ఊర్వశి కర్జునప్రసంగమువలనఁ దనకోరిక యీడేరదనునిశ్చయము కలిగినది. అయినను మన్మథవికారమును మాన్పుకొనలేక, ధనంజయునియుక్తికిఁ బ్రతియుక్తిగ మాటాడఁ దొడగినది. 'అర్జునా ! యెన్నియో తరములు గడచిపోయిన పెద్దవావులు శోధించి బయటఁబెట్టెదవు.' వారకాంతలకు వావివరుస లుండునా ? మొగమాటలేని యీమాట లింక మానుము. కరుణాకర ! పాండునందనా ! యని జాలిగొలుపునటు లాతని సంబోధించి, "నీవు దేవేంద్రుని నిండుకొలువులో నాతనియర్ధాసన మెక్కియున్నప్పుడు, నా కంగజసన్నిభుఁడవై గానవచ్చితివి. అట్టి నిన్నుఁ గాంచి మన్మథునిపువ్వుబాణములకు గుఱియైతిని. ఇట్టి నన్ను

నిరాకరించుట నీకుఁ దగునా ?' యని ప్రార్థించినది. నీవు వచ్చి నప్పుడు ద్రౌపది కన్యకాంతలదెరకుఁ బోవ నని సత్యవా క్ప్రతిజ్ఞఁ జేసితివా ? భామలకుఁ జేసిన ప్రతిజ్ఞాసత్యము సత్యము కాదు లే. నా మోహము నాతగులము నా ప్రేమము నా ప్రీతి నా వేడుక నామానము నా సాహసము వమ్ముచేసిన నే నూరకపోవుదునా ?'' యని గద్దించి మాటాడినది. రణ భూమిని బడిన ధైర్యశౌర్యసంపన్నులైన వీరు లెవ్వరైన నైదుపదిసేయక నాకై వత్తురు. నీ వితరులవలెఁ గైకొనక యోఁచెదవు. ఏమి నీ నైరస్యము ! కావున వెట్టివేసాలకుఁ బోక పూసెజ్జకు రమ్ము. ప్రొద్దుపోయినది. ఈపులియుట చాలును. అని తన ప్రాభవవైభవములు బయటఁబడునట్టులు మాటాడినది.

అంతటితోఁ బోక 'నీ వంతటి బ్రహ్మచర్యవ్రతపరా యణుండవే?' యని లేమొలకనవ్వు లపాంగంబునఁ దొంగ లింపఁ గంకణఝణఝణత్కారంబు తోరంబుగా, కెంగేలి కేళీకమలంబునఁ బురందరనందను వ్రేసినది. ఆ వ్రేటులో నామెకుఁ గల తత్తరపాటు ఆత్మాభిమానమును దెల్లమయి నవి. ఇది యామె చేయఁగలిగిన ప్రణయప్రయోగములలోఁ జరమము. ఇట్టి లీలారవిందప్రహారము జరిగినపుడే కైలాస వాసి ఫాలలోచనుఁడు తన ప్రేయసిని పర్వతరాజతనయను చక్కదిద్దవలసివచ్చినది. ఈ ప్రయోగ మంతటిది గావుననే శ్రీనాథుఁడు దీనిని 'చిత్తభవసమ్మోహనాస్త్రవిదారణం'బని చిత్రించియున్నాఁడు.

అత్యంతధీరోదాత్తుఁడు గావునఁ గిరీటి యూ ర్వశిపట్టున కంతరంగంబున మిసిమింతుఁడునుగాక, మోహాకంబునకు రాక నిర్వికారుఁడై నిలిచియుండెను. ఆనిర్వికారతయే యాతని ధీరోదాత్తతకు నిదానమైనది. ఊర్వశి కిట్టిపరాభవ మీావఱ కెన్నఁడును జరిగియుండలేదు. ఎన్నివిధములఁ బెనఁగులాడి నను గిరీటి చిక్కనిమనమునఁ బక్కఁ గానరాలేదు. తన కన్నులవలపు కానఁ గాచిన వెన్నెలవలెఁ బోలివోయినది. ప్రణయాఘాతము వాటిల్లె ననుకోపము సైరింపలేక నిట్టూర్పులు నిగుడించుచు నర్జును నుద్దేశించి 'నపుంసకునివలె నాననగొన్నాఁడ; వేడుకాలంబు నపుసంకుఁడవు కమ్ము' అని శపించి దిగ్గన మొగంబు గంటు పెట్టుకొని యూర్వశి యింటికిఁ బోయినది.

కాని కిరీటి యీయరిష్టమునకు సంతాపము నందలేదు. ఆతఁడు యుధిష్ఠిరానుజుఁడు. కావున నాతనిచూపు యుద్ధములందు విజయము సాధించుటయందే స్థిరపడియుండును. అట్టివిజయమునకుఁ బ్రతిబంధకమయిన ప్రణయమున కాతఁ డేల వశంవదుఁ డగును? ఈయరిష్టముగూడ వసిష్ఠజననివలన వచ్చినది. కావున నిది శుభావహమే కావచ్చునని యర్జునుఁడు భావించినాఁడు. దానిని శ్రీనాథుఁడు హారవిలాసములో విధివిలాస మని తలపింపఁ జేసినాఁడు. ఇంతలో విబుధలోకమునందలి వేఁగుఁబోకలో శక్రుగడియారమున శంఖారావము వినవచ్చినదఁట. దాని నెట్లు వినిపించినాఁడో వినుఁడు.

సీ. పారిజాతకలతాపల్లవంబులు మేసి
కొసరె నుద్యానపుంస్కోకిలములు
గంధర్వగ్రైవేయ కనకఘంటికల్ మ్రోయ
వేల్పుటేనిక యుషస్సిద్ధికి వెడలె
మందాకినీవీచి మారుతం బల్లార్చె
నప్సరస్త్రీల నీలాలకముల
సప్తర్షి పావనాశ్రమవనాంతరమున
నామ్నాయఘోష మభ్యధికమయ్యెఁ
బాలవత్సంబుపైఁ గూర్మి పంచతిలుచుఁ
గామగవి సేఁపువచ్చి హుంకార మిచ్చె
శక్రుగడియారమున మించె శంఖరవము
విబుధలోకంబునందలి వేఁగుఁబోక.

ఇది స్వర్లోకమునందలి యుషఃకాలము. కావున నచట వినవచ్చిన మధురారావములు విలక్షణములయినవి. ఈవర్ణన మతిసుకుమారముగను సమయోచితముగను సాగినది. ఇట్టి యీ వేఁగుఁబోకలో నమరావతిలోని యచ్చరలను మేలుకొనఁజేసిన తీరుకూడ మిక్కిలి సుకుమారముగ నడచినది. కనుఁడు.

సీ. మాటుగా నైచిన మాంజిష్ఠతెఱ యొత్తి
పంజుపంచము డిగ్గె మంజుఘోష
మొకరిపస్త్రైల ప్రోఁత ముద్దుచూపఁగ రంభ
కనకంపుఁగొడుగుపాగాలు దొడిగె
నొకట వేనలి ముడిచి యొక్కకేల ఘృతాచి
గాజుటెక్కులతల్పు గడియపుచ్చె
నలసభావముతోడ నలవోక ప్రమ్లోచ
నిల్వుటద్దంబులో నీడచూచె

హారిణి గీలించె నలినపట్టాంశుకంబు
మేనక ధరించెఁ బాలిండ్లమీఁద అవిక
యప్సరస్త్రీనికేత నాభ్యంతరములఁ
గొక్కెరో కో యనుచుఁ గోళ్లు కూయుటయును.

ఈవర్ణనము స్వర్లోకమునకుఁ జెందిన దయినను భూలోకస్పర్శమునుమాత్రము వీడలే దనవచ్చును. కాని భావనాసమున్మిషితమైన వస్తుసంచయ మతిసుకుమారము సమయోచితము నత్యుదాత్తమునై యొప్పినది. ఇట్టిఘట్ట మంతయు నౌచితి కిసుమంతయు భంగపాటు లేకుండ నడచి నది. శృంగారరసభావసంయోజనమున సంయమ మింతింతన రానిది జతఁగూడినది. అభిసారికగా నేకాంతమునకు వచ్చిన యూర్వశి నేపాటియుఁ దత్తరపాటు లేకుండఁ జిత్రింపఁగలిగిన శ్రీనాథునిభావసంయమనవిధాన మనిర్వాచ్యము. ఈఘట్టము వరూథినీప్రవరసమాగమఘట్టమునకుఁ గడుసన్నిహితమైనది. కాని దీనిలో శృంగారభావము లొడిదొడుకు లేకుండ సాగిం చుటలో శ్రీనాథుని రచనాశిల్ప మప్రతిమమై యొసలారినది. శ్రీనాథుని శృంగారిఁగా భావించుకొనువా రీఘట్టమునందలి భావసంయమమును దిలకించి యాకవిపై నెట్టిభావము వహింపవలయునో నిర్ణయించుకొందురుగాత మని ప్రార్థన.

శృంగారభావపరిష్కారము

కవులు తమరచనలను రసికజనుల కాస్వాదయోగ్య ములు గావించుటకు వివిధరసభావములను దమతమప్రతిభా వ్యుత్పత్తులనుబట్టి వెలయించుచుండుదురు. తమతమ చిత్త

సంస్కారములనుబట్టి భావుకులయిన జనులు వానిని భావించి యానందము నందుచుండెదరు. విద్యాసంస్కార మంతగ లేకున్నను ప్రాణిసామాన్యమున కనుభవయోగ్యమైన భావము ప్రణయము. ఇది పరమేశ్వరాశ్రయ మైనచో భక్తి యనియు, మాతృపుత్రాశ్రయ మైనచో వత్సలత యనియు, ప్రేయసీప్రియాలంబన మైనచో శృంగార మనియు వ్యవహరింపఁబడుచున్నది. అఖండానందానుసంధాయి యగుస్త్రీప్రణయమును గావ్యమునం దనుసంధానించుటకుఁ గవికిని, దాని ననుభవయోగ్య మొనర్చుకొనుటకు రసికునకును సముచిత చిత్తసంస్కార మావశ్యకము. అట్టిసత్త్వము కొందఱకే సమకూడియుండును. వీరశాంతాదిరసభావములు కొందఱకే సముల్లాసమును గలిగించును. హాస్యరౌద్రాదితదితరరసభావములు పాఠకుల కందఱకు నాస్వాదయోగ్యములు గావు. వానివానినిఁ గావ్యములం దనుసంధానించుయత్నముకూడఁ గవులలోఁ గొందఱకే జతపడును.

శృంగారరసభావములు, తత్సముత్తేజకమైన స్త్రీపురుష సౌందర్యవర్ణనము, చతురసంభాషణక్రమము, తదుద్దీపక ప్రకృతివికాససముత్కర్షము కవిదృష్టిని రసికజనహృదయమును వెంటనే యాకర్షించును. కాని దానికి సరిపడువస్తువిన్యాసము గావించుట కవికి మిక్కిలి కఠినమైన పని. తదనుసంధానయోగ్య మయినచిత్తసంస్కారము లేనిపాఠకునకు సైతము తద్భావన యట్టిదియే. ప్రణయము (ప్రేమ) తెలి

సినదో తెలియకయో, కొలఁదిగనో గొప్పగనో మానవ మాత్రహృదయమునందుఁ దత్తద్వయోవస్థానురూపంబుగ మొలకెత్తుచుండును. అందు రసికులయిన ప్రేయసీప్రియుల ప్రణయభావములు తదుత్తేజకసామగ్రియు నుత్తమకావ్యోప నిబద్ధములై యాస్వాదయోగ్యములై వెలువడినపు డవి యాశ్రమవయోవిభాగనిరపేక్షముగ నందఱకు సముల్లాస మును గలిగించును. అట్టి శృంగారరసభావముల నౌచిత్య భంగ మిసుమంతయు లేకుండ రాగులకు యోగులకుఁగూడ నాస్వాదయోగ్యములు గావించినవాఁడు సంస్కృతభాషలోఁ గాళిదాసమహాకవివరేణ్యుఁడు. సీతారాముల ప్రణయము నత్యుదాత్తముగఁ జిత్రించి పెట్టిన భవభూతియు నట్టివాఁడే.

కాళిదాసవిరచితమయిన కావ్యములలోఁ గొన్నిట ప్రధానరసము శృంగారమే యయినను, తదుద్దీపకసామగ్రి మానవసామాన్యమునకు హృదయాహ్లాదకారిగఁ గానవచ్చి నను, కవితారహస్యవేత్తల కది కాళిదాసహృదయోద్భాసిత పార్వతీపరమేశ్వరభక్తిభావము నవభాసింపఁజేయు సామగ్రి గనే గోచరించును. అతఁడు తనకుమారసంభవకావ్యమున పార్వతీపరమేశ్వరాలంబనమైన శృంగారరసభావములను సమ గ్రముగ వర్ణించి, తద్భావావిష్కరణమును దనకుఁ గలభక్తి భావావిష్కరణపర్యవసాయిగ నొనర్చియున్నాఁడు. సంస్కృ తవాఙ్మయమునఁ గాళిదాసుని దృష్టికోణ మెట్టిదో యాంధ్ర మున శ్రీనాథుని యాశయము నట్టిదియే. సంస్కృతవాఙ్మ

యము నందలి సరసమై కానవచ్చిన సామగ్రి నంతయుఁ దన రచనలలో ననుసంధానించుచుఁ బరమేశ్వరాలంబనవివిధరస భావములను ఆవిష్కరించిన శ్రీనాథుని రచనయు నాంధ్ర భాషలో భక్తిభావపర్యవసాయియై యొపలారిన యొక మహాస్రవంతి.

శ్రీనాథుని రచనలో శృంగారరసభావము ఓతప్రోత ములై యుండు ననునది జనసామాన్యవ్యాప్తమైన యొక కింవదంతి. ఆంధ్రలోకమునఁ బలువుర రసనారంగముల నర్త నము సేయుచున్న యాతనిచాటువులనుబట్టి యాతఁడు శృంగా రపురుషుఁ డని జనశ్రుతి. ఈ రెండిటిని జోడించి పాఠకలోకము వెనుకటికాలమున శృంగారరసవారాసియైన యాతనినైషధ కావ్యమును శ్రద్ధతోఁ జదివి యుత్తమసాహిత్యసంపత్సమ న్వితు లగుచు వచ్చిరి. ఆకావ్యమునందుసైత మాతఁ డదను చూచుకొని తనకుఁ గల యీశ్వరార్చనకళాశీలత్వమును వ్యక్తము చేసి యుండుటచే తత్పఠనమునఁ బాఠకులు సద్భావ సమన్వితులై పుణ్యశ్లోకచరితానుసంధానమున సుకృతసమ న్వితు లగుచువచ్చిరి. శృంగారమునందుసైతము భక్తిభావా నుప్రవేశము చేయఁజాలు ప్రతిభ పరమశివభక్తుఁడైన శ్రీనా థున కమరియున్నట్టులు మఱి యేయితరకవియందును జూపట్ట దనుట నిర్వివాదమైన సత్యము. ఆవిషయమును మఱి యొకప్పుడు వివరించెదను.

కవియైనవాఁడు దా నేయితివృత్తమును దీసికొనినను దానిలోఁ దనకాలమునాఁటి ప్రజల యభిరుచులను, వారి

చిత్తవృత్తులను, ఆకాలమునందుఁ గానవచ్చెడి వేషభూషా దికమును వ్యంగ్యముగ నైన ప్రతిఫలింపఁజేయక మానఁడు. కవి వివరింపఁబూనిన కథావస్తువును బట్టి గైకొనినపాత్ర లతీతయుగములకుఁ జెందిన వైనను, వానిని బరిష్కరించునపుడు తనకు సమకాలమునందుఁ జూపట్టెడు తత్సమానవ్యక్తుల మనోభావములను మాత్రమే నిరూపింపఁ గలుగును. మానవబుద్ధి కందనివిషయములను వదలివేసిన, నందెడి వన్నియు కవికాలమునాఁటివియే యగును. అతీతవిషయములనుగూడఁ దమయోగబలముచేఁ బ్రత్యక్షము చేసికొని కవిత సాగించిన వాల్మీకివ్యాసుల రచనలందుఁదక్క, తక్కిన కవులందఱు వారివారి రచనలలో సమకాలికములైన విషయములే స్ఫురింపఁజేయఁ గల్గెద రని యాలంకారికులు వాకొనియున్నారు. సహృదయుల యనుభవముకూడ నట్టిదియే. ఈదృష్టితో మనము శ్రీనాథునిరచనల నన్నిటిని సమగ్రముగఁ బరికించి నచో నాతనికాలమునాఁటి వ్యక్తులచిత్తవృత్తులలోఁ గల భక్తి శృంగారభావములతోపాటు నాఁటివారి వేషభాషాభూషణ భంగియు, ఆనాఁటిజనుల యభిరుచులు వానితోపాటు శ్రీనాథుని మనోగతములైన భావములును దెల్ల మగుచునేయున్నవి.

ప్రణయ మతిలలితమైన భావము. దాని నాస్వాదింప వలయు ననిన లలితమధురభావసంయోజనసమర్థమైన చిత్తవృత్తియు నత్యావశ్యకము. ఉద్రేకము ఉద్వేగము గల చిత్తముల కది ఆస్వాదయోగ్య మెన్నఁడును గానేరదు. కవి

హృదయము ద్రవీభావయోగ్యమైననాఁడే ప్రణయసంబంధి భావముల నాతఁడు మృదుమధురగతిని వెలార్పఁగలఁడు. రసికుఁ డగుభావుకుఁడుగూడ తదనుసంధానయోగ్యమైన యంతఃకరణప్రవృత్తి గలవాఁ డైననాఁడే ఆయాభావముల నాస్వాదించి యానందింపఁగలఁడు. అందును పరమేశ్వరాలంబనప్రణయరూపమయిన భక్తిని భావించుటకు, తద్భావనాజనితానందము ననుభవించుటకు, తదావిష్కరణమునకు నర్హ మగు చిత్తసంస్కార మెంతేనిఁ గావలయును. కావుననే కాళిదాసాదిమహాకవుల కవిత సామాన్యచిత్తసంస్కారము గలవ్యక్తులకుఁ దలస్పర్శిగ నాస్వాదయోగ్యము కాదనియే చెప్పవచ్చును.

[ఏవస్తువునందలి సౌందర్యమునయినను గవి తనసూక్ష్మదృష్టితోఁ బరికించి, నిదానముగ భావించి కావ్యముఖమున వెలార్చునపు డది, సామాన్యవస్తువే యయినను విశిష్టవస్తువుగఁ గోచరించును.] కవికంటఁ బడిన నీరసవస్తువుకూడఁ దద్భావనాబలమున రసబంధురమే యగును. కవి యావస్తువును లోకమునెదుటఁ బెట్టునపుడు మఱింత మనోహరముగఁ గానవచ్చును. శ్రీనాథుఁడు తనకృతులలోఁ బ్రసక్తివచ్చినప్పుడెల్ల విడువకుండ ప్రకృతిసౌందర్యమును స్త్రీపురుషసౌకుమార్యమును తత్తద్వయోవస్థానురూపముగ వెలార్చుచు వచ్చినాఁడు. అందును సుకుమారప్రకృతులయిన వనితల సౌందర్యపరిష్కారమున ప్రత్యేకావధానమును బ్రద

ర్శించుచు వచ్చి తనప్రతిభ నద్వితీయముగ వ్యక్తముచేసి యున్నాఁడు. ప్రణయభావములను ప్రేయసీప్రియాశ్రయముగ విశేషముగ వర్ణింపవలసివచ్చిన ఘట్టములతోఁగూడినది, యాతనిరచనలలో ప్రథమమైనది, ఆంధ్రనైషధకావ్యము. దీనికి మూలమయిన శ్రీహర్షనైషధమనంటే యాకావ్యము నకుఁగల విశిష్టతనుగూర్చి ప్రస్తావించుచుఁ బదునొకొండవ సర్గతుది నాకవి యిట్లు వ్రాసియున్నాఁడు.

శ్లో. శృంగారామృతశీతగావయమగా దేకాదశ స్తన్మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గో నిసర్గోజ్జ్వలః.

సం. నైష. 11 సర్గ.

దీనినిబట్టి శ్రీహర్షనైషధకావ్యము శృంగారరసవారాసిని వెల్లువుకఁజేయు చంద్రస్వరూప మని తెలియవచ్చుచునే యున్నది. తన్మూలముగ నీకావ్యమున శృంగారరసభావము లతిమాత్రములు నగాధములు నని స్ఫురించుచునేయున్నది. శ్రీనాథుఁడు తా నాంధ్రీకరించిన యీనైషధకావ్యముతుదిని "భట్టహర్షమహాకవీశ్వరుఁ డొనర్చిన నైషధశృంగారకావ్య ప్రబంధవిశేషమున నశేషమనీషిహృదయంగమంబుగా శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుర్తించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారంబునఁ జెప్పఁబడిన యీభాషా నైషధకావ్యంబు" అని వ్రాసియున్నాఁడు. ఈవాక్యము

లను బట్టియు శ్రీహర్ష నైషధము శృంగారరసప్రధానమైన కావ్య మని తెలియవచ్చుచునే యున్నది. శ్రీనాథుఁ డీనైషధానువాదసరణిలోఁ దాను బాటించితి నని తెలిపినవిషయముల నన్నిటిని సమగ్రముగఁ బాటించియేయున్నాఁడు. ఆవిషయమును మఱియొకప్పుడు తెలిపెదను. ఇఁక నీకావ్యమున నాతఁ డౌచిత్యమును బాటించి శృంగారరసానుబంధులయిన భావముల నెంత విరివిగఁ బాటించిన నది యీకావ్యమున కంత శృంగారము నొదవించునేకాని, దోషము నాపాదింపనేరదు. అందును మాతృకానుసారంబుగఁ జెప్పెద నని తెలిపిన యాతనివచనము శృంగారభావపరిష్కారమునం దెంతవఱకు సత్యమో కొంచెము పరికింతము.

శ్రీనాథుఁడు శ్రీహర్షనైషధమున కనువాదము సేయు సరణిలోఁ గొన్నిభావములను ద్రుంచియు, గొన్నిటిని బెంచియు రచన సాగించియున్నాఁడు. మూలముతో సరిపోల్చి చూచిన నావిషయము కొంత తేటతెల్ల మగును. నలుఁడు దేవేంద్రాదు లొసఁగిన శాంబరీవిద్యాప్రభావమున దమయంతియంతఃపురమునకుఁ బోయినపు డంతఃపురాంగనలలోఁ గానవచ్చిన శృంగారభావములను మూలమునఁ జమత్కారముగ వర్ణించియున్నాఁడు. వాని నీయనువాదమునం దెట్లు వివరించియుండెనో కనుఁగొందము.

శ్లో. అంతఃపురాంత స్స విలోక్య బాలాం
కాంచి త్స్మరాన్ధా మసంవృతోరుమ్

నిమీలితాక్షః పరయా భ్రమంత్యా
సంఘట్ట మాసాద్య చమచ్చకార. సం. నైష. 6-13.

దమయంతి యంతఃపురమునం దొక బాలిక నలుగు పెట్టుకొనుటకై యనాచ్ఛాదితమైన యూరువులు గలదియై యుండుట చూచి, నలుఁడు కన్నులు మూసికొనెను. ఇంతలో హేలగఁ దిరిగెడి మఱియొక బాలిక వచ్చి యాతని రాపాడఁగా నది చమత్కారము గలిగించెను. ఈశ్లోకమునందలి 'అసంవృతోరుమ్' అను విశేషణము వ్యంగ్యభంగిచే రాజు కనులుమూసికొనుటకుఁ గలకారణము నెఱిఁగించినది. ఆ భావమును శ్రీనాథుఁడు మఱింత నిగూఢము సేయుచు మఱికొంత చమత్కరింపఁజేసినాఁడు.

చ. ప్రిదిలిన నీవిఁ గేల సవరించుతలోదరి నోర్తుఁ గాంచి లోఁ
గదిరిన పాపభీతిబడిఁ గన్నులు మోడ్చు నొక శ్లోకశ్లక్ష్ణకై
యెదురుగ వచ్చి వచ్చి యొకయిద్దరు ముద్దియ లొత్తి రవ్విభున్
మదగజరాజకుంభముల మచ్చరికించు కుచద్వయంబునన్.
నైష. 3-86.

నలమహారాజు కన్నులు మూసికొనుటకుఁ గారణము నగ్నయైన స్త్రీని జూచుట పాప మనియెడి భావము. అట్టి నగ్నత్వ మేర్పడుటకుఁ గారణము సంస్కృతమూలమునం దొకబాల యుద్వర్తనమునకై యనాచ్ఛాదితోరువై గాన వచ్చుట. ఇచట సడలిపోయిన నీవిని (పోఁకముడిని) జూచుట. వ్యంగ్యవిషయము రెండిటను సమానమే. కన్నులు మూసికొనిన వెనుక నేర్పడిన స్త్రీసంఘర్షమును మాత్రము శ్రీనా

థుఁడు కొంచెము పెంచినాఁడు. అది యిద్దరు ముగ్ధలైన వనిత లొకరి కొక రెదురెదురుగా వచ్చుచు, నడుమ నుండిన నలు నేనుఁగుకుంభములవంటి కుచములతో నొత్తుట యను పది. ఈభావ మీశ్లోకమునఁగాక మఱి యొకశ్లోకమునం దుండఁగ, దానిని జమత్కృతివిశేషమునకై యిట జతఁ గూర్చినాఁడు.

శ్రీనాథుఁడు శృంగారముగ స్త్రీవర్ణనము గావింప వలసివచ్చినపుడు కుచతటమునం దేదియో యొకవిశేషమును గాన్పింపఁజేయకమానఁడు. ఈక్రిందిపద్యములలోఁ గాన్పింపఁజేసిన చమత్కారములఁ బరికింతము.

ఉ. పోరణగండిమార్గమునఁ జొచ్చిన సన్నని గాలి యొక్క-యం
భోరుహపత్త్రనేత్ర మనుఁబొంకపుఁజన్నులమీఁది సన్నపుం
జీరచెఱంగు వాయఁగిలఁ జేసిన విశ్వధరాతలేశ్వరుం
డోర యొనర్చెఁ జూపథము మంది నిజాననచంద్రబింబమున్.

నైష 3-89.

ఈపద్యమునకు మూలమైన శ్లోక మిది—

శ్లో. పశ్య న్స తస్మి న్మరుతాపి తన్వ్యాః
స్తనౌ పరిస్పృష్టమి వాత్త వస్త్రౌ,
అక్షాంతపక్షాంతమృగాంక మాస్యం
దధార తిర్యగ్వలితం విలక్షః. సం. నైష. 6-18.

వాయువుకూడ నాయంతఃపురాంగనల స్తనములు యచటివస్త్రమును దొలఁగింపఁగాఁ జూచి, నలు సిగ్గుపడి, చంద్రబింబమువంటి తనముఖము నోరఁ

జేసికొనె నని యీశ్లోకభావము. వాయువునకుఁగూడఁ దాఁక
ముచ్చటగొల్పునవి యీయుదితస్తనము లనుట వ్యక్తమగు
చున్నది. కాముకులు రహస్యక్రీడకుఁ గడఁగునపుడు
చంద్రుఁడు మాటువడియుండుట యుక్త మనువిషయ మిచట
ధ్వనించుచున్నది. ఈభావమును శ్రీనాథుఁడు తనయనువాద
మున మఱింత సరసము గావించినాఁ డని చెప్పవచ్చును.
వాయు వనువిటుఁడు రహస్యముగ గవాక్షమార్గమున నంతః
పురములోనికిఁ జొచ్చి, యొక పద్మనేత్రకుచములమీఁది
సన్నని పైటచెఱఁగు తొలఁగింపఁగా, భూతలేశ్వరుఁడగు
నలుఁ డది గాంచి, పాపభయమునఁ దనముఖము నోరఁ జేసి
కొనెను. ఇచట తోరణగండిమార్గమునఁ గన్యాంతఃపురమునఁ
బ్రవేశించిన దొక సన్నని గాలి. అది యొకయందగత్తె
పొంకపుఁజన్నులమీఁది చీరచెఱంగు పాయఁగిలఁ జేసినది.
అట్టియావిటుని రహస్యక్రీడ కంటఁ బడుటచే విశ్వపాలకుఁ
డగునలుఁడు పాపభీతిచేఁ దనముఖము నోరఁజేసికొనె నను
టలో భావము మఱికొంత మధురమై ముందునకు సాగినది.
ఈవిధమైన యనువాదసరణిలో మూలమునందుఁ గాన
వచ్చెడి ధార్మికవిషయనిరూపణమునకు భంగము మాత్ర
మేపాటియుఁ బొడకట్టుట లేదు.

అనౌచిత్యపరిహారమునకుఁగా మూలమునం దుండెడి
విషయములు గొన్ని వదలుటయుఁ గలదు. ఈక్రిందిశ్లోకము
నాంధ్రీకరించుటయే మానినాఁడు. కనుఁడు.

శ్లో. దోర్మూల మాలోక్య కచం యమత్యాః
తతః కుచౌ తాం వసనే యతన్త్యాః
నాభీ ముత్క్షిప్త శ్లథవాససోను
మిమీల దిక్షు క్రమకృష్టచక్షుః. సం. నైష. 6-20.

జుట్టుముడి వేసికొనునామె కక్షములను, మైపూఁత పూసికొనువనిత కుచములను, కట్టుబట్ట విడినయామె నాభిని జూచి, క్రమముగా దిక్కులన్నిటినుండి చూపు మరలించి, నలుఁడు కన్నులు మూసికొనె నని యిచటిభావము. పై మూఁడువిషయములు జుగుప్సాకరము లని భావించి కాఁబోలు శ్రీనాథుఁ డీశ్లోకము ననువదించుట మానినాఁడు. ఈప్రకరణమునందే మఱియొకచోఁ గొంత మార్పు చేసియున్నాఁడు.

చ. పరవడి నేఁగుచోట నొకయుగ్మలి యొల్లె చెఱంగు మేదినీ
శ్వరుని భుజావిభూషణము వజ్రములం దపులంగఁ బాఱినన్
విరిసెను నీవిబంధ మది విస్మయ మందఁగఁ దోడిభామినుల్
పరిహసనం బొనర్పఁ బతి పాపభయంబునఁ గంప మొందఁగన్.
నైష. 3-94.

శ్లో. సంఘట్టయంత్యా స్తర సాత్మభూషా
హీరాంకురప్రోతదుకూలహారీ
దిశా నితంబం పరిధాప్య తన్వ్యా
స్తత్పాపసంతాప మవాప భూపః. సం. నైష. 6-28.

ఒకతన్వి నలుని రాపాడఁగా, నాతని భూషణమునందలి వజ్రాంకురములం దావనితకట్టుబట్ట తగులొ్కనెను. తనమూలమున రాజామె కటితటమును దిగంబరముగఁ జేసి, యాపాపమునకు నలుఁడు సంతాపము నందెను. ఈశ్లోక

భావము ననువదించుటలో శ్రీనాథుఁడు కటితటమును దిగం
బరముగఁ జేయుట మానివైచి, యామె నీవీబంధము నెడ
లింపఁజేసి, యాతన్వి కీయాకస్మికసంఘనమువలన విస్మయ
మును, తోడిభామినులకు పరిహాసము సేయుట కవకాశ
మును, పాపభీతి చే నలునకుఁ గంపమును గలిగింపఁ జేసినాఁడు.
సిద్ధించిన ప్రయోజనము సమానమే యయినను శ్రీనా
థుఁడు గావించినమార్పులో వ్యంగ్యభంగి సుకుమారమై
యొసలారినది. ఇచట నీవీబంధము సడలుట వస్త్రములం
దొల్లెచేజాఱఁగు తగులుటమూలమునఁ దటస్థించెను గావున
రాజున కీవిషయమునఁ బ్రసక్తి లేదు. పాపభయమున
నాతఁడు కంపించుటమాత్ర మధికము.

నలుఁడు రాజమార్గమునఁబడి వివాహమండపమున
కేఁగునపుడు పౌరాంగనలు వెలార్చిన శృంగారచేష్టలను
మూలమునకంటెఁ గొంతయధికము చేసి వెలార్చియున్నాఁడు.
ఆపట్టులయం దాతనికిఁ గలభావాభినివిష్టమతి వ్యక్తమగు
చున్నది. తత్క్రమ మరయుదము.

మ. జిలుగుంబయ్యెద జీరువాఱి యెడలన్ శృంగారపత్త్రాంకురం
బులతో నొక్కచకోరలోచన కుచంబుల్ పూర్ణకల్యాణమం
గళకుంభంబులు నూత్నపల్లవవిభంగ శ్రీసమేతంబులై
నలబిం జెన్నెసలార నైషధమహీనాథావలోకంబునన్.

నైష. 6-67.

శ్లో. అజానతీ కాపి విలోచనోత్సుకా
సమీరధూతార్ధమపి స్తనాంశుకమ్,

కుచేన తస్మై చలతే ఽకరో త్త్వరః
పురాంగనా మంగళకుంభసంభృతిమ్. సం. నైష. 15-74.

ఒకపౌరాంగన నలుని జూచు వేడుకలో వాయువుచేఁ దనస్తనాంశుకము సగము తొలఁగింపఁబడినను గనుఁగొనక వరుఁడై వెడలు నలునకుఁ దనకుచ మనుకుంభమును మంగళ పూర్ణకుంభముగఁ గూర్చె నని శ్లోకభావము. ఇఁక శ్రీనాథుఁ డీభావమును బొడిగించి సమకూర్చి పెట్టిన విశేషమును బరికింతము.

ఒకచకోరలోచన నలమహారాజును జూడఁ బోయెడి తొందఱలో జిలుగుపైఁట జాఱిపోవఁగా, మకరికాదిపత్త్రాంకిత మైన యామెకుచములు నూత్నపల్లవములతోఁ గూడిన మంగళకలశములుగా నెసలారిన వఁట. మంగళకలశ మొక్కటియే గాకుండుటకు, వానిని నూత్నపల్లవసమేతములు గావించుటకు, వాయువుచే నొల్లెచెఱఁగు నర్ధభాగమును మాత్రమే తొలఁగింపఁజేయక పైఁటను గుచతటమునుండి ప్రక్కకు జీరువాఱఁజేసినాఁడు. అట్లు పైఁట తొలఁగుటకు నైషధమహీనాథావలోకమును గారణము గావించియున్నాఁడు. ఇది యొక మధురసన్నివేశము. దీనిలో మంగళకుంభసంభారము పవిత్రపత్త్రసమన్విత మగుట విశిష్టమయిన విషయము. ఔచిత్యమును బాటించి మూలమునకు వన్నె పెట్టిన దనుట కిది నిదర్శనము. అదియునుగాక శ్రీనాథుఁడు కుచతటము నెచట వర్ణించినను నం దేదియో యొకవిశేషమును

గా న్వింపఁజేయక మానఁడు. మూలములో లేనియంశములు కొన్నిటిని జతగూర్చుపట్టున "భూ, ధవదేవేంద్రునిఁ జూచె హేమకలశద్వైరాజ్యసంపత్తివైభవశుంభత్కుచకుంభపీఠిఁ బులకప్రారంభ మేపారఁగన్" అని యొకయువతికి, నలుని జూచువేడుకలో హేమకుంభములఁ బోలినకుచకుంభముల మీఁద పులకాంకురములు మొలిపింపఁజేసినాఁడు. దీనిలోఁ గూడ మంగళద్రవ్యకుంభసంభారము నూత్నాంకురసమన్వితమైనది.

ఇట్టులే సంస్కృతమూలమున, నలుని గుతుకముతోఁ జూచెడివనితల విలాససముపేతములయిన యంగములఁ గొన్నిటి నాతని వివాహయాత్రకుఁ గొనివచ్చిన మంగళద్రవ్యములుగాఁ జిత్రించియుండ, వానినే మఱికొంత విస్తరింపఁజేసి క్రంత సాగించినాఁడు. కనుఁడు.

శ్లో. లసన్నఖాదర్శ ముఖాంబుజ స్మిత
ప్రసూన వాణీమధు పాణిపల్లవమ్,
యియాసత స్తస్య నృపస్య జజ్ఞిరే
ప్రశస్తవస్తూని తదేవ యోషితామ్. సం. నైష. 15-76.

శ్రీహర్షునికూర్పులో యువతుల నఖములు (గోళ్లు) అద్దములు. ముఖములు పద్మములు. మందహాసములు పూవులు. వాక్కులు తేనెలు. పాణులు (చేతులు) పల్లవములు (చిగుళ్లు)నై యమరఁగా నాయువతీసమూహమే మంగళవస్తుసముదాయమైనది.

సీ. కలికిచూపులు రత్నకలికాకలాపంబు
గుబ్బచన్నులు హేమకుంభవితతి
మెఱుఁగుఁజెక్కులు క్రొత్తమించుటద్దంబులు
పాణియుగ్మంబులు పల్లవములు
వెలఁదిమందస్మితంబులు కమ్మఁబువ్వులు
పలుకులు వల్లకీకలకలములు
పరిపాటలోష్ఠబింబములు తేనియతోలల్
తనుకాంతి యోలగందంపుఁబసుపు
గాఁగ సౌభాగ్యవివిధమంగళపదార్థ
వరములు గ్రంత నడుమభావంబు తోఁచెఁ
బౌరకాంతలు రాజకుమారదర్శ
నోత్సవంబున కేతెంచునున్నయపుడు. నైష. 6-68.

ఈ క్రంత నీవిధముగ సాగించు మంగళపదార్థజాతము నంతయు తనకల్పనామహిమచే సమకూర్చిపెట్టుటలో నాతని నాఁటి వైవాహికపరిపాటికూడ మన కభివ్యక్తమయినది. ఈతీరుగ శ్రీనాథుఁ డీయనువాదసరణిలో మూలమునకు మెఱుఁగు పెట్టు తెరఁగునఁ దనకవితాస్రవంతిని మున్ముందునకు సాగించుచు మధురభావసమన్వితము గావించియున్నాఁడు. దీనిలో శృంగారరసభావములను వర్ణింపవలయును గదా యనుకొని, యనౌచిత్యము నాపాదించు విషయమును గాని, జుగుప్సాపాదకమైన విషయమునుగాని, ధర్మవిరుద్ధమయిన విషయమునుగాని యెచ్చటను గూర్పలేదనియే తెలుపవచ్చును. శ్రీనాథుఁడు విమర్శకులలోఁ గొందఱు భావించునట్లు స్త్రీలోలుఁడే యైనచో, తనకుఁగల లౌల్య

మును గవితాముఖమున జంకుగొంకులు లేకుండ వెలార్చు నుత్సాహము గలవాఁడేయయినచో నీకావ్యమునం దెంతేని శృంగారభావసామగ్రిని సంతరించుట కవకాశము గలదు. మూలాతిక్రమమున రచన సాగించుటలో నాతనికి వెనుదీయు నలవాటును లేదు. అట్టితఱిని పాఠకులహృదయమున కేపాటి వైరస్యము కలిగించు నని పొడఁగట్టినను దానిని బరిహరించుచు వచ్చినాఁడుకూడ. దాని కొకయుదాహృతి చూపించెదను.

హంస దమయంతితో నలునిగూర్చి ప్రసంగించు ప్రకరణ మిది.

> గీ. కనకశైలంబు డిగ్గి యాకాశసింధు
> సలిలములఁ దోఁగి మిగులంగఁ జల్లనైన
> చారుహాటకమయగరుచ్చామరముల
> వీతు మతనికి వైశాఖవేళలందు. నైష. 2-51.

దీనికి మూలమయిన శ్లోక మిది—

> శ్లో. సువర్ణశైలా దవతీర్య తూర్ణమ్
> స్వర్వాహినీవారికణావకీర్ణైః
> తం వీజయామః స్మరకేళికాలే
> పక్షై ర్నృపం చామరబద్ధసఖ్యైః. సం. నైష. 3-22.

మేరుపర్వతమునుండి యప్పుడే దిగివచ్చి, ఆకాశగంగాజలములఁ దడిసిన ఱెక్కలనువింజామరలతో, నానలుని రతికేళిసమయమున, రతికేళిశ్రమాపనోదనమునకై వీచెద

మని శ్లోకభావము. దీని ననువాదము సేయునపుడు తెరకఁలను సువర్ణమయము గావించినాఁడు. స్మరకేళిసమయమును మార్చి వైశాఖవేళఁ జేసినాఁడు. ఈమార్పులో పాఠకహృదయమునం దొకపవిత్రభావసంచారమును గావింపఁజేసినాఁడు. పాఠకులదృష్టిలో నలుఁ డితరస్త్రీలతోఁ గూడి రతికేళి సలుపుచుండె ననుభావము స్ఫురించిన విషమముగాఁ గోచరించును. ఆతఁ డన్యస్త్రీసంసక్తుఁడు గాకుండ నుండిననాఁడే దేవతలకుసైతము గొనియాడఁ దగినచరిత్రము గలవాఁ డని యనిపించును. అట్టియదనునందే యాతఁడు దమయంతిని వరించుటకుఁ దగినవాఁ డనిపించును. ఇట్టిమార్పు లేనినాఁడు పాఠకులహృదయమునకు వైరస్యము గలుగకమానదు. శ్రీనాథుఁడు తననాఁటి యాంధ్రలోకముమనస్థితిని బరికించియున్నవాఁడు గావున వారిహృదయముల కుల్లాసము గలిగించువిషయములనే యాతఁడు తనరచనల నన్నిటను గూర్చుచు వచ్చినాఁడేగాని, వారిహృదయముల కెడబరమైన విషయము లేవియు నెచ్చటను గూర్చినట్టులు గానరాదు.

శ్రీనాథుఁ డీనైషధకావ్యము నాంధ్రీకరించుటయు నాతనిశృంగారిత్వమున కొకతార్కాణ మని కొందఱ యాశయము. కాని కలికల్మషహరమైనది నలమహారాజుచరిత్రము. చింతామణిమంత్రోపాసకుఁడైన శ్రీహర్షమహాకవి దానిని సంస్కృతమున సంతరింపఁగా, ప్రాసాదపంచాక్షరీమంత్రోపాసకుఁడైన శ్రీనాథుఁడు శ్రీహర్షసంగ్రథితధర్మావిరుద్ధముగా

నాత్మనిష్ఠమైయున్న యీశ్వరార్చనకళాశీలత్వమును వ్యక్తీకరించుచు నాంధ్రీకరణమునకుఁ బాల్పడినాఁడేగాని, తనకుఁ గలశృంగారిత్వమును వ్యక్తముసేయఁ బూనుకొనలే దనుట నిర్వివాదమైన సత్యము. భారతీయసంప్రదాయానుగతమైన పుణ్యపాపముల నంగీకరించువారికిఁ బుణ్యశ్లోకచరిత్రమైన నైషధము శ్రీనాథుని శృంగారిత్వాభివ్యక్తికి నిదాన మని యెన్నఁడు నసిపించ దనియే నాయూహ. వానిని విడనాడి విమర్శింపఁ గడఁగిననాఁడే యీరీతియూహాలు మొలతేరు చుండును.

## శాలివాహనసప్తశతి

శృంగారరసభావసమన్వితమైన శాలివాహనసప్తశతిని నూనూగుమీసాల నూత్నయౌవనమున నాంధ్రీకరించుట యాతని శృంగారిత్వమున కొకహేతువుగా శాస్త్రిగారు శృంగారశ్రీనాథమునం దిట్లు వాకొనియున్నారు. ''ఇందలి పద్యములు మిక్కిలి చిన్నవియైనను భావపూరితములు. తన ప్రాయమునకుం బ్రవర్తమునకు ననురూపముగా శ్రీనాథుఁ డీకావ్యము నీవయస్సునఁ దెనుఁగునకుఁ దార్చెను... ఈగ్రంథమును లభింపకున్నది, ఒకపద్యముమాత్రము లక్షణగ్రంథములందుఁ గానవచ్చుచున్నది.

ఉ. వారణసేయ దావకొనవా? నవవారిజమంచుఁ జేఁటి క్రొ
వ్వారుచు నుంట నీ వెఱుఁగవా? ప్రియువాతెఱగంటిఁ గంట కె
వ్వారికిఁ గెంపురాదు? తగవా మగవారల మాట? నీవిభుం
డారసి నీనిజం బెఱుఁగునంతకు నంతపనేర్వ వచ్చెనే!''

దీనికి మూలమయిన ప్రాకృతశ్లోకమునకు సంస్కృత చ్ఛాయ యిఁది.

శ్లో. కస్య వా న భవతి రోషో, దృష్ట్వా ప్రియాయా స్సవ్రణ మధరం?
సభ్రమరపద్మాఘ్రాణశీలే, వారితవామే సహ స్వేదానీమ్.

ఈశ్లోకమునందలి భావమునకు మెఱుఁగులు దీర్చిన దీ శ్రీనాథుని యనువాదము. ఇటులనే క్రీడాభిరామమునఁ గూర్చిన శాలివాహనసప్తశతిపద్యములుకూడ మూలమునందలి విషయమునకు వన్నెదేఱ్చు ననువాదములై వెలసినవి. శృంగారరసమును రచనావిషయమును గావించినంతమాత్రమున కవి శృంగారి యనుట యవిచారితభాషితము. ఈపై పద్యమునందలిభావము వ్యంగ్యప్రధానమై బహుళార్థస్ఫోరకముగ వెలసినది. శ్రీనాథుఁడు కావుననే యింతసరసముగ నాంధ్రీకరింపఁగలిగినాఁడు. శాలివాహనసప్తశతియందలి భావములుగాని, అమరుకావ్యమునందలి భావములుగాని సామాన్యసాహిత్యసంస్కారముగల పాఠకులకు బుద్ధిస్థములగునవి గావు. సాహిత్యాచార్యులయిన యానందవర్ధనాదులగు కొందఱకే యవి భావనాయోగ్యములు.

రసములన్నిటిలో శృంగారరసము సుకుమారతరము. సహృదయునకు దాని నాస్వాదయోగ్యమొనర్చుకొనుటకెంతేని ప్రణిధానము గావలయును. దానిని ఛందోబద్ధముగాని గద్యబద్ధముగాని గావించి పాఠకులయెదుటఁ బెట్టుటకుఁ గవికి మఱింత ప్రణిధానము గావలయును. అనువాదము

సేయఁబూనుకవి కీరసభావముల నావిష్కరించుపని యపరిమితశ్రమసాధ్యము. రసవారాసులయిన శాలివాహనసప్తశతి నైషధకావ్యముల ననువదింపఁబూని, తనప్రతిభావ్యుత్పత్తుల నమోఘముగఁ బ్రదర్శించిన శ్రీనాథుని రచనల నవగతము చేసికొనుటయే బహుశ్రమసాధ్యము. అట్టితఱి నాతఁడు శృంగారభావస్ఫోరకమైన రచన సాగించినాఁడని యాతని శృంగారి యనుట, సహృదయులైన విద్వాంసుల కంగీకార్యము గాదని నామనవి.

## శృంగారరసపరిష్కారము

శ్రీనాథుఁడు శృంగారరసమును దనరచనలలో నిర్నిరోధముగా జతఁగూర్చినాఁడు గనుక నాతఁడు శృంగారి (స్త్రీలోలుఁడు) యని పెక్కురు విమర్శకులు తలపోయుచున్నారు. వీరిలోఁ బెక్కుమందికి రసస్వరూపము సక్రమముగా నెఱుకపడునది గాకయేయున్నది. సౌందర్యవతియైన వనితను బ్రకరణవశమున వర్ణించునపుడు, తదీయకచకుచనితంబాదిసౌష్ఠవమును వర్ణించినంతమాత్రమున నది శృంగారరస మనుకొనువారు కొందఱు. ప్రేయసీప్రియాలంబనమైన ప్రణయభాషితములను రచనలోఁ గూర్చుట రస మనుకొనువారు కొందఱు. సురతప్రపంచము వర్ణించినపట్టులఁ జూచి రస మనుకొనువారు కొందఱు. కాని బ్రహ్మానందసబ్రహ్మచారియైన యాశృంగారరసము సామాన్యమానవహృదయములకు గోచరించునది మాత్రముగాదు. మహాతపస్విలయిన

యుత్తమకవులు తమతమరచనలలో నుపనిబద్ధము చేసిన యీ రసస్వరూపమును గుర్తించుటకు సహృదయుఁడైన పాఠకునకుఁ గూడ యోగ మత్యావశ్యకము. శారదాతనయుఁడు భావప్రకాశనమునం దీశృంగారరసవిభాగమునుగూర్చి యిట్లు ప్రపంచించియున్నాఁడు.

శ్లో. దేశ కాల గుణ ద్రవ్య క్రియా జన్యాత్మకేషు తు
అనుభూతేషు భావేషు యథావత్స్థితరూపతః
యేన యేన చ భావేన యాదృశో జాయతే రసః
తత్తన్నాభవాఖ్యయా సద్భి రో౽భిధ్యతే తాదృశో రసః
భావగర్భం రహఃసంవిత్ మధురం నర్మపేశలమ్
సువృత్తం శ్రవణానంది శృంగారో వాచికో మతః
వాసోఙ్గరాగభూషాభి ర్మాల్యై ర్వ్యక్తం ప్రసాధితమ్
ప్రాప్తయౌవన మంగం య చ్ఛృంగారః స్యాత్స ఆంగికః
దంతచ్ఛేద్యం నఖచ్ఛేద్యం మణితంచ ససీత్కృతమ్
చుంబనం చూషణం భావో హేలాదిః కేలయో౽పిచ
శయనాద్యుపచారశ్చ తథా సంగీతకక్రియా
ఇత్యాదిభావైః కథితః శృంగార స్స్యాత్ క్రియాత్మకః.

భావప్రకాశనము-తృతీయాధికారము.

దేశము కాలము గుణము వస్తువు పని యనువీనినుండి జనించిన స్వరూపముగల భావములను యథాస్థితముగ ననుభవించినపు డేయేభావములనుండి యేయేరసము పుట్టుచున్నదో ఆయారస మాయాపేరుతో సహృదయులచే గుర్తింపఁబడుచున్నది. భావగర్భమై రహోవిషయకమై మధురమై పరిహాసపేశలమై సద్వృత్తమై వీనులవిందయి

యుండినశృంగారము, వాచికశృంగార మనఁజెల్లును. వస్త్రములు మైపూఁత భూషణములు పూలమాలలు అనువీనిచే నలంకృతమై యౌవనసము పేతమయిన శరీరము నభివర్ణించిన శృంగార, మాంగికశృంగార మనఁజెల్లును. దంతక్షతములు నఖక్షతములు సీత్కారములతోఁ గూడినమణితము ఓష్ఠపానము హేలాదిభావములు కేళులు శయనాద్యుపచారములు సంగీతముపాడుట ఈ మొదలయినభావములతోఁ గూడినశృంగారము క్రియాత్మకశృంగార మనఁజెల్లును; అని పైశ్లోకముల భావము. ఈరీతిగ త్రివిధమైన శృంగారరసభావములలో ప్రథమద్వితీయములు సరసముగఁ జిత్రించి సహృదయులహృదయముల నావర్జించి రసప్రవణులను గావించుట కవికి శ్రమసాధ్యమైనవిషయము. క్రియాత్మకమైన తృతీయ విషయము నేకవి యేతీరుగ వర్ణించినను నది సామాన్యచిత్తసంస్కారముగల పాఠకుల హృదయమును సులభముగ నావర్జించివైచును. రసభావభావనాయోగ్యచిత్తసంస్కారము లేనిపాఠకుల కది యుబలాటమును గలిగించును. రసగ్రహణపారీణులైన సహృదయుల కట్టిది కాళిదాసాదిమహాకవినిబద్ధవస్తూన్మీలితమై చర్వణస్థితికి వచ్చినచో నఖండానందానుసంధాయక మగును.

కాని యాంధ్రదేశమునందు కుమారసంభవమహాకావ్యమును శిష్యులకు బోధించు సంప్రదాయజ్ఞులైనగురువులు ఆకావ్యమునందలి చతుర్థాష్టమసర్గములను బాలక్రమ

మునుండి తొలఁగించుచుండెడివారు. రతివిలాపనిరూపకమైన చతుర్థసర్గము నొకప్పుడు పఠింపఁజేసినను, పార్వతీపరమేశ్వర సంభోగనిరూపకమైన అష్టమసర్గమునుమాత్ర మెవరును నుపదేశించుపరిపాటి లేదు. ఈసర్గమునం దీతృతీయకక్ష్యకుఁ జెందినశృంగార (మనఁగా క్రియాత్మకశృంగార) మభివర్ణితమైనకారణమున నది బాలహృదయములందు సరిగా హత్తదనియు, వికారిహృదయములం దది సద్భావసము న్మేషకము కాదనియు, వారికి దాని నెఱిఁగింపకుండుటయే సంప్రదాయముగాఁ బాటించుచువచ్చినారు. అట్టి సంప్రదాయమును బాటించియే శ్రీనాథుఁడు తనహరవిలాసమునఁ బార్వతీపరమేశ్వరాశ్రయముగ శృంగారరసము నభివర్ణించుచు కుమారసంభవకావ్యమునందలి కథావస్తువును, వాచికాంగికశృంగారవిషయమునకు సంబంధించినంతవఱకుఁ జిత్రించి, క్రియాత్మకశృంగారనిరూపకమైన యష్టమసర్గమునందలి విషయము నాంధ్రీకరింపకయే వదలినాఁడు. ఈవిషయమును వర్ణింపక వదలుటయే యాతనికిఁ గలశృంగారరసనిర్వహణసంయమమును వేనోళ్లఁ జాటుచున్నది. ఇఁక నాతనిరచనలలో శృంగారమే దేని యుండిన నది వాచికము ఆంగికము నగు శృంగారమే బహుళముగాఁ జూపట్టును.

శ్రీనాథుఁడు హరవిలాసమునఁ గుమారసంభవకావ్యవస్తువును జాలవఱకు స్వీకరించి, క్రియాత్మకసంభోగశృంగారమును వదలివేయుటకు సంప్రదాయసంరక్షణమే మూల

కారణ మనిపించుచున్నది, రసబంధురమయిన ప్రబంధము నుపనిబంధించు కవి తనకావ్యమునం దనౌచిత్యమును సర్వథా పరిహరింపవలయు నను నానందవర్ధనాచార్యుని సూక్తి నీతఁడు పాటించె ననియును మన మూహింపవచ్చును. ఆనందవర్ధనాచార్యుఁడు ధ్వన్యాలోకము తృతీయోద్యోతము నందు 'కాళిదాసమహాకవి విరచితమయిన కుమారసంభవ మహాకావ్యమునందు పార్వతీపరమేశ్వరవిషయకమైన సంభోగశృంగారమును నిబంధించుట యుక్తమా ? అయుక్తమా ?' యని శంకించి కొంత చర్చ సాగించియున్నాఁడు. ఆక్రమ మిట్లు నడచినది.

"ద్వివిధో హి దోషః—కవే రవ్యుత్పత్తికృతః అశక్తికృతశ్చ. తత్రావ్యుత్పత్తికృతో దోషః శక్తితిరస్కృతత్వా త్కదాచి న్న లక్ష్యతే. య స్త్వశక్తికృతో దోషః స ఝటితి ప్రతీయతే. పరికరశ్లోక శ్చాత్ర—

శ్లో. అవ్యుత్పత్తికృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః
య స్త్వశక్తికృత స్తస్య స ఝటి త్యవభాసతే.

తథాహి. మహాకవీనా ముత్తమదేవతావిషయప్రసిద్ధసంభోగశృంగారనిబంధనా ద్యనౌచిత్యం శక్తితిరస్కృతం గ్రామ్యత్వేన న ప్రతిభాసతే. యథా కుమారసంభవే దేవీసంభోగవర్ణనమ్. ఏవమాదౌ విషయే య థౌచిత్యత్యాగ స్తథా దర్శిత మేవాగ్రే.

లోచనమ్ :—శక్తిః—ప్రతిభానమ్. వర్ణనీయవస్తువిషయనూతనోల్లేఖశాలిత్వమ్. వ్యుత్పత్తిః—తదుపయోగిసమస్తవస్తుపౌర్వాపర్యపరామర్శకౌశలమ్. తస్యేతి కవేః. అనౌచిత్య మితి—ఆస్వాదయితౄణాం హి యత్ర చమత్కారవిఘాత; స్తదేవ రససర్వస్వమ్ స్వాదాయత్తత్వాత్. ఉత్తమదేవతాసంభోగపరామర్శే చ పితృసంభోగ ఇవ లజ్జాతఙ్కాదినా కశ్చమత్కారావకాశ

ఇత్యర్థః. శక్తితిరస్కృతమితి-సంభోగోఽపి హ్యసౌ వర్ణ్యతే తథా ప్రతిభానవతా కవినా, యథా తత్రైవ విశ్రాంతం హృదయం పౌర్వాపర్యపరామర్శం కర్తుం న దదాతి. యథా నిర్వ్యాజపరాక్రమస్య పురుష స్యావిషయేఽపి యుధ్యమానస్య తావత్తస్మి న్నవసరే సాధువాదో వితీర్యతే. నతు పౌర్వాపర్యపరామర్శే తస్యాత్రాపేతి భావః.''

దోషములు రెండువిధములు. కవి వ్యుత్పత్తిలేక చేయునది యొకటి. కవి శక్తిలేక చేయునది యింకొకటి. వానిలో వ్యుత్పత్తి లేక చేయుదోషము శక్తిచే, అనఁగా కవికిఁ గల ప్రతిభచేఁ దిరస్కృతమై యొకప్పుడు గానరాని దగును. శక్తి లేకపోవుటవలనఁ గలిగినదోషము వెంటనే యవభాసించును. ఈవిషయమునే పరికరశ్లోకము సంగ్రహించి తెలిపినది. కవికిఁ బ్రతిభావ్యుత్పత్తులు రెండును బ్రధానముగా నుండవలయును. వ్యుత్పత్తి లేక యాతఁడు గావించినదోష మేదేని యుండిన దానిని బ్రతిభ కప్పివేయును. అట్టిదాని నొకప్పుడు సహృదయుఁడుకూడ గుర్తింపలేఁడు. కాని కేవలవ్యుత్పత్తి గలిగి ప్రతిభ లేకుండిన, నాతఁడు గావించుదోషము మాటు పడుపరానిదే యగును. ఈవిషయమును సోదాహరణముగ వివరించుచున్నాఁడు.

మహాకవులోనచ్చిన ఉత్తమదేవతావిషయకసంభోగ శృంగారాదిక మగునసౌచిత్యముకూడ కవిశక్తితిరస్కృత మగుటవలన గ్రామ్యముగాఁ దోఁపదు. కుమారసంభవము నందలి పార్వతీసంభోగవర్ణన మిందుల కుదాహరణము. ఈ మొదలయినతావులం దౌచిత్యము పరిశీలింపఁబడినట్లులు

ఆనందవర్ధనుఁ డంతకుమున్నే నిరూపించెను. ఈవిషయమును లోచనకర్త యిట్లు వివరించినాఁడు. శక్తి యనఁగా ప్రతిభ. వర్ణింపఁదగినవస్తువును నూతనముగ నిరూపింపఁజాలియుండుట. వ్యుత్పత్తి యనఁగా, దాని కుపయోగించు సమస్తవస్తువుల వెనుకముందుల నాలోచించు నేర్పు. రసము నాస్వాదించువారి కెచ్చటఁ జమత్కారమునకు విఘాతము గలుగునో యదియే యనౌచిత్యము. ఆస్వాదాధీనమైన చమత్కారమే రససర్వస్వము. ఉత్తమదేవతావిషయకమయిన సంభోగమును కవి నిబంధించిన, నది పితృసంభోగమువలె లజ్జాసంకోచాదికమును గలిగించును. కావున నట్టియెడలఁ జమత్కారావకాశ మే ముండును? ప్రతిభావంతుఁడైన కవి, సహజపరాక్రమవంతుఁడైన పురుషుఁడు అస్థానమైనచోట (బాలవృద్ధాదులమీఁద) యుద్ధము సాగించుక్రమమును వర్ణించునపుడు బాగు బాగనిపించునేగాని, పౌర్వాపర్యపర్యాలోచనము సేయుటకు సహృదయున కవకాశము నీయఁడు. అట్లే ప్రతిభావంతుఁడు సంభోగమును వర్ణించినను, హృదయమచట విశ్రాంతమై వెనుకముందుల నాలోచించుట కవకాశము నీయదు.

ఈపైవాక్యములను బర్యాలోచనము సేయఁగా, కాళిదాసవిరచిత కుమారసంభవమునందలి అష్టమసర్గములోని పార్వతీసంభోగవర్ణనమునం దనౌచిత్యదోషము లేకపో లేదని విదితమైనది. కాని యచట మహాకవి కాళిదాసుని

ప్రతిభ యాదోషము నుద్భావించు నవకాశము లేకుండఁ జేసిన దనియు, ఆనందవర్ధనాభినవగుప్తుల వాక్యములు తెలియఁ జేసినవి. కావుననే ప్రాచీనసంప్రదాయజ్ఞు లీయష్టమసర్గమును పాఠప్రవచనములనుండి సడలించియుండి రనియు, ఆలంకారికసిద్ధాంతములను దనరచనలో సక్రమముగఁ బాటించిన శ్రీనాథుఁడు తత్సంప్రదాయరక్షకై తనప్రబంధమునందుఁ బార్వతీపరమేశ్వరసంభోగమును జిత్రింప మానినాఁడనియు మన మూహింపవచ్చును. శృంగారరసనిర్వహణమున శ్రీనాథుఁడు పరమసంయమి యనుట కిట్టియుదాహృతుల నెన్నియో చూపింపవచ్చును.

నైషధకావ్యమునందుఁ బైనఁ బేర్కొనిన త్రివిధమైన శృంగారరసభావముల పరిపుష్టి సంస్కృతమూలమునందే గానవచ్చుచున్నది; గావున శ్రీనాథునిరచనయందును నది యవతరించినది. ఇఁకఁ దానై శృంగారరసమును నిర్వహింప వలసివచ్చినచోటులందెల్ల నాంగికశృంగారమునే విశేషముగఁ బ్రపంచించుచు వచ్చినాఁడు. తానై క్రియాత్మకశృంగారరసమును గోలఁదిగఁ బ్రపంచించినది శివరాత్రిమాహాత్మ్యములో చండాలీసుకుమారుల సంభోగప్రకరణమునందుమాత్రమే. అదికూడ మిక్కిలి సంయతముగను పరిమితముగను రెండువాక్యములలోఁ జిత్రింపఁబడినది. అదిగాక తక్కిన తావులందు క్రియాత్మకశృంగారమును బ్రపంచించు నవకాశ ముండినను సరకుగొనక వదలుచునే వచ్చినాఁడు.

అదియునుగాక శ్రీనాథునకు వివిధవస్తుగతసౌందర్యము నావిష్కరించుటలోఁ గల ప్రణిధానము, తదితరవిషయములందంతగ నుండినట్లు గానరాదు. ఆతనివి యని యనుకొనఁదగిన చాటువులలోఁగూడ నాంగికశృంగారమే బహుళముగఁ గానవచ్చును. వాచికశృంగారముగాని క్రియాత్మకశృంగారముగాని చూపట్టదు. ఆపశ్యకమైనఘట్టములలో ప్రబంధములందే లేని క్రియారూపశృంగారము నాతఁడు చాటువులలో నెట్టులు సమకూర్చును. కావుననే యాతనివిగా నెన్నఁదగిన చాటువులలో దేశకాలవయోవస్థానురూపమై సౌందర్యోపస్థారకమైన యాంగికశృంగారమే బహుళముగాఁ జూపట్టును. ఆంగికశృంగారాభివ్యక్తికిఁ గవికిఁ దదనుభూతితో నిమిత్తమేమియు లేదు. కవికి సిశితమైన పర్యవేక్షణశక్తి భావనాబలము నుండినఁ జాలును. ప్రతిభావ్యుత్పత్తులు గలకవికి క్రియాత్మకశృంగారము నభివర్ణింపవలసివచ్చినఁగూడఁ దత్తదనుభూతితో నిమిత్తము లేకుండఁగనే యాతఁడు తనరచనల్లోఁ గాన్పింపఁజేయఁగలఁడు. కవి కావ్యముఖమున వెలార్చు భావములన్నిటికి నాతనియనుభూతి యత్యావశ్యకమను నియమ మెన్నఁడు నుండఁబోదు. కావున సౌందర్యావిష్కారాభినివిష్టమతితో నాంగికశృంగారమాత్రమును నిరూపించిన శ్రీనాథునిచాటువులనుబట్టి యాతఁడు శృంగారి యని నిరూపించుట సహృదయులైన విద్వజ్జనుల కాదరణీయము గాదని నామనవి. శ్రీనాథునిచాటువులుగా లెక్కకు వచ్చి, క్రియా

త్మకశృంగారరసభావనిరూపకములైన పద్యము లాతనివి గాకుండుట యెట్లులో దానిని సహృదయులైన పాఠకుల కెఱిఁగించుటకై, ఈవిమర్శనమున కనుబంధముగ నాచాటువులను వివరింప సమకట్టితిని. దానిని సావధానమతితోఁ బరికించి, శ్రీనాథునియెడ సద్భావసమన్వితు లగుదురుగాత మని నా వేఁడికోలు.

## ఉపసంహారము

శ్రీనాథుని శృంగారిఁగా, అనఁగా స్త్రీలోలునిగా గుర్తించిన విమర్శకులు తెలిపియున్న యుపపత్తులను నిరూపించి, వానికి నాకుఁ దోఁచినప్రమాణముల నెఱిఁగించుచు వివరించియుంటిని. సహృదయులయిన యాంధ్రభాషావిమర్శకులు ఆకవిసార్వభౌమునియెడల సద్భావము నలవరించుకొని, యాతనికృతులను నిష్పాక్షికదృష్టితోఁ దిలకించి, శ్రీనాథునిశృంగారి యనుట భావ్య మగునో కాదో, నిర్ణయించుకొందు రని యింతదనుక వ్రాసియుంటిని. శ్రీనాథు నఖండశివభక్తునిగా నిరూపించుదానికంటె, నాతని శృంగారి శేఖరునిగా సమర్థింప సమకట్టిననాఁడు నామాటలు పాఠక లోకమున కాహ్యాయముగా నుండఁగల వని నే నెఱుఁగుదును. ఆంధ్రపాఠకలోకమున కాదరపాత్రమైన విమర్శకుల సిద్ధాంతమునకు విరుద్ధముగ నీవిషయమును బ్రతిపాదించి పెక్కురయాగ్రహమునకు గుఱి కాఁగల ననియు నే నెఱుఁగుదును. 'శ్రీనాథుఁడు శృంగారి'యను భావము విమర్శకుల యను

గ్రహమున పెక్కురసహృదయములలో దృఢమూలమై పాదు కొనిపోయిన దనియు, ఆతని శృంగారి కాఁ గనుట యేటి కెదు రీఁదుట యనియు నే నెఱుఁగుదును. ఇప్పటికే సభావేదికలపై నప్పటప్పట నీప్రసంగము గొనివచ్చిన నది ప్రాచీనవాసనా సమన్వితహృదయముల కంతగా హత్తుట లేదనువిషయమును నే నెఱుఁగుదును.

అయినను ముందుగ శ్రీనాథుని శృంగారి యను కొని, యాతనిరచనలను సరిగా నర్థముచేసికొనక యే యుండి, క్రమముగ నాతనికృతుల నన్నిటిని చదువుచు వచ్చిననాఁడు 'ఆతఁ డురుప్రజ్ఞావిశేషోదయాజిహ్మస్వాంతుఁ' డనుట, 'ఈశ్వ రార్చనకళాశీలుఁ' డనుట సత్య మనిపించినది. ఆనాఁటినుం డియు శ్రీనాథుఁడు నా కఖండశివభక్తుఁడుగ గోచరించుచు వచ్చినాఁడు. పాఠకు లెవ్వరేని నాపలుకులలోని సత్యమును గ్రహించి, శ్రీనాథునెడల సద్భావమును బెంపొందింపఁ జేసి కొని, ఆతనిరచనలలోఁ జూపట్టెడి పరమేశ్వరాద్వైతభావ మును, సృష్టిగతవస్తుసౌందర్యపరిష్కారశిల్పమును, ఆతని కవితాప్రతిభను గుర్తింప యత్నింతు రేని, యది నాకృషికి సార్థక్యము నాపాదింపఁ గలదని యథార్థముగాఁ దలపోయుచు నింతవట్టు వ్రాయఁ బూనితిని. నాయీయభిప్రాయములకుఁ దమహృదయములయం దంగీకారము లేనిసహృదయు లెవ్వ రైన నుండినచో, వారికిఁ బరమేశ్వరుఁడు సద్భావమును సమ్యగ్భావనను ననుగ్రహించుగాత మని యానర్వేశ్వరున కంజలించుచున్నవాఁడను.

శ్రీనాథుని శృంగారిగానే భావింపఁ దలఁచుకొనినవా రెవ్వరేని యుండిన, వా రొక్కసమయమున నాతని పరమ శివభక్తునిగాఁగూడ భావించి, మనమున నాతని శృంగార మూర్తితోపాటు భక్తమూర్తినిసైతము చిత్రించుకొని, ఆదృష్టితో నాతనికృతుల నామూలచూడముగఁ బఠింపఁ బ్రార్థించువాఁడను. శ్రీనాథుఁ డుత్తమజాతీయకవి యనుటలో నాంధ్రపాఠకుల కెవ్వరికిని విప్రతిపత్తి లేదు. ఆతనికి సంస్కృతాంధ్రములం దఖండపాండిత్యము గలదనుటలో నెవ్వరికిని భేదాభిప్రాయములేదు. ఆతని కవిత చెవినిబడినఁ దనివిఁజెందని ఆంధ్రసారస్వతరసపిపాసు వెవ్వఁడునులేఁడు. కాని యాతఁడు తనకుఁగల సంస్కృతభాషాపాండిత్యప్రకర్షము నీయాంధ్రసారస్వతమునందు గొంత హెచ్చుమాత్రలో నతికించియుండుటచే, సంస్కృతసాహిత్యమార్గముల నంతగా నెఱుఁగనివారి కాతనిరచన పలుతావులందు దుర్బోధముగ నుండు ననుట నిక్కువము. కాని యాతనికవితారీతులను సావధానమతితోఁ దిలకించి, యాతనిరచనలందలి గుణదోషములను లెక్కింపఁ గడఁగుట సహృదయులైన విమర్శకులకు సముపాదేయమైన విషయ మని నామనవి. సద్విమర్శకు లిట్టిపనికిఁ బూనుకొని, యాతనియీశ్వరార్చనకళాశీలత్వము నితోధికముగ నాంధ్రపాఠకలోకమున కెఱిఁగింపఁ గృషిసల్పెదరుగాత మని నాహృదయపూర్వకమైన వేఁడికోలు.

ఓమ్ శివమ్.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 28 | 20 | పైపద్యము | పైపద్యమున |
| 44 | 16 | యర్జునన | యర్జునున |
| 52 | 9 | పాదము | పాదము |
| 57 | 2 | సాత్వాత్క | సాత్మాత్క |
| 62 | 20 | ప్రకృత్తి | ప్రవృత్తి |
| 65 | 11 | బ్రహ్మనంద | బ్రహ్మానంద |
| ” | 13 | సంయమును | సంయమమును |
| 69 | 2 | స్వవియము | స్వవిషయము |
| 118 | 6 | కర్ణాంగన | కర్ణాటాంగన |
| 119 | 21 | పరణతిని | పరిణతిని |
| 161 | 11 | లంగిత | లింగిత |
| 166 | 7 | ప్రణలిప్స | ప్రణయలిప్స |
| 178 | 4 | యనాచ్ఛాతిత | యనాచ్ఛాదిత |
| 182 | 3 | సంఘనము | సంఘటనము |
| 188 | 23 | నీనిబం | నీనిజం |
| 192 | 22 | పాఠక్రమ | ప్రవచనక్రమ |
| 195 | 10 | వెంటనే | వెంటనే |
| 199 | 15 | శృంగారి | శృంగారి |
| | | **చాటువులు** | |
| 24 | 12 | భాణములు | భాషణములు |
| 34 | 3 | వధూటల | వధూటుల |
| 35 | 20 | సచ్ఛంబైన | నచ్ఛంబైన |
| 42 | 11 | ముద్దు | ముద్దు: |
| 46 | 14 | బాలేంబు | బాలేందు |
| 65 | 9 | నారు | నారు. |
| ” | 14 | భోన | భోవ |
| 74 | 22 | కుందు | కందు |
| 78 | 20 | బొల్పెసరారి | బొల్పెసలారి |
| 80 | 18 | బ్రాజేంద్రమ | బ్రాజము |

# చాటువులు - అకారాదిపద్యసూచిక



# శ్రీనాథ కవితా సమీక్ష

## చాటువులు

శ్రీనాథుని చాటుపద్యము లాంధ్రదేశమం దంతటను ప్రసిద్ధములు. తెలుఁగు పద్యములను దమిళ్ళోఁ జదువువా రెవ్వరయినను శ్రీనాథుని చాటువులనుగూర్చి తెలియనివా రుండఁబోవరు. ఆతని చాటువులం దట్టి ప్రత్యేకత గలదు. ఆతఁడు తననాఁటి పరిపాటుల నెన్నిటినో యీ చాటువులలోఁ దెల్లముచేసియున్నాఁడు. మఱియు నాతని రచనలో నుల్లాసము గలిగించు శృంగార భావము లోతప్రోతములై యుండు నని యొకకింవదంతి. కాని యాతనివిగా నెన్నఁదగిన చాటు పద్యము లన్నిటియందును శృంగారభావములు మాత్రమే వర్ణింపఁబడి యుండ లేదు. ఆంధ్రదేశము నలుమూలలు పర్యటించి, తన కవితావిభవము నెల్లచోటుల వెదఁజల్లి యుత్తమ కవిగా ఖ్యాతి వహించిన శ్రీనాథుని యీ చాటువులలో- వివిధ ప్రాంతములం దాతనికిఁ గానవచ్చిన ప్రేక్షణీయ దృశ్యములు ప్రతిఫలించినవి. కొన్నిట నాయా ప్రాంతములందలి యాహారవిహార పరిపాటులు పేర్కొనఁబడినవి. మఱికొన్నిట నాతని భక్తిభావ మభివ్యక్తమైనది. కొన్నిట నాతనికిఁ గల పాండిత్యవిభవము సువ్యక్తమైనది. వేఱొక కొన్నిట నాతని భక్తిభావము ప్రస్ఫుటమైనది. ఇఁకఁ గొన్నిట నానాజాతి

వనితాసౌందర్యసమన్వితవేషభూషాభాషణాదికము పరిస్ఫుట మైనది. అంతియగాని యశ్లీలభావములను రేకెత్తింపఁజేయు గ్రామ్యశృంగారము మాత్ర మాతని చాటువులలో నెచ్చటను గానరాదు. శ్రీనాథుఁడు తన ప్రబంధము లన్నిటి యందును బాటించు సౌందర్యాభివ్యంజకశిల్పమే యీ చాటువులలో సైతము గోచరించును.

పైవిధమున నవతరించిన చాటువు లన్నిటి నొకచోఁ జేర్చినప్పటి కదియే యొక 'వీథి'గాఁ బరిణమించినది. అట్టి చాటుపద్య సంచయమునే శ్రీనాథుని తరువాతి లాక్షణికులు తమ లక్షణగ్రంథములలో నుదాహరించునపుడు 'శ్రీనాథుని వీథినాటకము' అను పేర వ్యవహరించియున్నారు. అంతియ గాని శ్రీనాథుఁడు ప్రత్యేకముగ 'వీథినాటక' మను గ్రంథ మొకటి రచించినట్లులు తెలియరాదు. ఈ చాటువులందును 'కందుక కేళి సల్పెడి ప్రకారమునన్' 'కుసుమం బద్దిన చీర కొంగు వొలయన్' ఇత్యాదికమైన యీ రెండు పద్యములనే పెక్కురు లాక్షణికు లుదాహరించియున్నారు. ఇవిగాక తక్కిన చాటువు లేవియు లాక్షణికు లుదాహరించి యుండనే లేదు. చాటువులుగా లెక్కింపఁబడు నీ రెండు పద్యములను శ్రీనాథుని కాశీఖండ నైషధాది పద్యములతోపా టుదాహ రించి యుండుటచే నానాఁటి లాక్షణికుల కీ చాటువులం డాతని ప్రబంధములతో సమాన ప్రతిపత్తి పాటింపఁబడి నట్లులు తెలియవచ్చుచున్నది.

'వీథి' యను రూపకమున సాధారణముగా శృంగార ప్రాయమైన వర్ణనము లుండును. ధూర్తవిటచేష్టితనిరూపణ మందలి ప్రధానేతివృత్త మగుచుండును. మనకిపు డుపలబ్ధ మగుచున్న వినుకొండ వల్లభరాయవిరచితమైన క్రీడాభి రామ మను వీథినాటకము, చాటుపద్యరూపమైన శ్రీనాథుని వీథి నుపశ్రుతిగఁ గైకొనియే బయలుదేఱినట్లులు కన్పట్టు చున్నది. దానిలో తొలుతటి భాగమున నానాజాతి వనితా సౌందర్యము చిత్రింపఁబడియున్నది. వీథిరూపకమున కుండ వలసిన లక్షణములు కొన్ని శ్రీనాథుని చాటువుల కమరి యుండిన కారణమున వానినే యాతని తరువాతివారు శ్రీనా థుని వీథినాటకముగా నుదాహరించియుండి రని యూహ చేయవలనుపడుచున్నది. చాటువులుగా వ్యవహరింపఁబడుచు వచ్చిన యీ పద్యములను లాక్షణికులు శ్రీనాథుని వీథి నాటకముగా నుదాహరించుటయేగాక, ప్రాచీన తాళపత్ర గ్రంథములలో నీ చాటువులలోఁ గొన్ని (నానాజాతి వనితా సౌందర్యచిత్రణము గలవి) 'శ్రీనాథుని వీథినాటకము' అను పేరితో వ్రాయఁబడియుండుటయు దీనికి నిదర్శనము. అచ్చు యంత్రములు వచ్చినతరువాత 'శ్రీనాథుని వీథినాటకము' అను పేర నీ చాటువులలోఁ గొన్ని ముద్రితములైనవి. కాని యీ ముద్రితాముద్రిత చాటుపద్యములలో శ్రీనాథునివే గాక యన్యులు రచించిన పద్యములుకూడఁ గొన్ని చేరుచు వచ్చినవి. వానిలో నితర కవుల రచనలను విడఁదీయకుండ

వన్నిటి నొకచోఁ జేర్చి, వెనుకటి తాళపత్రగ్రంథములలో వ్రాయఁబడియుండుట కారణముగా నీ చాటువులే శృంగార పద్యములుగా లెక్కింపఁబడఁజొచ్చినవి. అట్టివానినే వెనుకటిముద్రాపకులు ముద్రించిరి. ప్రాచీనులయిన వ్రాయసకారు తాళపత్రిగ్రంథములను వ్రాయు పరిపాటిలో నేదియో యొకగ్రంథమును సమగ్రముగనో యసమగ్రముగనో వ్రాసికొని, యాగ్రంథముల ఆద్యంతపత్రిములలోఁ గొన్ని చాటు పద్యములనో చాటుశ్లోకములనో లేక ప్రాస్తావికపద్యములనో శ్లోకములనో వ్రాసియుంచుకొనుట యొక పరిపాటియైనట్టు లా తాళపత్రిసంచయమును బరికించినవారికెల్ల విదితమే. ఆపరిపాటిలో వ్రాయునపుడు ఆంధ్రదేశమంతటను ప్రసిద్ధమైన శ్రీనాథుని చాటువులతోపాటు తదితరకవుల రచనలను గూడ వారు వారు చేర్చుకొనుచు వచ్చిరి. ఆచేర్పులో సభ్యశృంగారసమంచితములైన శ్రీనాథుని చాటువులతోపాటు గ్రామ్యశృంగారసమన్వితములయిన యితర రచనలుగూడ వానిలోఁ జొరఁబడినవి. కాలక్రమమున సభ్యములు నసభ్యములుగూడ శ్రీనాథుని చాటువులుగా లెక్కింపఁబడఁజొచ్చినవి. వానిలో నేవి శ్రీనాథునివిగా లెక్కింపఁపదగునో వానిని విడఁదీసిన, నందు సభ్యమైన శృంగారమే గానవచ్చును. శ్రీనాథుఁడు తాను రచించిన ప్రబంధములలో శృంగారరసమును నిర్వహింపవలసినపట్టులందు కాళిదాసాది సంస్కృత కవులవలె విశిష్టమయిన సంయమమును బాటించి

యున్నాఁడు. రసపరిపుష్టికై తత్తద్వస్తుగతసౌందర్యము సత్యావధానముతోఁ జిత్రించియున్నాఁడు. ఈ చాటువులలోఁ జాల వఱకు నానాజాతివనితల సౌందర్యవర్ణనమే కావింపఁబడినది. అట్టి వర్ణనమునందు ప్రబంధాంగీకృతసరణినే పాటించి యున్నాఁడు. శ్రీహర్షవిరచిత నైషధమువంటి శృంగారరసార్ణవమును జేఁబట్టి మూలముకంటెను సమంజసముగఁ దీర్చి దిద్దిన చేతితోఁ బరిణతమైన శైలిలో నీచాటువులుగూడ నాతనిచే సంతరింపఁబడినవి. కావున శైలినిబట్టియు పదవిన్యాసమునుబట్టియు భావావిష్కరణసరణినిబట్టియు, మూర్తిసాక్షాత్కృతిపద్ధతిని బట్టియు, కల్పనా చమత్కారమును బట్టియు సావధానముగఁ బరికించిన శ్రీనాథుని పద్యములేవియో, యాతనివి గానివేవియో సహృదయులకు సులభముగనే గోచరింపవచ్చునని నాయూహ.

శ్రీనాథుని రచనలో గోచరించు భావసంపద నవగతము చేసికొనుటకు విశేషపరిజ్ఞానము సమ్యగ్దర్శనము కూడ నావశ్యకము. ఆతఁ డేవస్తువునందలి చిత్తాకర్షకమైన సౌందర్యమును జిత్రింపఁ దలపెట్టినను, దానిని సర్వాంగపరిపుష్టము గావించుచుండును. చేఁబట్టిన వస్తుస్వరూపమంతయుఁ బాఠకులయెదుట మూర్తిభవించునట్లుచేయును. ఏవస్తువునందేని యొకప్రత్యేకత యుండిన, నది ప్రేక్షక చిత్తాకర్షక మనిపించినచో దాని యథార్థస్థితిని దన కవితాఫలకమున ప్రతిబింబితము చేయును. ఇట్టి రచనాశిల్పము ప్రబం

ధములందును చాటువులందును సమానముగనే గోచరించును. నేఁటికి వెనుకటి కాలమున శ్రీనాథుని శృంగారిగను, రామలింగని వికటకవిగను నెంచి, కవితావిషయకముగ శృంగార మెట్టిదైనను నది శ్రీనాథునకును, హాస్యమేదియైనను నది రామలింగనికిని నంటఁగట్టుట యొకపరిపాటి యైపోయినది. ఆక్రమమున శ్రీనాథుని రచనములు కానివి గూడ వానివిగాఁ జెల్లిపోవుచు వచ్చినవి. మనము శ్రీనాథుని రచనాముద్రలేనివానిని దూరముచేసి యేర్చిపెట్టినచో నట్టి వానిలో నసభ్యమైన శృంగార మవభాసింపదని నిశ్చయముగఁ జెప్పవచ్చును.

చాటువులనఁగా ప్రియవచనములు. చిత్తమున కుల్లాసము గలిగించు మాటలను చాటూక్తు లని వాకొందురు. శృంగారభావ సమన్వితములైన గద్యపద్యములు కవితారసాస్వాదలోలుపహృదయముల కుల్లాసము గలిగించును. అట్టి శృంగారభావములుకూడ పురుషసంకలితములు స్త్రీసమన్వితములునై వెలయుచు వచ్చినవి. వెనుకటి కాలమునఁ గవితానిర్మాతలు, కవితాసారసంగ్రహతత్పరులు నగు వారిలోఁ బురుషులసంఖ్యయే హెచ్చు. అదియునుగాక శృంగారభావములు లలితసుకుమారములు. కావునఁ దన్నిరూపణావసరమున లలితసుకుమారప్రకృతులైన స్త్రీలను సమాశ్రయించుటయే సహజమైన విషయము. కావుననే శృంగారభావములన్నియు విశేషముగ వనితాసమాశ్రయముగనే వర్ణింపఁ

బడుచు వచ్చినవి. వాచ్యవ్యంగ్యరీతుల నట్టి భావముల నాయోజించునపుడు కవికి నవధానాధిక్య మావశ్యకము. కవితాసారసంగ్రహతత్పరుఁడైన పాఠకునకుఁగూడ విశేష ప్రణిధాన మత్యావశ్యకము. ఏ కవి కూర్చిపెట్టినను శృంగార భావానుసంధానము పాఠకున కధికోల్లాససంపాదకము. కావు ననే శ్రీనాథుని చాటువులఁగూర్చి యెఱుఁగని తెలుఁగుపాఠ కులు నాఁడును నేఁడును గూడఁ గానరారు.

శ్రీనాథుని రచనాశిల్పము విలక్షణమైనది. ఆ శిల్ప మాతని చాటువులలోఁ గూడఁ గానవచ్చును. ఇతర కవుల చాటువులవలెఁ గాక వానిలో నొక ప్రత్యేకత గలదు. ఆతని నాఁటి దేశకాలపరిపాటులు దేశసంచారమునం దాతని కేర్ప డిన యనుభూతులు, కాన్పించిన మధురదృశ్యములు, చారి త్రకసత్యములు నం దభివ్యక్తమగుచుండును. ఇట్టి ప్రత్యేక తతోఁగూడి నిర్వివాదముగ శ్రీనాథునివియే యనుకొనఁదగిన చాటువులను నా యూహాపోహమునంతకు విభాగించి వివ రించిన నాతని కవితాశిల్పము నిష్కలంకమై యెసలారును. శ్రీనాథుని శృంగారిగా భావించునాఁ డసభ్యశృంగార పద్యములన్నియు నాతని కంటఁ గట్టఁబడినవి. నాఁడును నేఁడును గూడ నిట్టి రచనల నితరుల కంటఁగట్టు కుతూహ లము పెక్కుర కేర్పడియే యున్నది. అట్టి కుతూహలపుర స్కృతమైన సందర్భమే శ్రీనాథుని చాటువు లనుపేర నట్టి శృంగారభావసమన్వితమైన పద్యములు కూడ నా సంచయ

ములోఁ జేరుటకు మూలమైనది. ఈ చాటుపద్యములలోఁ గొన్నిటితో తొలుత 'శ్రీనాథుని వీథినాటకము – శృంగార పద్యములు' అను చిన్న పొత్తమొకటి వెలువడినది. ఆ పద్య సంచయమునే యీ పేరితోనే కొలఁది మార్పుతో వావిళ్ల వారు ముద్రించియున్నారు. పిమ్మట వీనిలోఁ గొన్నిటిని వదలి మఱికొన్నిటినిగూర్చి కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్యమణిమంజరిలోను క్రీడాభిరామము పీఠికయందును ప్రకటించియున్నారు. ఈ తీరుగ ముద్రితమైన యీ గ్రంథము లన్నిటిలో శ్రీనాథుని రచనలు కానివికూడ చేరెననుట నిర్వివాదవిషయము. ఆంధ్ర సాహిత్య పరిషత్తునందలి యొక తాటియాకు ప్రతిలో చమత్కారపద్యమంజరి యనుపేర వ్రాసికొనిన వ్రాఁతలో 'శ్రీనాథుని వీథినాటకము' అని యీ చాటువులలోఁ గొన్ని వ్రాసియున్నవి. శ్రీనాథుని చాటువులలో శృంగారమతిమాత్ర మని ఆంధ్ర పాఠకలోకము నం దొక కింవదంతి కలదు గాని, వానిలో నాతఁడు గ్రథించి పెట్టిన భావసమృద్ధి పెక్కురకు దుర్బోధముగనే యున్నది. అట్టి యీ చాటువులకుఁ గొంత వివరణము గావించిన నాతని రచనాశిల్పము కొంత మనసునకుఁ బట్టినచో నాతని శృంగారిగా భావించుటకు సహృదయులకు సాహసము పొడ తేరదు. ఆ యూహతోడనే యాతని చాటువులకుఁ గొంత వివరణము సేయుట కుపక్రమము గావించితిని. సహృదయులయిన పాఠకులు సావధానమతితోఁ దిలకించెదరు గాక.

శ్రీనాథుఁడు విజయనగరమున కేఁగి, యచటఁ బ్రౌఢ
దేవరాయలసభలో గౌడడిండిమభట్టారకునితో వాగ్వాదము
నెఱపి, యాతని కంచుఢక్క పగులఁగొట్టించి, ముత్యాల
శాలలో స్వర్ణస్నాన మాచరించి, కవిసార్వభౌమబిరుదము
గైకొని యటనుండి రాచకొండ రాజధానిగాఁ బాలించు
చున్న సర్వజ్ఞ సింగభూపాలుని దర్శించినట్లు, లాతని సభలోఁ
గావించిన శారదాస్తుతిరూపమైన యీ క్రిందిచాటువు
చాటుచున్నది.

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పలు[1]కు తోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకుఁ
బగులఁగొట్టించి తుద్భటవివా[2]దప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూ[3]షక్రియాశక్తి రాయాలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద

మెటులు మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసిం[4]గమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెఱకొనియుండి నీవు
సకలసద్గుణనికురుంబ శారదాంబ!

శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమును రచించి, రాజ
మహేంద్రవరరాజ్యపాలకు లైన అల్లాడ వేమవీరభద్రారెడ్లకు

---

1. వాక్కు, 2. వినోద, 3. శేఖర, 4. సింగన్నభూపాలు.

మంత్రియగు బెండపూఁడి యన్నమంత్రి కాప్రబంధమును కృతిగా నిచ్చినను నా యాస్థానిలో స్థానము లభింపదయ్యెను. దానితో నాతఁడు విజయనగరసామ్రాజ్యమును బాలించు ప్రౌఢదేవరాయలసభలోఁ బ్రవేశము కలిగింపఁజేసికొని, వారి యాస్థానమునఁ బ్రధానవిద్వాంసుఁడు కవిసార్వభౌమ బిరుదాంకితుఁడు నగు గౌడడిండిమభట్టారకుని వాగ్వాదమున నోడించి, యాతని విజయడిండిమమును బగులఁగొట్టించి, దీనారములు టంకములు నను బంగారునాణెములతో ముత్యాలశాలలో స్వర్ణాభిషేకము నంది, చంద్రభూష క్రియాశక్తిరాయుల సముఖమున సార్వభౌమబిరుదము స్వీక రించి, యటనుండి రాచకొండకు వచ్చి రావు సింగభూపాలుని దర్శించినట్టు లీపద్యము తెలుపుచున్నది. శ్రీనాథునకు విజ యనగరాస్థానిలో జరిగిన గౌరవప్రాభవము లీపద్యము వివ రించినది. ఈవిషయమును కాశీఖండమునందలి యీక్రింది పద్యములోని యంశము తార్కాణించుచున్నది.

> కర్ణాటక్షితిపాల మౌక్తికసభాగారాంతరాకల్పిత
> స్వర్ణస్నాన గతిప్రసిద్ధకవిరాట్సంస్తుత్యచారిత్ర ! కాశీ. 7-265.

శ్రీనాథునకు స్వర్ణాభిషేకముతోఁగూడ కవిసార్వ భౌమబిరుదము ముత్యాలశాలలో లభించుటకుముందు సభా ప్రవేశమునకు మిక్కిలి శ్రమపడవలసి వచ్చినట్టు లీక్రింది చాటువులు చాటుచున్నవి.

---

1. జగత్.

శా. కుల్లా2 పెట్టితిఁ గోకసుట్టితి మహోకూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిం దిలపిష్టము న్మెసవితిన్ విశ్వస్త వడ్డింపఁగాఁ
జల్లా యంబలిఁ ద్రావితిన్ రుచులు దోసం బంచుఁ బోనాడితిన్
తల్లీ! కన్నడరాజ్యలక్ష్మీ! దయలేదా నేను శ్రీనాథుఁడన్.

శ్రీనాథునినాఁడు కన్నడరాజ్యమనఁగా విజయనగర సామ్రాజ్యమే. ఆరాజ్యరమను శ్రీనాథుఁడు జాలిగాఁ బ్రార్థించినట్లు లీపద్యము తెలుపుచున్నది. వైదికాచారసంపన్నుఁడైన శ్రీనాథుఁడు రాజసభాప్రవేశమునకై నిరీక్షించు సమయమున శాస్త్రనిషిద్ధములైన కృత్యము లాచరించినను ఫలము చేకుఱ లేదని పశ్చాత్తప్తుఁ డయ్యె ననుట నీపద్యము తెల్లము సేయుచున్నది. అప్పటి ప్రౌఢదేవరాయల సభలో గౌడడిండిమభట్టారకుఁ డాస్థానకవియుఁ బ్రధానపండితుఁ డునై యుండి, శ్రీనాథుఁ డీపద్యమునఁ దెలిపిన వేషము దాల్చి, తత్సమానవేషధారులకుఁ గాని సభాప్రవేశము లేకుండఁ జేసియుండును. తన్నిర్వహణమునకై శ్రీనాథుఁడు తలపై టోపి పెట్టి, యామీఁద పాగా చుట్టి పొడవైన చొక్కా తొడిగియుండును. ఇట్టి వేషధారణ మంతయు వేదోక్తధర్మాచరణనిష్ఠులకు శాస్త్రనిషిద్ధము. నేఁటికంటె నానాఁడు ధర్మాచరణపరాయణు లాహారస్వీకారమునెడ ధర్మశాస్త్రోక్త నియమములను హెచ్చుగఁ బాటించుచుండెడివారు. వెల్లుల్లి నుపయోగించుట తెలికపిండి తినుట యను నీరెండును

---

2. కుల్లాయుంచితి.

ధర్మశాస్త్రనిషిద్ధములే. ముత్తైదువులు గాక విధవలు వండి వడ్డించిన వంటకము లాహారించుటయు ధర్మశాస్త్రనిషిద్ధమే. వెల్లుల్లి వేసిన తెలికపిండికూర విధవ వడ్డింపఁగా దినవలసి వచ్చుట దోషత్రయజుష్టము. అట్టి దోషజుష్టకృత్యము లాచరించుట దనకుఁ దటస్థించెనని యీతఁడు విలపించినాఁడు. ఇఁక నచటి యునికిలో రుచ్యమైన యాహారము లభింపక అంబలిలోఁ జల్లఁ గలిపి త్రాగవలసివచ్చిన దనియుఁ దెలిపినాఁడు. ఈచాటువు శ్రీనాథునినాఁడు విజయనగరపరిసరములందుండెడి బ్రాహ్మణగృహములందలి భోజనపరిపాటి నెఱిఁగించుచున్నది. వైదికాచారనిరతుల కట్టి శాస్త్రనిషిద్ధమైన యాహారస్వీకార మెంతటి క్లేశమును గలిగించెనోయను విషయమునుగూడఁ దెల్లముచేసినది. ఈవిధముగ నిషిద్ధభోజనాదికము నాచరించుచు నిరీక్షించుచుండినను సభాప్రవేశము దుర్లభమయ్యె ననువిషయముకూడ నీపద్యమునందు సూచితమైనది.

ఈక్రింది చాటువును బరికించినను శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయసభాప్రవేశమునకుఁ గొంత శ్రమపడినట్టులే తోఁచుచున్నది.

సీ. పంపావిరూపాక్ష బహుజటాజూటికా
 రగ్వధ ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా
 గంభీర ఘుమఘుమారంభములకు

కళిసాపురప్రాంత కదళీవనాంతర
 ద్రాక్షాలతాఫల స్తబకములకు
కర్ణాటకామినీ కర్ణహాటకరత్న
 తాటంకయుగ ధాళధళ్యములకు

నిర్నిబంధనిబంధమై నెనయు కవిత
తెలుఁగునను సంస్కృతంబునఁ బలుక నేర్తు
ప్రౌఢదేవేంద్రరాయభూపాలవరుని
సమ్ముఖంబున దయచూడు ముమ్మసుకవి.

పంపాసరోవరతీరమునందు నెలకొనియున్న విరూపాక్షస్వామి జటాజూటమునం దలంకరింపఁబడిన జేలపూవుల పరిమళములకు, తుంగభద్రానదీతరంగముల గంభీరఘుమఘుమధ్వనులకు, కళాసాపురపరిసరములందు సమృద్ధములై యుండిన యరఁటిపండ్లయు ద్రాక్షపండ్లగుత్తులయు మాధుర్యమునకు, కర్ణాటస్త్రీలు చెవులఁ దాల్చిన బంగారుకమ్మల తళతళలకు సాటియైన కవిత్వమును తెలుఁగునను సంస్కృతమునను నిరాఘాటముగఁ జెప్పనేర్తును. ఇట్టి నన్ను ప్రౌఢదేవరాయలసభలో నా ప్రభువునెదుటఁ గవిత చెప్పువానిగ దయఁజూడు మని శ్రీనాథుఁడు ముమ్మకవిని బ్రార్థించినట్టు లీ పద్యము తెలుపుచున్నది. ఈ ముమ్మకవి యంతకు మున్నే ప్రౌఢదేవరాయల యాస్థానిలోఁ గవిగా నుండియుండును. కవిసార్వభౌమ బిరుదాంకితుఁడై వంశక్రమముగ విద్యానగర రాజాస్థాన కవిపండితుఁడైన గౌడడింఢిమభట్టారకుని బ్రాభవమున శ్రీనాథునకు ప్రౌఢదేవరాయల యాస్థానిలో సభా

ప్రవేశము లభింపనినాఁడు శ్రీనాథుఁ డీ ముమ్మకవిని, దనకు రాయసభాప్రవేశము గలుగఁజేయు మని ప్రార్థించియుండును. ఈ పద్యమున నాఁటి విద్యానగరపరిసరవిభవ మెంతయు హృద్యముగఁ జిత్రింపఁబడినది. ఆ ప్రాంతమునందలి పుష్ప ఫలసమృద్ధి యిందు ప్రదర్శితమైనది. ఈ రచనలో శ్రీనా థుని కవితాశిల్పము ప్రస్ఫుటమైనది.

ప్రౌఢదేవరాయసభలో శ్రీనాథుఁ డీక్రిందిపద్యములు సంతరించినట్టులు చూపట్టును. ఇవి శ్రీనాథునిరచనలుగనే తోఁచును.

సీ. డంబు సూపి ధరాతలంబుపైఁ దిరుగాడు
కవిమీఁదఁగాని నాకవచ మేయ
దుష్ప్రయోగంబుల దొరకొని చెప్పెడు
కవిశిరస్సునఁగాని కాలు చాఁప
సంగీతసాహిత్యసరసవిద్యల నేర్పు
కవుల రొమ్ములఁగాని కాల్చి విడువ
చదివి చెప్పఁగ నేర్చి సభయందు విలసిల్లు
కవినోరుగాని ప్రక్కలుగఁ దన్న

దంటకవులకు బలువైన యింటిమగఁడఁ
గవులవాదంబు విన వేడ్క గలిగి నేని
నన్నుఁ బిలిపింపు మాస్థానసన్నిధికిని
అక్షణోపేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర!

సీ. కమనీయకరపల్లవము మేను గదియంగ
నొయ్యనఁ జాఁచిన నులికిపడును

ఆలింగనము నను నక్కు వఁ జేర్చినఁ
జేదోయి యురముపైఁ జేర్చుకొనును
చుంబనమ్మున నోష్ఠబింబంబు గమకింప
నదన మొయ్య నొకింత వంచుకొనును
గిలిగింత సేఁతకుఁ గినుకయు సిగ్గును
మొలకంగఁ గన్నులు మోడ్చుకొనును

అట్టి బాల రతిక్రీడ ననువుపఱుప
నేర్పు గలుగునె పరులకు నీకుఁగాక
రాజపరమేశ! రాజాధిరాజవిభవ!
లక్షణోపేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర!

మ. జననాథోత్తమ! దేవరాయనృపతీ! చక్రేశశ్రీవత్సలాం
ఛనసంకాశ! మహాప్రభావ! హరిరత్నాదత్త! నాబోఁటికిఁ
గునృపస్తోత్రసముద్భవం బయిన వాగ్దోషంబు శాంతంబుగాఁ
గనకస్నానము చేసిగాక పొగడంగా శక్యమే దేవరన్?

శా. జోటీ! భారతి! యార్భటి న్మెఱయుమీ; చోద్యంబుగా నేను గ
ర్ణాటాధీశ్వరుఁ బ్రౌఢదేవనృపతిన్ నాసీరధాటీచమూ
కోటీఘోటకధట్టికాఖురపుటీకుట్టాకసంఘట్టన
స్ఫోటీధూతధరారజశ్చుళికితాంభోటిన్ ప్రశంసించెదన్.

ఈతీరుగ శ్రీనాథుఁడు పడరాని పాట్లుపడి, తుది కెట్టులో సభాప్రవేశము నంది, వాగ్వాదమున గౌడడిండిమభట్టారకు నోడించి యాతని విజయడిండిమము మోఁత నణగించి, కనకాభిషేకపురస్కృతముగఁ గవిసార్వభౌమబిరుదము నందఁగలిగినాఁడు. ఇది యంతయు సరస్వతీ కరుణాకటాక్షముగా నెఱిఁగించుచు, ధీమంతుఁడగు నీరావుసింగమహీపాలు

నెదుట నన్ను నెట్లు గడితేరఁ జేసెదవో? యని శ్రీనాథుఁ డాయమ్మను బ్రార్థించె నని 'దీనారటంకాలఁ దీర్థ మాడించితి' ఇత్యాది పద్యము తార్కాణించుచున్నది.

శ్రీనాథుఁడు విజయనగరమునకుఁబోయి తన కవితా ప్రసారమున నచటి పాఠకశ్రోతృహృదయమును వికసింపఁ జేసి సార్వభౌమ బిరుదము నార్జించి యుండె ననుటకు 'సకల కర్ణాటదేశ కటక పద్మ వనహేళి శ్రీనాథ పట్టపహాళి' యను కాశీఖండవచనము నిదర్శనము. శ్రీనాథుఁడు రసార్ణవ సుధాకరాది గ్రంథకర్తయు, విశ్వేశ్వర కవిచంద్రాది సమాశ్రయణీయుఁడు నగు సర్వజ్ఞ సింగభూపాలుని స్తుతించుచు నీ క్రింది పద్యము నుడివినట్లు వినవచ్చుచున్నది.

క. సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును దక్కొరు
సర్వజ్ఞం డనుట కుక్క సామజ మనుటే.

శ్రీనాథుఁ డీపద్యమును సింగభూపాలుని స్తుతికై రచించినట్టులు విని, రెడ్డిరాజులు మాకుఁ బ్రతిపక్షులైన వారిని నీ విట్టు లేల పొగడితివి? అని యడుగఁగా, నీ పద్యమునకే "సర్వజ్ఞనామధేయము శర్వునకే; రావుసింగజన పాలునకు ఏయుర్విన్ చెల్లును?" అని విభాగము చేసి, మీ ప్రతిపక్షుల నేను బొగడలే దని తెలిపినట్టు లైతిహ్యము. ఈ రెండు పద్యములు శ్రీనాథుని రచనలుగా వెలుగోటివారి

వంశావళిలోఁ గానవచ్చుచున్నవి. ఆ వంశమునఁ బ్రసిద్ధు లయిన ప్రభువులనుగూర్చి బట్టులు కూర్చిపెట్టిన పద్యము లివి. ఇట్టి యీ పద్యసంచయమునందే యీ క్రింది పద్యము కూడ శ్రీనాథుని సమస్యాపూరణపద్యముగా నవతరించినది. ఆ సర్వజ్ఞసింగమనేని యాస్థానిలో నుండెడి బట్టొకఁడు శ్రీనాథునకు 'కుక్కవా ? నక్కవో ? ఫణివా ? క్రోఁతివా? పిల్లివా ? బూతపిల్లివో ?' యని సమస్య నీయఁగా దాని నాతఁడీ క్రిందివిధముగఁ బూరించె నఁట.

ఉ. తక్కక రావుసింగవసుధావరుఁ డర్థుల కర్థ మిచ్చుచో
దిక్కుల లేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమ్రాఁకుఁ బెం
పెక్కిన కామధేనువు శిబీంద్రుని సెన్నుదు బట్ట దిట్టవై
కుక్కవా? నక్కవో? ఫణివా? క్రోఁతివా? పిల్లివా? బూతపిల్లివో?

ఈ పద్యము శ్రీనాథుని రచనమాత్ర మెన్నఁటికిని గానేరదు. దీనిలో కల్పనాచమత్కార మేపాటియు లేదు. శైలీపరిణతియుఁ గానరాదు.

ఈక్రిందిపద్యములు రెండును సాంపరాయని తెలుంగు రాయనిఁగూర్చి చెప్పిన చాటువులుగాఁ బ్రసిద్ధములు. వీనిలో మొదటిది యాతనికిఁ గూర్చిన యాశీర్వచనము. రెండవ దాతనిఁ గస్తూరీదానము సేయు మని యాచించుటను దెలుపునది. ఈ తెలుంగురాయఁడు ప్రౌఢదేవరాయని దళవాయిగాఁ దెలియవచ్చుచున్నాఁడు.

శా. ఘాటీఘోటకరత్న ఘట్టనమిళ ద్ధాత్రీస్ఫుర[1]ల్యాణ ఘం
టాటంకార విలుంఠలుంఠన మదోన్మత్తాహితక్షోణిభృ
త్కోటీరాంకిత కుంభినీధర సమి[2]త్కూటాటవీఝాట! క
ర్ణాటాంధ్రాధిప! సాంపరాయని తెలుంగా! నీకు బ్రహ్మాయువౌ.

సాంపరాయని తెలుంగురాయఁడు దాడి బయలు దేఱఁగా, నాతని యశ్వరత్నములు శత్రుపక్షమునందలి యశ్వములపైఁ బడినపుడు పొడవైన జీను లొండొంటిని రాపాడ ఘంటాటంకారములు రేగుచుండ, శత్రుశిరఃఖండనము జరుగఁగా, శిరములమీఁది కిరీటములు పర్వతశిఖరారణ్యప్రదేశములఁ బొరలాడుచుండును. అట్టి శౌర్యాటోపముగల తెలుంగురాయా ! నీకు బ్రహ్మాయు వగుఁగాత మని యాతని నాశీర్వదించినాఁడు. ఇది రౌద్రరసోచితపదబంధముతో నారభటీవృత్తిలో నడచిన రచన. ఈవిధముగ నాశీర్వాదముసేసి యా వెనుక నా తెలుంగురాయని కస్తూరీభిక్షాదానముసేయు మని యీక్రిందివిధముగఁ బ్రార్థించినాఁడు.

శా. అక్షయ్యంబుగ, సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము సేయురా సుకవిరాడ్బృందారకశ్రేణి[3]కి
ద్దక్షారామపురీవి[4]హారవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్.

సాంపరాయని తెలుంగురాయా ! సత్కవీంద్రదేవతా బృందమునకు కస్తూరీభిక్షాదానము సేయుమయ్యా ! నీవి

1. కల్యాణ, 2. సము, 3. స్వామికిఁ, 4. చళుక్యభీమవర.

చ్చిన యీ కస్తూరీ పరిమళములు, దక్షారామపురీవిహారుఁ డైన భీమేశ్వరుని సేవించు గంధర్వాప్సరోజాతివనితల వక్షోజము లనుకుంభికుంభములమీఁద గుబాళించును — అని యీ పద్యభావము.

ప్రాచీనపుఁబ్రతులలో నీపద్యపాఠ మిట్టులే యున్నది. దీనిలో 'శ్రేణికిన్' అనుచోట 'స్వామికిన్' అనియు, 'పురీవిహారవర' అనుచోట 'చళుక్యభీమవర' అనుపాఠములు గూర్పఁబడినవి. తన్మూలకముగ శ్రీనాథుఁడు, దాక్షారామ భీమవరగ్రామములలోఁ దనవేశ్యలయొడల్లఁ బూయుటకు తెలుంగురాయని కస్తూరిభిక్షాదానము సేయుమని యాచించె ననియు, దీనివలన నాతని వేశ్యాలోలత వ్యక్తమయిన దని కొంద ఱూహచేసియున్నారు. కాని యట్లూహించుట కీపద్యమునం దవకాశము లేదని నామనవి. ఈపద్యము శ్రీనాథుని దగుటలో సందియము లేదు. ఆతని రచనాముద్ర దీని కేర్పడియే యున్నది. శ్రీనాథుని భావనలో దక్షారామ రామాజన మంతయు భీమేశ్వరసేవకై సముపలబ్ధజన్మముగల దేవగంధర్వాప్సరోజాతి వనితాసమితియేగాని, మానవభామినీజన మేమాత్రముగాదు. దక్షారామమునఁగాని, చాళుక్యభీమవరమునఁగాని, పరమేశ్వరసాన్నిధ్యము తత్సేవాక్రమముగల భామినులను భీమేశ్వరపురాణమునం దెచట వర్ణించినను దేవగంధర్వాప్సరోజాతి వనితలనుగానే చిత్రించియున్నాఁడు. ఆవనితలు భీమనాథునకు సర్వకాలములందును చామరవ్య

జనవీటికాకరండ పాదుకా ముకుర దీపికా ద్యుపచార సేవా విశేషంబులను ప్రతిసంధ్యంబును బల్యంకికా సేవా బహిర్విజ యాది భోగావసరంబులను సేవించుచుండుదురఁట. భీమ నాథునకు నెఱపు వివిధ సేవావసరములయందును దేవగంధ ర్వాప్సరోభామినీసాన్నిధ్య ముండుటచే, కవిరాజుల కర్పిం చిన కస్తూరి భీమేశ్వరవినియుక్తమై తత్పరిమళము లావనితల కుచకుంభములపై గుబాళించు ననువిషయ మీపద్యమును బట్టి తెలియవచ్చుచున్నది. భీమనాథసేవాసముపలబ్ధజన్మ లైన యీదేవవేశ్యలు దేవతోపభోగయోగ్యలు గావలయు నట్టులే గాని, మానవోపభోగయోగ్యలై యుండినట్టులు శ్రీనా థుని రచనాపద్ధతినిబట్టి యెచ్చటను దెలియవచ్చుట లేదు. అట్టితఱి శ్రీనాథునకు దాక్షారామ చళుక్యభీమవరగంధర్వా ప్సరోజాతి వనితాతతితోఁ జెలికార మేర్పడియుండుటచే వారి యొడళ్లపై గుబాళింపఁజేయుటకు కస్తూరిని యాచించి యుండు ననుట యెట్లూహింపవగునో ? తెలియరాకున్నది. ఈపద్యమునఁ గవిరాజు కలఁడఁట! దక్షారామచళుక్యభీమవర వాసినులైన వేశ్యలు గలరఁట. వారి కుచకుంభములపై కస్తూరీవాసనలు తాను గుబాళింపఁజేయుటకై తెలుంగు రాయనిఁ గస్తూరీదానము సేయుమని శ్రీనాథుఁడు భిక్షించె నఁట. ఇది యెంతటి యవిచారితరమణీయమైన సమన్వ యమో యెఱుఁగరాకున్నది. తన భావనామయమైన నిర్మా ణమునంతను బరమేశ్వరార్చనకళనుగాఁ బరిణమింపఁజేసిన

శ్రీనాథునకు వేశ్యాలోలత నంటఁగట్టుట కీచాటువు నుప యోగించుటకు సహృదయులైనవా రంగీకరింప రనియే నా యూహ.

ప్రాచీనమైనవ్రాఁతలలో 'దక్షారామపురీవిహారవర' అనుపాఠ ముండఁగా దానిని 'దక్షారామచళుక్యభీమవర' అను పాఠముగా మార్చుటకుఁ గారణము లేకపోలేదు. ఈతీరయిన క్ష కారప్రాసముగల పద్యమొకటి కాశీఖండమునఁ గలదు. అందును దక్షారామ చళుక్యభీమవరగంధర్వాప్సరోభామి నులు ప్రసక్తులైనారు. తన్మూలకముగ నిచటిపాఠ మీతీరుగ మాఱినది.

శా. ఈక్షోణి న్నినుఁబోలు సత్కవులు లే రీనేఁటి కాలంబునన్
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించుం గవిసార్వభౌమ! భవదీయ ప్రౌఢసాహిత్యముల్.

— కాశీ. 1-15.

ఈ కాశీఖండపద్యము శ్రీనాథుని కవితావిభవము నుగ్గడించుట కుపక్రాంతమైనది. కవిసార్వభౌముని ప్రౌఢ సాహిత్యము దాక్షారామచళుక్యభీమవర గంధర్వాప్సరో భామినుల వక్షోజద్వయచర్చితమైన మలయజ కాశ్మీరము లతో స్పర్ధ వహించు ననినాఁడు. మలయజ కాశ్మీరాదిచర్చిత మైన గంధర్వాప్సరోభామినీ వక్షోజములందలి సౌరభ సౌం దర్యకాఠిన్య సౌకుమార్యాది సమన్వయము కవిత్వమున కా

యోజించుట కీవిధమైన భావసంయోజనము గావింపఁబడి నది. శబ్దసామ్యమునుబట్టి యీచాటువులో నిట్టి భావసమన్వయము సేయుట యెంతమాత్రము సరిపడ దని నామనవి.

(శ్రీ)నాథునిచాటువుగాఁ బెక్కులాక్షణిక గ్రంథములందు దడలకు ప్రాససమన్వితికి లక్ష్యముగా నీయఁబడిన దీక్రిందిపద్యము.

ఉ. కందుకకేళి సల్పెడి ప్రకారమునం బురుషా[1]యితక్రియా
తాండవ మొప్పఁ జల్పెడివిధంబునఁ బామరభామ లేఁతసీ
రెండఁ బ్రభాతవేళ రచియించెను గుబ్బలమీఁదిహారముల్
కుండలముల్ కురుల్ కదల గోమయపిండము లింటిముంగటన్.

ఒకపామరభామ, ప్రాతఃకాలమున లేఁతసీరెండలు తనమీఁదఁ బడుచుండ నింటిముంగిట పేడముద్దలు చేయుతీరిందు చిత్రితమైనది. ఆమె యీపేఁడముద్దలుచేయుటలో హస్తచాలనమున బంతులాట యాడుచున్నటులుండెను. పేడముద్దలు చఱుచుటలోని శరీరముకదలిక పురుషాయితమును నటించుచున్నటులుండెను. ఆపని సెఱపుటలో నామె వక్షోజములమీఁది హారములు చెవులఁ బెట్టినకుండలములు కురులు కదలాడుచుండెను. ఆకదలికలు పురుషాయితాభినయమునకు స్ఫోరకములు. ఈపద్యమునందు భావనామధురమైన దృశ్యమొండు వెలార్పఁబడినది. పురుషాయితము నుపమానముగాఁ బేర్కొనినంతమాత్రమున నిచట నసభ్యత గలదని

1. ఘనపేషణం.

యెంచుట సహృదయలక్షణము గాదు. ఇట్టి వర్ణనము కావ్య రచనాసంప్రదాయమునకు విరుద్ధము గాదు.

దీనితరువాతిచాటువులలో నానాజాతివనితలసౌందర్య విశేషములు తత్తత్స్వభావచేష్టాదికము నిరూపితమైనది. శ్రీనాథునికవితాశిల్పమునఁ బ్రతిఫలించుమూర్తులలోఁ గాన వచ్చెడి విశేషములు నాఁటికి నేఁటికి సరిపడియే యుండును.

విప్రవనిత—

చ. గురుకుచము[2]ల్ ప్రియోక్తులును గ్రొమ్ముడియు న్నిటలాలకంబులున్
మురిపెపుమాటలు న్నగవు ముద్దుమొగంబును గల్గుఁగాని యా
సురతపునేర్పుమాటలును సూక్ష్మవిభీషణభాషణంబులున్
బరువడితో విభుం గవయుభావము పుట్టదు విప్రభామకున్.

ఈచతుర్జాతివనితల భావచేష్టానిరూపణక్రమములోఁ గామశాస్త్రసమ్మతమైన పద్ధతి యంగీకరింపఁబడినది. విప్ర వనితకుఁ బెద్దవౌ వక్షోజములు, తీయనిపలుకులు, అందముగఁ గొప్పు పెట్టుకొనుతీరు, నుదుటఁ జిందులాడు ముంగురులుఁ గలిగి నవ్వులు గులికెడి ముద్దుమొగము జతగూడియుండును. కాని ప్రియునితో సమాగమమున కనువైన మాటలనేర్పు, సన్నసన్నగ బెదరింపుసంభాషణము, విభుని గూడుటకుఁ దగిన భావావేగము నుండవు. వీనిలోఁ గొన్ని బ్రాహ్మణస్త్రీలలో సహజముగనే నిలిచియున్నవి.

---

2. గురుతరమౌ.

క్షత్త్రియవనిత—

చ. గురుకుచయుగ్మ[1] మాననము కోమలికంబులు ముద్దుమాటలున్
అరచుట లతిప్రసంగములు నప్పటనప్పట కేళిమాట లం
తరితకళానిధానమునఁ దాడనపీడనభాషణంబులన్
బరువడి నొందఁజేర్చు ప్రియభాషలుఁ గల్గు నరేంద్రభామకున్.

పెద్ద వైనపాలిండ్ల జంట, ముఖసౌకుమార్యము, ముద్దుమాటలు, అరచుట, అధికప్రసంగములుసేయుట, అప్పటప్పట వేళాకోళములు సేయుట, మరుఁగువడియున్న కళాస్థానమునందు కొట్టుట, మర్దించుట, ఆస్థానవికాసమున కనుకూలమైన సంభాషణము జరుగుట మున్నగునవి గావించిన వెనుకఁ గ్రమముగఁ బ్రియుని గవఁగూడుట కనువైనప్రియభాషణములు క్షత్త్రియవనిత కమరియుండును.

వైశ్యవనిత—

చ. పురుషుఁడు గూడువేళఁ బెడబుద్ధులు సుద్దులు కానిచేఁతలున్
సరగున మేనికంపు చెడుచందపురూపము సేహ్యవస్త్రమున్
బరగు నిరంతరంబు నెడఁబాయని సౌఖ్యము లేని ప్రేమయున్
విరహపుఁజూడ్కులున్ లమ్మలిక వీసము బొల్లులు వైశ్యభామకున్.

వైశ్యభామకుఁ బురుషుఁడు తన్నుఁగూడుసమయమున నితరమైన యాలోచనలు, ఇతరప్రసంగములు, కూడని పనులు, మీఁదికి గప్పునరేగు నొడలికంపు, అందవికారమైన యాకారము, మలినమైన బట్టలు, ఎప్పుడు విడిచిపెట్టని సౌఖ్యములేని ప్రేమ, విరహము నభినయించుచూపులు, కొలఁదిపాటి యోడుపు, బొల్లిమాటలు నమరియుండును.

శూద్రవనిత—

చ. వరగంభీరపయోధరంబులు2 గుణాభావప్రవీణత్వముక్
అరవిందాస్యసుగంధగంధపటువేణ్యత్యంతసౌందర్యము
ద్ధరతంద్రాణవివేకసంపదయు మాధుర్యాతిగాంభీర్యముం
దరుణీరత్నము శూద్రభామగుణముల్ తథ్యంబె వర్ణింపఁగన్.

చక్కని చిక్కని యురోజములు. మంచిగుణముల ట్రోవకుఁ బోని నేర్పరితనము, పద్మమువంటి ముఖము, పరిమళసమ్మిళితమై ఘనమైన కీల్జడ యందము, సమర్థమైనను నిద్రించునట్టి వివేకసంపద, తీయందనము, మంచిగాంభీర్యము స్త్రీరత్నమైన శూద్రభామగుణములై యొప్పును. వర్ణింపఁజొచ్చినచో శూద్రభామ కీగుణము లన్నియు యథార్థముగా జతఁగూడియుండును.

ఈక్రిందిచాటువులు సింహాచలయాత్రకు వచ్చెడి వివిధ స్త్రీల సౌందర్యవర్ణనపరములు. ఈవర్ణనము సింహాచల నృసింహస్వామి తిరునాళ్లసందర్భమునందలిది గావచ్చును.

ఆంధ్రనియోగిభామ—

సీ. హారినీలములకప్పు నణఁగించు నునుఁగొప్పు
విడి పువ్వుదండ దా వీడఁబాఱఁ
గోటిచందురుడాలు గోటుసేయఁగఁ జాలు
మొగముకుంకుమచుక్క సొగసు గులుక
నల జక్కవలజిక్కు లణఁగఁద్రొక్కఁగ నిక్కు
పాలిండ్లపై నాఁచుపైఁట జాఱ

2. మనోరథంబులు.

నిసుకతిన్నెల మెట్టి పసిఁడి చెంపఁగొట్టు
పిఱుఁదుపై మొంటనూలు పెనుకఁబేఱ
జిగురుఁగెమ్మోవిఁ బగడంపుజిగియు మెఱయ
మాటలాడఁగఁ గన్దోయి తేటలలర
చెమట లూరంగ సింహాద్రి చేరవచ్చె
భోగగుణధామ యాంధ్రనియోగిభామ.

ఇంద్రనీలమాణిక్యముల నల్లనికాంతిని క్రిందు సేయు నున్ననికొప్పు విడిపోయి, కొప్పులోఁ బెట్టినపూలదండ విడి జాఱిపోఁగా, పూర్ణచంద్రుని బోలుముఖమున కుంకుమబొట్టు సొగసును గులికింపఁగా, చక్రవాకముల యతిశయము నణఁగింపఁజాలు పాలిండ్లపై నాఁగియున్న పైఁటచెఱఁగు జాఱిపోఁగా, ఇసుకతిన్నెలఁ దన్ను బంగారమును మించు పిఱుఁదు మీఁద నొడ్డాణము తళుకులీనఁగా, చిగురుటాకువలె నెఱ్ఱనైనమోవి (క్రిందిపెదవి) పగడపుఁగాంతులను వెలార్పఁగా, మాటలాడినఁ గన్నులజంట కాంతులఁ జిమ్మఁగా భోగగుణములకుఁ బుట్టినిల్లయిన యాంధ్రదేశమునకుఁజెందిన నియోగిభామ చెమటలు గ్రమ్మ సింహాచలమునకుఁ జేరవచ్చెనఁట. ఈపద్యమున నియోగిభామల కానాఁడు సహజముగ నేర్పడియుండిన సౌందర్యరేఖ, మార్గాయాసవశమున నేర్పడిన యవయవవిశ్లథత్వముగూడఁ జిత్రింపఁబడినవి.

క. బంగారువంటి మేనును
శృంగారము లొల్క కుల్క చిక్క నిచన్నుల్
బంగారపు నెఱచీరలు
చెంగటిచూపులు నియోగిచేడెల కమరున్.

ఈపద్యము శ్రీనాథునిరచన గాదు. పద్యమునడకలో బిగి లేదు. కల్పనాంశ మేమియు లేదు. పైపీసమునందలి భావమేగాని శ్రోత్రవిషయ మంతగ లేదు. బంగారుశబ్దము కూడ పునరుక్తమైనది. ఎవ్వరో బుద్ధిమంతులు దీనిని శ్రీనాథునిది గావించిరి.

వేపారిభామ—

శా. రాపాడంగల గుబ్బచన్నుఁగవతో రాకేందుబింబంబుకైఁ
మాపేఁదంగల ముద్దునెమ్మొగముతోఁ దోరంపుమైచాయతోఁ
జూపు[1] న్వద్దను బాలసంఘములతో సొంపారు లేనవ్వుతో
వేపార్యంగన వచ్చె కాసెబిగితో వేణీభరచ్ఛాయతోన్.

ఒకదానితో నొకటి రాపాడఁజాలు నెత్తయిన పాలిండ్లజంటతో, పూర్ణచంద్రబింబముతో డీకొనఁజాలు ముద్దులుగులుకు నందమయిన ముఖముతో, నున్నని శరీరకాంతితో సొంపుమీఱు చిఱునవ్వుతో జడముడికాంతితోఁ గూడి వేపారివనిత చీర గోచిపోసి కట్టుకొని వచ్చెను. వేపారిజాతి స్త్రీలు చీర గోచిపోసి కట్టుకొనుట యనునది చిరకాలముగాఁ బాటించు పరిపాటి. మిగిలినవి శేషము లన్నియు సౌందర్యాతిశయస్ఫోరకములు, ఈపద్యమున మూఁడవపాదమున కర్థము సరిగాఁ బొసఁగినట్లు గానరాదు. చూపును వద్దను ముంగురుల సమూహముతో ననునర్థమా? చూపును నిరోధించు ముంగురులసమూహముతో ననియా? చూడ ముద్దులుగులుకు

1. చూపున్వద్దన. చూపున్మద్దూ.

బాలురసమూహములో ననియా? లేక వేఱొకపాత్ర మేది యయిన నైయుండునా? కాని యీవిశేషముకూడ నంగ విన్యాసమునకు సంబంధించినదియే కావలయును.

ఈక్రిందిపద్యముకూడ వేపారివనిత సౌందర్యమును గూర్చినదియే.

సీ. విడినకొప్పున జాజివిరు లొప్పుగా రాల
      చి[2]ట్టి కుంకుమచుక్క బొట్టు చెదరఁ
జక్కఁగా బటువారు సంచెడు కుచ్చెళ్లు
      చెలఁగుమట్టియలపైఁ జిందులాడఁ
గోదముగుబ్బలఁ బైఁటకొంగు సయ్యన జాల
      ముక్కున త్తొకవింత ముద్దుగులుక
మొలగంట లిమ్ముగు మ్రోఁతతో రంజిల్లఁ
      గనకంపుటందియల్ గల్లురనఁగ
పొసఁగఁ గర్పూరవీడ్యము లొప్పొందుపఱచి
యనుఁగుఁజెలితో ముచ్చటాడికొనుచు
నలరుసింహాద్రిపై కెక్కె హర్షమునను
వచ్చెఁ గలకంఠి వేపారిముచ్చెకంటి.

విడిపోయిన కొప్పునుండి జాజిపువ్వులు రాలఁగా, నుదుటఁ దీర్చిన చిట్టి కుంకుమరంగు చుక్కబొట్టు చెదరఁగా, చక్కఁగా గుండ్రముగ మడిచిపెట్టిన సందెఁడు చీరకుచ్చెళ్లు కాలివ్రేళ్లకుఁ బెట్టినమట్టెలపై నాట్యము సేయఁగా, పటువైన యురోజములనుండి పైఁటకొంగు తటాలునఁ గ్రిందికి జాఱఁగా, ముక్కునఁ బెట్టిన నత్తొకవింతగా ముద్దులు గులి

2. చుట్టు.

కింప, మొలకుఁ బెట్టిన యొడ్డాణపుచిఱుగంట లింపైన మ్రోఁతతో నొప్ప, బంగారపుటందెలు కాళ్లను గల్లుల్లున మ్రోయుచుండఁగా, కర్పూరపుఁ దాంబూలము నోటఁ దాల్చి, వెంట వచ్చిన వెలఁదులతో ముచ్చటగా మాటాడు కొనుచుఁ గలకంఠియైన యొక వేపారిమచ్చెకంటి సింహాచలము నెక్కుటకు సంతోషముతో చేరవచ్చె నని భావము. ఈనాఁటికిని వేపారివనితలలో నీకట్టు బొట్టు జుట్టు యథాతథముగనే గానవచ్చును. భూషావిశేషములుగూడ నిన్న మొన్నటివఱకు నిలిచియే యున్నవి. శ్రీనాథుని నిశితసౌందర్య పర్యవేక్షణ కిచిత్రణ మొకనిదర్శనము.

అగసాలివన్నెలాడి—

క. అగసాలిది కాఁబోలును
సొగసైన మిటారిమోరచూపులతోడన్
జగమెల్లను వలపించుచు
మగటిమితో వచ్చెఁ బురముమార్గము వెంటన్.

అందమైనవిలాసములు కలదియై మోరచూపులతో లోకమంతయు వలపించుచు గండుతనముతో పట్టణమార్గముఁ బట్టివచ్చుచున్నది. ఈమె యగసాలివన్నెలాడి కాఁబోలును!

సీ. పాలుపొందగ విభూతిబొట్టు కనుబొమసలిపైఁ
దళుకొత్తఁ జెమట లుత్తలపడంగ
సొగసుగాఁ బూదండ జోపినకీల్గొప్ప
జాఱఁగా నొకచేత సరుదుకొనుచు

బిగిచన్నుఁగవమీఁద బిగుసుపయ్యెద చెంగు
    దిగజాఱి శివసూత్ర మగుపడంగ
ముక్కున హురుమంజిముత్యాలముంగర
    కమ్రవాతెఱమీఁద గంతు లిడఁగఁ
గౌను జవ్వాడ మట్టియల్ గదిసి మ్రోయఁ
గమ్రవిలుకాని జాళువాబొమ్మ యనఁగ
మెల్ల మెల్లన సింహాద్రిమీఁది కేఁగె
కన్నెపూఁబోఁడి యగసాలికన్నెలాడి.

శ్రీనాథుఁడు తత్తజ్జాతివనితలలో నొకవిలక్షణమైన సౌందర్యరేఖ పరికించి దానిని దనకవితాఫలకమునఁ జిత్రించును. సన్ని వేశ మొక్కటియే యయినను వర్ణింపఁజూచు విషయమునఁ బ్రత్యేకత లేనిదే పద్యము మొలతేరదు. మెల మెల్లఁగ సింహాచలముమీఁదికి వచ్చెడి యగసాలివన్నెలాడి సౌందర్యరేఖాచిత్రణ మిది. ఆకన్నె నెన్నొసట (లలాట మధ్యమున) నందముగ విభూతిబొట్టు పెట్టినది. మూర్ధాయాస మునఁ జెమట పొడమి యాబొట్టు కరగినది. సొగసుగాఁ బూదండ జొనిపినకొప్పు జాఱిపోవ నొకచేతితో నాకొప్పు సరుదుకొనుచున్నది. బిగువైన వక్షోజములనుండి దళసరి యైనపైఁటకొంగు దిగజాఱఁగా మెడను దాల్చినశివసూత్రము కనఁబడుచున్నది. ముక్కునఁ బెట్టిన హురుమంజిముత్యములు పొదిగిన ముంగర (అడ్డబాస) కమ్మనైన పెదవిమీఁద గంతులు వేయుచున్నది. నడుము జవజవలాడ, మట్టె లొం డొంటితోఁ గూడి చప్పుడుసేయ, మన్మథుని మేలిబంగారు

బొమ్మయో యనునట్లు లామె వచ్చుచుండెనఁట. ఈకాన వచ్చిన దగసాలివన్నెలాడి గావున నావిలాసవతిని మన్మథుని జాళువా (బంగారు) బొమ్మగాఁ జిత్రించుట, యౌచిత్యము వహించియున్నది. నొసట విభూతిబొట్టు పెట్టుట, పైఁట జాఱి నపుడు శివసూత్రము గానవచ్చుట యామె శైవసంప్రదాయ మునకుఁ జెందిన దనుట. హురుమంజిముత్యాలముంగర వా తెరమీఁద గంతులువేయుట, మట్టియలు కదిసి మ్రోయుట యాపె యగసాలివన్నెలాడి యగుటకు సమర్థకములై యున్నవి.

సాతాని వెలఁది—

సీ. మీఁగాళ్ల జీరాడు మేలైనకు[1]చ్చిళ్లు
దేరఁ[2]గా మడిచీరఁ దీర్చికట్టి
బిగువుగుబ్బలమీఁద నిగనిగ ల్దళుకొత్తు
నోరపయ్యెదకొంగు జాఱవైచి
తలపుల కొకవింత గలుగఁగా గొప్పలా
కురులు నున్నగ దువ్వి కొప్పువెట్టి
నెలవంకనామంబు సలలితంబుగ నుంచి
తిరుచూర్ణ మామీఁదఁ దీర్పుచేసి

యోరచూపుల విటులఁ దా నూరడించి
గిల్కుమెట్టెల రవరవల్ గులుకరింపఁ
జికిలిచేసిన తామ్రంపుఁజెంబుఁ బూని
వీథి నేతెంచె సాతానివెలఁది యొకతె.

1. సరుకుతో, కుచ్చెళ్లు, 2. దీరున.

తోమిన రాగిచెంబు చేతఁ దాల్చి వీధి వెంట వచ్చెడి సాతానివనితతీ రెంతయు సహజముగ నీపద్యమునఁ దీర్చి దిద్దియున్నాఁడు. నాఁడు నేఁడునుగూడ భిక్షాటనముసేయు సాతానివనితలలో నీతీరయిన రూపరేఖలు చూపట్టును. ఆవెలఁది మడికోక మీఁగాళ్లమీఁద కుచ్చిళ్లు తీరునట్లుగాఁ దీర్చికట్టినది. బిగువైన కుచములమీఁద నిగనిగలాడు పైఁట చెరఁగు జాఱవైచినది. వలపులు రేగించు దట్టమైనకురులు నున్నగా దువ్వి కొప్పువెట్టినది. ముందు తిరుమణితోఁ జంద్రరేఖాకారముగ నామము నుంచి దానిమీఁద తిరుచూర్ణము తీర్చిదిద్దినది. ఇదియొక సహజరేఖాచిత్రణము. ఓరచూపులతో విటుల కూరట గలిగించుచు, కాలివ్రేళ్లకుఁ బెట్టినమట్టెల రవరవధ్వనులు గులుకరించుచు, సాతాని వెలఁది వీథిఁబడి యేతెంచె ననుటలో నామెమూర్తి నెంతయు సహజముగ సాక్షాత్కరింపఁజేసినాఁడు.

ఒడ్డెవనిత—

సీ. మకరధ్వజునికొంప యొకచెంప గనుపింపఁ
  జీర కట్టినదయా! చిగురుబోణి
యుభయకక్షములందు సురుదీర్ఘతరములౌ
  నెరులు పెంచినదయా! నీలవేణి
పసుపుతావులు గ్రమ్మ పైఁటచేలము లెస్స
  ముసుఁగు వెట్టినదయా! ముద్దుగుమ్మ
పూర్ణచంద్రునిఁబోలెఁ బొసఁగ సిందూరంపు
  బొట్టు పెట్టినదయా! ఫాలఁతి నుదుట

యొప్పు మీఱఁగ నిత్తడిసొమ్ము లలర
నోరచూపులఁ గుల్కు సింగార మొల్కఁ
గల్కి యేతెంచె మరుని రాచిల్క యనఁగ
వలపులొలుకఁ జేటి యొక యొడ్డెకులవధూటి.

ఈపద్యమున వర్ణింపఁబడిన దొక యోఢ్రదేశమునకుఁ జెందినవనిత. ఆనాఁటికి నేఁటికిఁగూడ నొడ్డెజాతివనితలలో శ్రీనాథుఁడు వర్ణించినతీరంతయుఁ గానవచ్చుచునే యుండును. ఈనాఁటికి నాదేశపువనితలు అంతరీయము నొంటిపొరను గట్టుకొందురు. ఎంతటి పొడవైనచీర యుండినను హెచ్చుభాగము నుత్తరీయముగ నుపయోగింతురు. అట్టి చీరకట్టుతీరును తొలుతటిపాదమునఁ జిత్రించినాఁడు. వారలు సామాన్యముగఁ గంచుకము తొడుగుకొనరు. కక్షములందలి కేశములకు సంస్కారము గావించుకొను పరిపాటియుఁ దక్కువ. ఆవిషయమును రెండవపాదమునఁ దెలిపి యున్నాఁడు. తఱుచుగఁ బసుపొడలికిఁ బూసికొని, యా పసుపువాసన హత్తిన వస్త్రమును ముసుఁగు వెట్టికొందురు. దీనిని సహజరూపమున రూపొందఁజేసినాఁడు. నుదుట పూర్ణచంద్రునిబోలిన గుండ్రని సిందూరపుబొట్టు పెట్టుకొందురు. పెద్దగ సిందూరపుబొట్టు పెట్టుకొనుపరిపాటియు నేఁటికిని గలదు. ఒడ్డెకులవధూటి నింత సహజముగఁ జిత్రించిన శ్రీనాథుని పర్యవేక్షణానైశిత్య మప్రతిమము. సింహాచలమున కేఁగినపుడే యీయొడ్డెవనితల సౌందర్యపర్యవేక్షణము గావించి యుండును.

ఆమె యోరచూపులలోఁ గులుకుశృంగార మొలికించుచు, మన్మథుని రాజకీరమో యనునట్లు వలపులకు నిధానమై వచ్చె ననుటలో, నొడ్డికులవధూటుల యొడ్డితనమందుసైతము హృదయాకర్షకమైన శృంగారము నొలికించిన శ్రీనాథుని కవితాశిల్ప మనిర్వచనీయము.

శ్రీనాథునిచాటువులలో శృంగార మతిమాత్ర మనుకొనువారి రసనారంగముల నర్తించునది యీసీసపద్యప్రథమ పాదము. మకరధ్వజునికొంప=మన్మథనివాసము, ఒకచెంప= ఒకపెడ అనునర్థము స్ఫురించినంతమాత్రముననే యొడలు పులకరింపఁజేసికొని మిగిలినపద్యమునందలి విషయముమీఁదికేపాటియు దృష్టి సారింపనీక, శ్రీనాథుని శృంగారిఁగా నిర్ణయించుకొని తనివిచెందు పాఠకసహృదయు లీపద్యములోని భావము నామూలాగ్రముగ ననుసంధానించుకొని, యాతని సహజసౌందర్యచిత్రణశిల్పమును సావధానముగ నెఱఁగికొని, సద్భావసమన్వితు లగుదురుగాక యని నామనవి.

ఈక్రిందిపద్యము శ్రీనాథునిచాటువుగాఁ బ్రసిద్ధము.

క. పూజారివారికోడలు
తా జాఱఁగ బిందె జాఱి దబ్బునఁ బడియెన్
మైజాఱుకొంగు జడిసిన
బాజారే తిరిగి చూచి పక్కున నవ్వెన్.

ఇది నీరాటిరేవుముచ్చటగాఁ గానవచ్చును. ఒక పూజారికోడలు కాలుజాఱుటచే బిందెజాఱి తటాలునఁ

గూలినది. దానితో నొడలినుండి జాఱిన చీరకొంగు తడిసినది. ఈదృశ్యము చూచి వీథిఁబట్టిపోవుజనులు తిరిగి చూచి పకాలున నవ్విరి. లేక వీథిఁబట్టిపోవువారిని దిరిగి చూచి యామె యే నవ్విన దనుకొనవచ్చును. ఏమయిన నెవ్వరయిన జాఱిపడినపుడు చూచువారు నవ్వుట యనునది లోకసహజము. ఆవిషయ మీపద్యమునఁ జిత్రితమైనది.

క. రంభాస్తంభము లూరువు
లంభోరుహనిభము లక్షు లతనుశరంబుల్
జంభాసురారిమదగజ
కుంభము లీసంబివారి కోడలికుచముల్.

ఈపద్యమునఁ గల్పనాసౌష్ఠవ మంతగఁ గానరాదు. ఇది శ్రీనాథునిరచన గాదు. ఈసంబివారికోడలి తొడలు అరఁటిబోదులు. పద్మములఁ బోలిన కన్నులు మన్మథబాణములు. ఈవనిత కుచము లైరావణకుంభస్థలములు. దీనిలో మూర్తిసాక్షాత్కార మేమియుఁ గానరాదు. ఈతీరుగ నీక్రింది పద్యముగూడ శ్రీనాథునిరచన గాదు.

క. అద్దిర కులుకులు బెళుకులు
నిద్దంపు మెఱుఁగుతొడలసీటులు గలటే
దిద్దుకొని యేల వచ్చెను
ముద్దియ యానంబిపడుచు ముచ్చటదీఱన్.

ఈపద్యము వట్టి చెత్తపదములప్రోగు. దీనిలోఁ గవితాచమత్కార మేపాటియు లేదు. ఇట్టి నిరర్థకపద్యమును

శ్రీనాథుఁడు వ్రాయలేఁడు. కుతూహలపరు లెవ్వరో రచించి శ్రీనాథునిదిగాఁ జేసిపెట్టినారు.

ఉ. వీసపు ముక్కునత్తు నరవీసపు మంగళసూత్ర మమ్మినన్
గాసును రాని కమ్మ లరకాసును గానివి పచ్చపూసలున్
మాసినచీర గట్టి యవమాన మెసంగఁగ నేఁడు రాఁగ నా
కాసలనాఁటివారి కిన కాంగిని జూచితి నీళ్ళరేవునన్.

కాసలనాటిశాఖకుఁ జెందిన పసిఁడివన్నెగల శరీరము గల వనితరూప మీపద్యమునఁ జిత్రింపఁబడినది. ఆమె మైచాయకుఁ దగిన వస్త్రాభరణములు లేకుండుట యవమానకర మనిపించినది. ఆమె మాంగళ్యసూచకముగా ముక్కున నత్తు మెడలో మంగళసూత్రము చెవులఁ గమ్మలు కంఠమున నల్లపూసలు దాల్చి యున్నది. ముక్కునత్తు వీసపుబంగారముతోను, మంగళసూత్ర మరవీసముతోను దయారైనవి. కమ్మ లమ్మినఁ గాసైన రాదు. పచ్చపూస లరకాసును రానివి. ఇట్టి తక్కువ వెలగల భూషణములతోపాటు మాసిన చీరకూడఁ గట్టినది. మేనిచాయకు సరిపడిన వస్త్రాభరణములు లేనితీరులో నామెరాక యవమానకరమై తోఁచినది.

శా. పొచ్చెం బింతయు లేని హంసనడతోఁ బొల్పొందు లేనవ్వుతోఁ
బచ్చ ల్దాపిన కుల్కుముంగరలతో బాగైన కమ్మోవితో
నచ్చంబైన ముసుంగుపెట్టి చెలితో నామాటలే యాడుచున్
వచ్చెంబో కుచకుంభము ల్గదలఁగా వామాక్షి తా నీళ్ళకున్.

ఒకవామాక్షి నీళ్ళకు వచ్చినతీ రీపద్యమునఁ జిత్రితమైనది. లోప మేపాటియు లేనిహంసయానము, మందహా

సము గలిగి, పచ్చలు దాపిన తళతళలాడు ముక్కుపుడకలు దాల్చి, అందమైన యెఱ్ఱని క్రింది పెదవితోఁ గూడి, ముసుఁగు వెట్టి చెలికత్తెతో ఆమాటలే యాడుకొనుచు కుంభముల వంటి కుచములు కదలఁగా నొకచపలాక్షి నీళ్లుగొనిపోవుటకు వచ్చెను. నేఁటికిని బల్లెలలో నీళ్లుగొనివచ్చుటకుఁ దటాకాది కమున కేఁగువిలాసవతులు, వింతయొయ్యారములు గాన్పింపఁ జేయుచు, సవయస్కలతో రహస్యభాషణము గావించుచు వచ్చుచుఁ బోవుచుందురు. ఆరాకపోకలలో వింతయొయ్యారములు గాన్పింపఁజేయుచుందురు. అట్టి నీరాటిరేవుముచ్చట లిందు వర్ణితమైనవి. ఇచట 'నా మా ట లే' యనుచోట 'ఆమాటలే' యని పదచ్ఛేదము సేయుటలో వ్యంగ్య మతి రమణీయత వహించును. అచ్చంబైన ముసుంగు వెట్టుట దాని కెంతయు నదికియుండును. తానసుభవించిన హృదయోల్లాస జనకమైన విషయములను చెలికత్తెతో మాటువెట్టి చెప్పుచున్నట్టులు- 'అచ్చంబైన ముసుంగు వెట్టి యామాటలే' అను టలో ధ్వనించుచున్నది.

ఈక్రింది యగసాలెవనితసొబగును జిత్రించిన పద్యములు శ్రీనాథునిరచనలుగాఁ గానరావు. కవితాచమత్కారము పీనఁ గానవచ్చుట లేదు. శయ్యాసౌభాగ్యము కూడ లేదు.

ఉ. తల్లియుఁ గొండపల్లి నొకతామరగండికి నీళ్ల కేఁగఁగాఁ
దెల్లని చీరకొంగు నెగఁదీసుక నవ్వుచు నీళ్లు ముంచఁగాఁ

గొల్లలలింగకాయ కడుగోముగఁ బయ్యెద నాట్యమాడఁగాఁ
జల్లని మాటలాడు నగసాలెశిరోమణిఁ జూచితే సఖా!

ఒక యగసాలె వెలఁది తల్లితోఁగూడి కొండపల్లెలో నొక తామరచెఱువునుండి నీళ్లు తెచ్చుట కేఁగి, తెల్లనైన చీరకొంగు నెగఁదీసికొని నవ్వుచు నీళ్లనుంచఁగా, పెద్దదైన లింగకాయ పైఁటచెరఁగులో నందముగ నాట్యముసేయఁగా చల్లని మాటలాడుచున్నది చూచితే! యని చెలికానిని హెచ్చరించుట యీపద్యమునఁ జిత్రించినవిషయము. అగసాలెవనితలు శైవచిహ్నమైన లింగకాయ దాల్చుట వంగి నీళ్లుముంచునపు డది పయ్యెదలో నాట్యముసేయుట సహజము. తెల్లని చీరకొంగు నెగఁదీసుక యనుటలో సభ్యత గోచరించుట లేదు. 'తల్లియు' ఇత్యాది పాదారంభపదములు నిరర్థకములు. కావున నిది శ్రీనాథునిరచన గాదు.

ఉ. బంగరులింగమూర్తి చనుబంతుల[1]మధ్య నటించుచుండఁగాఁ
జెంగులు జాఱ మేల్వలువచీరయు వీడ మదిస్మితంబులు
పొంగఁగ వామహస్తమునఁ బొల్పగునీవిని బట్టి వేడ్కతోఁ
జంగున గోడదాఁటు నగసాలెశిరోమణిఁ జూచితే సఖా!

ఈపద్యమునం దగసాలెవనిత యొకతె గోడదాఁటుచుండఁగఁ గానవచ్చినసౌందర్యము నొకఁ డొకస్నేహితునితోఁ దెలుపుతీరు చిత్రింపఁబడినది. తటాలున గోడదాఁటు నలజడిలో బంగారులింగకాయ కుచములనడుమ నాట్యము

1. యలపయ్యెదమధ్య.

సేయుచుండెను. చీరచెఱఁగులు జాఱి విడిపోవఁగా, నెడమ చేతితోఁ గోకముడిని బట్టుకొని వేడుకమీఱఁగా గోడ దాఁటుచున్న దీవనిత. ఈవిన్యాసము నాకుఁ గోరికలు రేకెత్తించుచున్నది. చూచితివా చెలికాఁడా! యనినాఁడు. ఇచట నీప్సితము లనఁగా దర్శనాకాంక్షలా? లేక రతికాంక్షలా? యెఱుఁగరాదు. ఇచట వ్యత్యస్తవనితాసౌందర్యచిత్రణము ప్రస్తుతమైనది. అది సమగ్రముగ నిర్వహింపఁబడలేదు. మఱియు మదీప్సితంబు లుప్పొంగఁగ ననునది పాదపూరక ప్రయోగమే గాని పసగలది గాదు. కావున నిది శ్రీనాథుని రచన గానేరదు.

దాసరివనిత—

ఉ. వాసన గల్గుమేను నిడువాలుకనుంగవ గబ్బిగుబ్బలుఁ
గేసరిమధ్యముఁ మదనకేళికి నింపగు బాహుమూలవి
న్యాసము గల్గినట్టి యెలనాఁగను భోగముదానిఁ జేయ కా
దాసరిదానిఁ జేసిన విధాతను నేమనవచ్చు నీశ్వరా!

పరిమళముతోఁ గూడినశరీరము (పద్మినీజాతిదనుట) పొడవైె యందమైన కన్నులజంట, పృథులవక్షోజములు, సింహమునడుమువంటి నడుము, రతికేళి కనుకూలమైన కక్షములకూర్పు, గలిగిన యీలతాంగిని భోగముదానిగాఁ జేయక దాసరిదానిఁగా సృజించిన సృష్టికర్త నేమనవచ్చునురా! భోగయోగ్యమైన శరీరసౌందర్యవిన్యాసము గల వనితను బిచ్చకత్తెనుగాఁ జేయుట శోచనీయ మని యిందలి భావము.

ఉ. చీరయు ముక్కుముంగరయుఁ జెంపలగంధముఁ జుక్క బొట్టు మం
జీరఝుళంఝుళారవముఁ జేతులఁ గంకణనిక్వణంబు నో
య్యారపు జాలుకొప్పను గయాళితనంబును గాని లోన శృం
గార మొకింత లేదనుట గంటిని నీపురివారకాంతలన్.

ఈపట్టణ మేదియో తెలియరాదు. ఈపురిలోని భోగపు జాతివనితలకు వేషభూషలపసయే గాని భోగయోగ్యమైన యంగవిన్యాససౌష్ఠవము లేదని చిత్రించినాఁడు. కట్టిన చీరయు ముక్కునఁబెట్టిన ముంగరయు, చెక్కిళ్లపైఁ బూసిన గంధపుఁబూఁతయు నుదుటిచుక్కబొట్టును, పాదములఁదాల్చిన యందెలచప్పుళ్లును చేతులఁ దాల్చిన కంకణములధ్వనియు, ఒయ్యారముగా జాఱుజడముడియు గయ్యాళితనమునే గాని కుచమధ్యబాహుమూలవిన్యాసాదికమైన లోపలిశృంగారము లేదనువిషయమును గాంచితిని. పైపద్యమున భోగపుజాతి వనితల కుండవలసిన యంగవిన్యాససౌష్ఠవము చిత్రింపఁబడి నది. అదియంతయు నంతరీయోత్తరీయాదివస్త్రాంతరితమై యుండెడి లోనిశృంగారమే. అది యేపాటియు నీపురివార కాంతలకు లేదనినాఁడు.

ఉ. వాలుగుకన్నుదోయి బిగివట్రువగుబ్బలు కారుచీకటిం
జాల హసించుకొప్పుజిగి సారసము న్నగుమోము గల్గునా
బాలికఁ గూలికమ్ముకొన బట్టలనేసెడివాని కిచ్చె హా
సాలెత గాదురా కుసుమసాయకుపట్టపుదంతి యింతియో!

అందమైన కన్నులజంట, బిగువైె వట్రువలైన కుచ ములు, కారుచీకటిని బిట్టు పరిహసించు కొప్పుతళుకు, పద్మ

ము నపహసించు ముఖము గలుగునట్టి యాఁచిన్నదానిని కూలి కమ్మకొను బట్టలునేసెడివాని కొసఁగినాఁడయ్యా! అది సాలెత (సాలెజాతిస్త్రీ) గాదు శా! మన్మథుని పట్టపుటేనుఁగే. నిశ్చయము. ఇచట 'ఇంతియే' అనుపదము సంస్కృతమున 'నూనమ్' వంటిది. ఇంతటిసౌందర్యము గలయాయింతిని సాలెతనుగాఁ జేసిన విధాత ననుచితముచేసిన వానినిగా రూపించియున్నాఁడు. మన్మథవిలాసము లన్నియు ననుభవించుటకు యోగ్యమైన శరీరవిన్యాసము గలయామె కనుకూలమైన యాశ్రయము లభింపలే దని పరితాపము. ఈతీఱయినదే యీ క్రిందిచాటువుకూడ.

ఉ. గుబ్బలగుమ్మ లేఁజిగురుఁగొమ్మ సువర్ణపుఁ గీలుబొమ్మ బల్
గబ్బిమిటారిమాపులది కాఁపుది దానికి నేల యొక్కానిక్కా
బెబ్బులి నంటఁగట్టితివి పెద్దవు నిన్ననరాదు గాని దా
నబ్బ! పయోజగర్భ! మగనాలికి నింతవిలాస మేఁటికిక్కా.

ఉత్తమసౌందర్యము అనుత్తమవిలాసములుగల కాఁపు వడుచునకు వికృతమైన మగ నంటఁగట్టిన సృష్టికర్త చేఁతకుఁ దన యసంతుష్టి నెఱిఁగించుచు, భర్తతోఁ గాపురముసేయు నామె కింత విలాస మెందుల కనినాఁడు. రూపవయోవస్థానురూపమైన భర్త లభింపనినాఁడు సచ్చరిత్రము గలిగి సౌందర్యవతియైన యువతినిగూర్చి యనుశయము రసికలోకమునకుఁ గలుగుటయును సహజము.

ఉ. కుమ్మరివారిబాలిక చకోరవిలోచన ముద్దుగుమ్మ యా
వమ్మదరిక్కా రసాయలినవస్త్రము చుంగులఁజాఱఁ గట్టి తాఁ

గమ్మనిప్రోఁత్రతోఁ గిరనఖమ్ముల భాండము లంగజాస్త్రసా
తమ్మనఁ బ్రోవుదీసె విటతండము గుండియ లారవిచ్చఁగన్.

చకోరములవంటికన్నులు ముద్దులుగుల్కెడి ముఖము గల కుమ్మరివారిచిన్నది, ఆవముదగ్గఱ నిలుచుండి, అంచులు జాఱ కుమ్మరిబూడిద యంటినమలినవస్త్రము గట్టి, కమ్మని ప్రోఁత యేర్పడునట్టులు కుండలు ప్రోగించుచు, మన్మథ బాణములు వేయుటయో యనుట్టులు విటసమూహము గుండెలు పగులునట్టు లావమునుండి కుండలప్రోవును విడఁదీసి పెట్టెను.

ఈక్రిందిపద్యములు రెండును శ్రీనాథునిరచనలు గావు.

ఉ. శ్రీకరభూషణంబులను చిబ్బెపుగుబ్బలు ముద్దుఁజెక్కులన్
గోకిలవంటిపల్కులును గొల్చినఁ జేరలఁ గేరు కన్నులన్
ప్రాకటదేహకాంతియును బంగరుచాయకు సెచ్చువచ్చు నీ
చాకలివారిబాలికకు సాటిగ శారికఁ గొంటిజవ్వనుల్.

సౌందర్యవిశేషస్ఫోరకమగు పదవిన్యాసముగాని భావ సంయోజనముగాని యీపద్యమునఁ గానరాదు. 'గోకిలవంటి పల్కు' లనునది కవిసమయసమ్మతముగాదు. పద్యమున వైచిత్రి యేమియుఁ గానరాదు.

ఉ. ముంగురు లంటఁజుట్టి తనమోమున మోము నమర్చి చీరముం
గొంగు వదల్చి మన్మథునిగోప్యపుగేహము చెమ్మటిల్లఁగా
నంగజకేళిఁ బల్లవుల నార్భటులం గరఁగింప నేర్చు నీ
జంగమువారికాంత రతిజాణశిఖామణి యెంచి చూడఁగన్.

శ్రీనాథుఁ డాయాజాతివనితలసౌందర్యమునే తన చాటువులందుఁ జిత్రించినట్టులు గానవచ్చునుగాని, యిట్టి

యసభ్యము అనస్వితము గ్రామ్యము నగుశృంగారమును వర్ణించినట్లు లూహింప వలనుపడదు. రతికేళికి సంబంధించిన యూవర్ణనమునఁ గవితాచమత్కృతి యేపాటియుఁ గానరాదు. ఈపద్యమునందలి యవాంతరవాక్యములకుఁ గార్య కారణభావ మేమియుఁ బొసఁగియుండ లేదు.

ఈక్రిందిసీసపద్యమునుగూడఁ గుతూహలపరు లెవరో శ్రీనాథునిదిగాఁ జేసి పెట్టినారు. ఈసీసమునఁగూడఁ గవితాచమత్కార మంతగఁ గానవచ్చుటలేదు. ఇదియును శ్రీనాథునిరచన గాదు.

సీ. తళుక్కుతళుక్కను కాంతి బెళుకు కెంపులముంగ
  రందమై కెమ్మోవియందుఁ గుల్క
ధగిధగద్ధగలచేఁ దనరారు బంగారు
  గొలుసు లింగపుఁ గాయ కొసరుమిగుల
నిగనిగన్నిగలచే నెగడు బెల్లపుగబ్బి
  గు[1]బ్బ లుఁగెంబున నిబ్బరింప
రాజహంసవిలాసరాజితంబగుయాన
  ముందు మట్టెలు గెండు సందడింప
సరసదృక్కుల విటులను గరఁగఁజూచు
పొందికైనట్టి మోమున భూతిరేఖ
రాజకళలొప్పు నద్దంక రాజవీథిఁ
బొలిచె నొకకొమ్మ గాజుల ముద్దుగుమ్మ.

తళుక్కుతళుక్కు మను కాంతులు చిమ్ము కెంపులుగూర్చిన ముంగర (అడ్డబొస) అందముగ నెత్తిని పెదవిమీఁదఁ గులుకు

1. కొనమిన్నుంబున మెలఁగుచుండ.

చుండ, ధగధగమను తళుకుతో నొప్పు బంగారుగొలుసునఁ గూర్చిన లింగకాయ సొంపు నింపఁగా (ఇది యెచట నున్నదియో యెఱుఁగరాదు) నిగనిగలాడుచు మనోహరమై పటుత్వముగలకుచము లురమున నిలిచియుండ, (కుచములు నిగనిగలాడుచున్నవనుట యనన్వితము) రాజహంసవిలాసముతో నొప్పునడకలో మట్టెలు ధ్వనిచేయుచుండ (ఈనడకలో మంజీరనాదము గాన్పింపఁ జేయఁదగినది) సరసమైనచూపులతో విటులను గరఁగిపోవునట్లు చూచుపొందికగల ముఖమున విభూతిరేఖదాల్చి రాజకళ లొప్పఁగా అద్దంకిరాజధాని వీథిలో నొకగాజులముద్దుగుమ్మయైనవనిత నిలిచెనఁట. విభూతిరేఖలో రాజకళలొప్పుట యెట్లో యెఱుఁగరాదు. శ్రీనాథుని యితరచాటువులలోఁ జూపట్టెడి పదములకూర్పు మాత్రమే యిందు కొలఁదిగఁ గలదు. మూర్తిసాక్షాత్కారమున కనువైన భావసంయోజనము అర్థసంశుద్ధి గానరాదు.

చ. తొలకరిమించుతీవగతి దోఁప దుకాణముమీఁద నున్నన
వ్యలికులవేణితోఁ దములపాకుల బేరము లాడఁబోయి నే
వలచుట కేమి? శంకరునివంటి మహాత్ముఁడు లింగరూపియై
కులుకుమిటారి గబ్బిచనుగుబ్బలసందున నాట్యమాడఁగన్.

ఆకారము తొలకరిమెఱుపుతీఁగవలెఁ గానరాఁగా దుకాణముమీఁద నుండి, తుమ్మెదచాలువంటి వేణి గలిగి తములపాకు లమ్మెడివనితను జూచి యామెతోఁ దములపాకులు బేరమాడఁబోయి నేనువలచుట కేమి? శంకరుని

వంటి మహాత్ముఁడు లింగరూపము దాల్చి అవిలాసవతి వక్షో జములనెడి యెత్తయిన కొండలశిఖరముల నడుమ నాట్యము సేయుచున్నవాఁడు. దుకాణముపై తములపాకు లమ్మెడియలి కులనీలవేణి యురోజమధ్యమున నీశ్వరలింగము దాల్చి, దుకాణమువిూఁద తొలికారుమెఱుపువలె మెఱయుచు వల పింపఁజేయుచున్న దని భావము. ఉరోజమధ్యమునఁ జూపట్టెడి నీశ్వరలింగమును రూపించుటలో, నొక మధురమైనకల్పన యిట నాసూత్రితమైనది. స్త్రీలు తములపాకు లమ్ముట గుంటూరుమండలమునుండియే గానవచ్చును. తదితరప్రాగాం ధ్రమున నంతగఁ గానరాదు. అందును నీతములపాకు లమ్ము వనిత లింగధారిణిగాఁ జిత్రితమైనది. తొలకరిమించుతీవ, అలికులవేణి యనునీపదములకూర్పుచే మేఘమధ్యముననుండి తొలకరిమెఱుపువలె మెఱయుచున్నట్టు లామె గానవచ్చుట యిట ధ్వనించుచున్నది.

కూచిమంచి తిమ్మకవి రచించిన సర్వలక్షణసారసంగ్ర హములో నీక్రిందిపద్యము శ్రీనాథునిదిగా రంతుశబ్దము సాధురేఫమనుట కుదాహరణముగా నీయఁబడినది.

ఉ. అంగడివీథిఁ బల్లవుల కాసగ మామిడిపండు లమ్ముచుం
జంగమువారిదిన్నది పిసాళితనంబునఁ జూచెఁ బో ని
శాతాంగజబాణ కైరవ సితాంబుజ ముత్తచకోర బాలసా
రంగ తటిన్నికాయముల రంతులు చేసెడు వాఁడిచూపులన్.

ఒకజంగమువనిత అంగడివీథిలో మామిడిపండు లమ్ముచు విటుల కాసగొలుపునట్టు, పదునైన మన్మథబాణ

ములైన కలువలను తెల్లపద్మములను మత్తకెక్కిన చకోరము లను లేడిపిల్లలను మెఱుపుతీఁగలను రచ్చకెక్కించు వాఁడి చూపులతో వంచన జేయుతీరునఁ జూచినదఁట. ఇచట చూపులకు పోలికగా నల్లకలువలు తెల్లతామరలు మత్తచకోరములు లేఁడిపిల్లలు మెఱుపుతీగలు కైకొనఁబడినవి. వానితోఁ బోలికకు సరిపడిన సన్నివేశము ముందు కూర్పఁబడలేదు. నిశాతాంగజబాణములతో సామ్యముఁ దెలుపుచు మరల వాఁడిచూపు లనుట పునరుక్తప్రాయము. పిసాళితనముతోఁ జూచుచూపులలో నిన్నిపోలికలు పొందకట్టుట యెట్టులో తెలుఁగరాకున్నది. జంగమువారిచిన్న దీపద్యమునఁ గలదని శ్రీనాథున కంటఁగట్టినట్లు గానవచ్చుచున్నది.

ఈక్రిందిసీసమును శ్రీనాథున కంటఁగట్టినదియే.

సీ. బాలేందురేఖసంపద మించి విలసిల్లు
నొసలితళ్కులనీటు నూఱుసేయు
భ్రమరికాహారినీలచమరవాలములఁ బోల్
వేణిభరముచాయ వేయుసేయు
దర్పణద్విజరాజధాళధళ్యప్రభ
లపనబింబస్ఫూర్తి లక్షసేయు
కోకహాటకశైలకుంభికుంభారాతి
కుచకుంభయుగళంబు కోటిసేయు
జఘనసీమకు విలువ లెంచంగ వశమె?
దీనిసౌందర్యమహిమంబు దేవుఁ డెఱుఁగు.
నహహా! యొబ్బంగి సాటిసేయంగ వచ్చు
భావజానికొల్వ జంగమభామచెల్వ.

ఇది యొకయుపమానపదముల కేర్పడినచిట్టా. దీనిలో కల్పనాచమత్కార మేమియు లేదు. పెక్కుప్రతులలో నీపద్యము గానరాదు. జంగమవనితయువయువవర్ణన ముండిన కారణమున నీపద్యము శ్రీనాథున కంటఁగట్టఁబడినది. అంతియగాని యిందేమియు విశేషము లేదు. మొత్తము మీఁద మీఁదిమూఁడుపద్యములు శ్రీనాథునిరచనలు గావనియే యనిపించుచున్నది. అర్వాచీనముగాఁ గూర్చినచాటువులలో నివి గానవచ్చుచున్నవి. ప్రాచీనప్రతులలో నివి గానరావు.

మహమ్మదీయవనితలు—

క. నిబ్బరపుఁ గలికిచూపులు
జబ్బింపక లేనిపిఱుఁదు సన్ననినడుమున్
మబ్బుకురు లుబ్బుకుచములు
బిబ్బీలకుఁగాక కలవె పృథివీస్థలిలోన్.

తిన్నని యందమైన చూపులు, ఎగుడుదిగుడు లేని లేక, పొచ్చె మేపాటియు లేనినితంబప్రదేశము, సన్నని నడుము, మబ్బువలెఁ గ్రమ్ముకొనియున్న నల్లనిశిరోజములు, ఎత్తయిన యురోజములు బిబ్బీలకు (మహమ్మదీయస్త్రీలకు) గాక యీలోకమునం దితరస్త్రీలకుఁ గలవా? బీబీల కిట్టి సౌందర్యము కూడియుండుట యానాఁడుసహజమే. మహమ్మదీయులు విలాసిపురుషు లగుటచేఁ దొలుత వారు మన దేశము నాక్రమించిననాఁడు వారికి నజరానాలు (కానుకలు)

గా నెందఱో యుత్తమజాతివనితలు సమర్పింపఁబడినట్టులు చరిత్రలు చెప్పుచున్నవి. ఈవర్ణన ముత్తమజాతిమహామ్మదీయవనితాసౌందర్యనిరూపకము.

క. ఆకదురునఁ బికరవమును
నాకదురున భృంగరవము నాత్మరవంబున్
ఏకీకృతముగ నేకు ల
నేకులు విన వడికె మఁదిర యేకులమదిరా!

ఏకులు వడికెడి వనిత యొకతె తాను వడకెడికదురు నుండి బయలుదేఱిన ధ్వనితో కోకిలధ్వని, తుమ్మెదధ్వనియు తనకంఠధ్వనియు నేకముచేసినట్టు లేకులు పెక్కురు వినఁగా వడికినది. ఈవనిత యేకులమునకుఁ జెందినదిరా? యని ప్రశ్నము. ఏకులు వడుకుజాతికిఁ జెందినవనిత యని సమాధానముకూడ నిందే యిమిడియున్నది.

దూదేకుల వెలఁది—

సీ. హరినీలములకప్పు నణఁగించు నునుగొప్పు
చెంగావిమసుఁగులోఁ జిందులాడ
చక్రవాకముల మెచ్చని బలుసిబ్బెపు
బిగువుచందోయి పింపిళ్లుగూయ
ధవళాబ్జగుచులునాఁ దళ్కులీనెడు నవ్వు
వెన్నెలనిగ్గుతో వియ్యమంద
గొంతు గూర్చుని రసికుల దర్శనస్పర్శ
నంబుల మోహాద్రవంబు జాఱ
నెడమకుడిహస్తముల సన్న లెసఁగ విటుల
రమ్ము రమ్మని పిలుచు గారవము దోఁప

సుర్వి మెఱయించు కార్పాసపర్వతంబు
చేరి మర్దించె నొక్క పింజారితరుణి.

ఒకదూదేకులజాతియువతి నేలపై నుంచిన పర్వతము వంటి దూదిరాశిని ఏకినదఁట. అప్పటి యామె సౌందర్య మిట్లు రూపొందినది. ఆమెకొప్పు ఇంద్రనీలమణులవలుపు వణఁచివేయుచున్నది. ఆకొప్పు చెంగావిచీరముసుఁగులోఁ జిందులాడినది. చక్రవాకములను మీఱి మిక్కిలి యందమై బిగువైన చన్నులజంట పింపిళ్లుగూసినది. అనఁగాఁ జిందులు ద్రొక్కినది. తెల్లతామరకాంతులా యనునట్లు తళుకులు తులకించు నవ్వు, వెన్నెలలోనిలావణ్యముతో వియ్యమంది నది. గొంతుగూర్చుండి రసికులఁ జూచుటవలన తాఁకుట వలన మోహము రేకెత్తి, మోహద్రవము జాఱినది. ప్రత్తి యేకునపు డెడమకుడిహస్తముల సన్న లేర్పడఁగ విటులను రండు రండని పిలుచుగౌరవము తోఁచుచున్నది. ఈవర్ణన క్రమములో సౌందర్యము సరసముగనే నిరూపింపఁబడినది. నాల్గవపాదమున జుగుప్సావహమైన యర్థము స్ఫురించు చున్నది. కచకుచమందహాసముల నిరూపణము లలితముగనే సాఁగినది. గీత మొకటిరెండుపాదములలోనియర్థమును సభ్య ముగను, సమన్వితముగను లేదు. ఈపద్యరచన కావించినవా రెవరో తొలుతటిసీసపాదములు మూఁడింటిని శ్రీనాథుని పోకడలో నడిపించి, అటుపిమ్మట తనసహజధారను జత గూర్చినాఁడు. సౌందర్యాభివర్ణనక్రమములో శ్రీనాథుఁ

డిట్టియెడబరము నొడఁగూర్చెడిరచన సాగింపలేఁడు. ఇది శ్రీనాథునిరచన గాదు. మొదటి మూఁడుపాదములలోఁ గూడ వస్త్వాన్మీలనమునందును వాక్యసమన్వయమునందును వ్యత్యాసము గానవచ్చుచున్నది. ధవళాబ్జరుచులునా, గొంతుగూర్చుని, గారవముదోఁప, మెఱయించు, మర్దించె- అనునీపదము లసంబద్ధములుగా నున్నవి.

బొందిలిభామ—

ఉ. వన్నెలగాగరా జిలుగువట్టుపకుచ్చెళులందుఁ బాదముల్
సన్నపు వారిభంగముల సందున నీఁగెడు బాలకూర్మముల్
గన్నతెఱంగు దోఁపఁ గరకంజముల న్ముసుకుం బిగించి ప్ర
చ్ఛన్నముఖాబ్జయై నడచెఁ జంగున బొందిలిభామ గోమునన్.

రంగురంగుల గాగరా(పరికిణీ)కుఁగూర్చిన సన్నని కుండ్రసైనకుచ్చెళ్లలోఁ గదలాడుపాదములు, సన్ననినీటి యలలనడుమఁ బ్రవేశించు పిల్లతాఁబేళ్లవలెఁ గానరాఁగ, హస్తపద్మముల రెండిటితో ముసుకును బిగించుకొని, ముఖ పద్మమును గానరాకుండఁ జేసి, బొందిలిభామ యొకతె చంగు చంగున నందముగా నడచెను. బొందిలిజాతివనితలు రంగు రంగులగాగరాలు వేసికొనుట, వానికి హెచ్చుకుచ్చెళ్లుండుట, అవి పాదములు మోసియుండుట బొందిలిజాతిసహజమైన విషయము. ముఖము గానరాకుండ ముసుకు వైచుకొనుట కూడ సహజవిషయమే. తొందఱగా నడుచుటయుఁ బరిపా టియే. గాగరాకుచ్చెళ్లలోఁ గదలాడుపాదములను సన్నని

యలలనడుమఁ దిరుగాడు బాలకూర్మములతోఁబోల్చి దృశ్య సాక్షాత్కృతి గలిగించుటమాత్రము అబ్బురపాటు నొదవించుదృశ్యము. ఈపద్యమునఁ గానవచ్చెడి సౌందర్యరేఖా చిత్రణ మప్రతిమము. శ్రీనాథునిచాటువులన్నిటిలో నిది కడు విచిత్రమైనది. కవితాచమత్కృతి కీపద్యము చక్కని తార్కాణము. శ్రీనాథుని భావనామయమైనసౌందర్యసృష్టి యెట్లుండునో, యనుట కీపద్యము నిదర్శనము.

ఈక్రిందిపద్యము బొందిలిభామమీఁద రచించినదిగా శ్రీనాథునకుఁ గూర్పఁబడినది. ఇది శ్రీనాథుని రచన మాత్రముగాదు.

మ. విమలాంభోరుహపత్త్రమైత్రములతోఁ బెంపారు నేత్రమ్ములన్
గమనీయంబగు కజ్జలంబునిచి రేఖాసౌష్ఠవం బొప్ప నా
గముతోఁ జేసినసిందురంబు నుదుటం గాన్పింపఁ బయ్యంటయున్
రయమున్ ఱైకయు దాఁటి పూపచను లాస్యారంబుఁ జూపం దుకా
ణముపై బొందలి పోర్గు నిల్చె ముఖచంద్రస్ఫూర్తి శోభిల్లఁగన్.

స్వచ్ఛమైన తామరపూరేకులను మీఱునవిగా నొప్పు కన్నులం దందముగా రేఖ తేరునట్లు గాటుకఁ బెట్టి, తగరముతోఁ గూర్చినసిందూరము నుదుట బొట్టు నెట్టి, పూపచనులు, పైఁటను పల్లనిరైకను దాఁటి విలాసమును జూపఁగా నొకబొందిలిజాతివనిత ముఖచంద్రునివికాసము శోభిల్లఁగా దుకాణముమీఁద నిలిచినది. ఈపద్య మయిదుపాదములు గలిగియుండుటయే శ్రీనాథునిరచనకాదనుట కొకనిదర్శ

నము. జైత్రములతోఁ బెంపారు-అనునది అన్వయములేనిది. పూవచనులు రైకయు పైటచెరఁగు దాఁటి యొయ్యారము చూపించుట యతుకునట్టులు గానరాదు. కల్పనావైచిత్రి యేమియుఁ గానరాదు. మూర్తిసాక్షాత్కారము లేనే లేదు.

ద్రావిడభామ—

ఉ. తెల్లమడుంగు గట్టి యరుదెంచెడిపాంథుల తెప్పలార్పఁగా
నొల్లక చూచుఁగాని, మది నున్న విధంబు విలాసవైఖరిం
దెల్లము చేసి, గూఢరతి నేలును పాయము తెల్పదయ్యె నా
కల్లరిబొమ్మ యించుక, విఘట్టనశూన్యప్రయోధరాగ్రజా
గ్రల్లసమానతైక్ష్ణ్య లగుద్రావిడభామల కెంత వెట్టిరో!

మాయబొమ్మయైన ద్రావిడభామ తెల్లనిచీర గట్టి, దారి వచ్చెడివారిని తెప్పలార్పకుండఁ జూచునే గాని, విలాసములచే మనసులో నున్నభావమును బైటఁబెట్టి, రహస్యమైన రతిక్రీడలచే నేలుకొనఁజాలు నుపాయము నేపాటియుఁ దెలుపదయ్యెను. రాపిడి లేక పాలిండ్లకొనలు పదునెక్కియున్న ద్రావిడస్త్రీల కెంత వెట్టియో కదా! ఈపద్యమున శైలీపాటవము గానరాదు. చమత్కారజనకమైన కల్పనయు లేదు. కల్లరి=వంచకము. అనునర్థము సరిపడునట్లులేదు. సహజములుమాత్ర మీపద్యమునం దొండురెండు గలవు. దారిపోవువారిని తెప్పలార్పకుండఁ జూచుట, తీక్ష్ణపయోధరాగ్రములు గలుగుట యనునివి. పంచపాదిగా రూపొందిన యీపద్యముకూడ శ్రీనాథునిరచనగాఁ గానరాదు.

కర్ణాటాంగన—

మ. కుసుమం బ[1]ద్దినచీరకొంగు వొలయం గ్రొవ్వాఱుపాలిండ్లపైఁ
త్రిసరంబుల్ వ్రాలుపాఱ వేణి యవటూదేశంబుపై రాయ[2]న
ప్పస మెవ్వాఁడో యొకండు రా[3]త్రి రతులం బల్గాని గావింపఁగా
వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం గంటిరే.

ఇది శ్రీనాథుని వీథినాటకములోనిపద్యముగాఁ బెక్కు లక్షణగ్రంథములం దుదాహృతమైయున్నది.

చెంగావిరం గద్దినచీరకొంగు తొలఁగిపోవ, క్రొవ్వు తరిగినపాలిండ్లమీఁద ముప్పేటహారముల మురువు తరుగ, కొప్పు బిగి సడలి మచ్చిలిగుంటమీఁద రాపాడ, రాత్రి యంతయు నెవఁడో యొకఁడు సురతక్రియలచే మిక్కిలి పీడ గలిగింపఁగా, అంగము లన్నియు వసివాళ్లువాడుచు వచ్చు చున్న కర్ణాటాంగనను గంటిరా! యని యీపద్యభావము. సురతమృదితమై విశ్లథావయవమై వ్యత్యస్తవేషభూషమైన కర్ణాటాంగనారూపరేఖాచిత్రణ మిం దమోఘముగఁ గావిం పఁబడినది. ఈపద్యమంతయు తీయని తెలుఁగునుడికారపుఁ దీరులో నడచినది. భావనామయమైన కవితాశిల్ప మిం దద్భుతముగఁ గొనసాగినది.

ఈక్రిందిసీసపద్యము శ్రీనాథునిచాటువుగా ముద్రిత ప్రతు లన్నిటిలోని కవతరించినది. శ్రీనాథునిరచనతోడి సామ్యమును జాలవఱకు వహించియుండుటచే నిది శ్రీనాథుని

1. బెట్టిన, 2. గాఁబస, 3. సురతప్రౌఢిం దనుం దేల్పఁగా.

శృంగారపద్యముల చిట్టలోని కెక్కిపోయినది. కాని యీ
పద్యము గోగులపాటి కూర్మనాథకవి రచించిన 'మృత్యుం
జయవిలాస' మను యక్షగానములోనిది. పార్వతీదేవి నార
దునివాక్యము నుపశ్రుతిగాఁ గొని, తండ్రియగు హిమవంతు
నాజ్ఞను గైకొని, హిమత్పర్వతముమీఁదఁ దపముచేయుచున్న
పరమేశ్వరుని సేవించుటకై వచ్చినప్పటి యాజగజ్జననీసౌం
దర్యవర్ణనక్రమములోని దీపద్యము.

సీ. బొమవింటఁ దొడిగిన పూఁజిల్కు దొరముల్కి
పోలికఁ గస్తూరిబొట్టు దిద్ది
చకచక లీనుతారకల తళ్కులవోలె
కొలుకులు వెడలఁ గజ్జలము దీర్చి
పొడుపుగుబ్బలిమీఁదఁ బొడముసీగెంపనా
రంగుచందురుకావి గవిక దొడిగి
పిఱుఁదు పొక్కిలి యనుపొరకపల్లము గప్పఁ
బాలవెల్లువ మించుచేల గట్టి
యంచకొదములగమి బెదరించులాగు
నందెచప్పుళ్లు ఘల్లుఘల్లనుచు మొరయ
నడుము జవజవలాడఁ గీల్జడ చలింప
వచ్చె ముక్కంటిసేవకు మచ్చెకంటి.

మీననేత్రి యగుపార్వతి త్రిణయనుఁడైన పరమేశ్వ
రుని సేవింప వచ్చినది. కనుబొమ్మ లనువింటిలో పూఁచిన
మన్మథబాణమో యనునట్లు నుదుట కస్తూరిబొట్టు సొగగా
దిద్దినది. చకచకలాడు నల్లగ్రుడ్ల కాంతులో యనునట్లులు
కొలుకులనుండి బయటకు వచ్చునట్లు కాటుక పెట్టినది.

ఉదయపర్వతముమీఁద వ్యాపించునీరెండను బోలినచంద్ర కావిరంగు రవిక దొడిగినది. పిఱుఁదు పొక్కిలి యనుమెట్ట పల్లములను గప్పివేయు పాలవెల్లువను మించు తెల్లనిచీర గట్టి నది. రాజహంసలగుంపును బెదరించువిధమున గల్లల్లుమనుచు నందెలు ధ్వనించినవి. వయసు జవజవలాడినది. కీల్జడ కద లాడినది. జగజ్జననీసౌందర్యము నింతమధురోదాత్తముగ నీపద్యమునఁ జిత్రించియుండ దీనిని శ్రీనాథునిశృంగారపద్య మునుగా లెక్కించి కూర్చినవారిసద్భావము నేమనుకొన వలయునో, యెఱుఁగరాకున్నది. శృంగార మేపాటి కంటఁ బడినను, అందును గొంచెపాటిశయ్యాసౌభాగ్యము గాన వచ్చినంతనే యది శ్రీనాథున కంటఁగట్టుట కీపద్యము శ్రీనా థున దనుటయే ప్రబలనిదర్శనము.

ఇటులనే శ్రీనాథుని కాలములోనివాఁడుగా నెఱుఁగఁ బడు తురగారామకవి రచించిన యీక్రింది రెండుపద్యములు శ్రీనాథునివిగా లెక్కింపఁబడి యొకప్పటివ్రాఁతలలోని కవత రించినవి.

ఉ. చూడఁగ నల్ప గాని పరిశోభితదివ్యకరంగనాభ మే
జాడను రాజయోగ్యమగు జవ్వని నల్లని మేనుసంచుతో
నాడఁగ రాదుగా! రతిరహస్య మెఱింగిన చిత్తసంభవ
క్రీడలఁ జేఱి చూడవలె నేదఁగి గంగి విచిత్రవైఖరుల్.

ఉ. భూతలమందు ఘాతమ నపూజ్యత గన్గెను రెంట మూఁట భా
గోతులబుచ్చిగాని కొకకొంచె మనంగగృహంబు సేయుమిఁకా

భీతకురంగనేత్ర యగు పెండెల నాగికి పుర్క్ర జాతసం
ఘాతము లుంచినంచులకు గంగిని నల్వాపరించినందుకుఁ.

ఈపద్యములు రెండును శ్రీనాథునివి గావనియు, నివి తురగా రామకవిరచనయే యనుట క్రిందిపద్యముపోద్బలకము.

ఉ. పెండెల నాగి కొప్పపయి పెద్దికటిస్థలి గంగిగుబ్బచ
న్గొండల నుండురామకవికుంజరుహ స్తము క్రిందు సేసె హా
పండక బంటుపల్లి; యది పండిన నీకసుమాలిధారుణీ
మండలనాథుఁ బోలు నొకమానవమాత్రుని వేడఁబోదు నే?

ఈతుదిపద్యమును బట్టి పెండెలనాగిగో డను గేదగి గంగిగోడను బరిచితి, తురగా రామకవి కేర్పడియుండె ననుట తెల్లముగాన పై రెండుపద్యములు శ్రీనాథునిరచనలు గానట్లు తెల్లము. శ్రీనాథునిరచనలు గానివికూడ వానివిగాఁ జెల్లిపోవుచున్నవనుటకుఁ బై పద్యములు రెండు శ్రీనాథునివిగా గణించుటకూడ నొకనిదర్శనము.

శ్రీనాథుని రచనగానిది, ఆతనిదిగాఁ గూర్పఁబడినది యీక్రిందిపద్య మొక్కటి.

శా. దాయాదుల్వలె గుబ్బచన్నులొఱయన్ ధావళ్యనేత్రాంబుజ
చ్ఛాయ ల్తాండవమాడఁ గేరి పురుషస్వాంతమ్ముల న్మన్మథుం
డేయం జంగమువారిచంద్రముఖి విశ్వేశార్చనా వేళలన్
వాయించెం గిరిగిండ్లు బాహుకుళలవ్యాపారపారీణతన్.

జంగమువారిసుందరి యొక తె, విశ్వేశ్వరపూజాసమయమున తనహ స్తలాఘవ మేర్పడునట్లు తాళములు వాయిం

చెను. ఆవాయించుటలో నామెప్పృథులవక్షోజము లొండొం టితో రాపాడినవి. తెల్లనైన నేత్రపద్మములకాంతులు గంతులు వైచినవి. ఆమెనుజూచి యువ్విళ్లూరుపురుషచిత్తము లందు మన్మథుఁడు కుప్పించి బాణములు నిగుడించినాఁడు. ఇది విశ్వేశార్చనాసమయముగాన నిది మన్మథబాణప్రసార మున కదను గాదు. మన్మథబాణములుపడుటకుఁ దగిన సౌందర్యరేఖాసాక్షాత్కార మీపద్యమున లేదు. దీనిలో నట్టిమూర్తి చూపట్టుట లేదు. స్త్రీలపూజావసరములం దిట్టి వర్ణన చేయుపరిపాటి శ్రీనాథునకు లేదు.

శివరాత్రిమాహాత్మ్యమున సుశీలచే నోంకారశంకరు నకుఁ బూజచేయించినక్రమము పరికింపుఁడు.

సీ. అభిషేక మొనరించు నలినీలకుంతల
శంభు పోమోద్భవాసలిలధార
సెలఁతె యభ్యర్చించు నీలోత్పలంబులఁ
దరుణనిర్మలసుధాధామవతాళి
గరళకూటగ్రాసకల్మాషకంధరు
మేన గంధ మలందు మీననేత్ర
యర్పించు దివ్యోపహారంబు లెలనాఁగ
కుటిలకుండలరాజకుండలునకు
నలివ దిరుగుఁ బ్రదక్షిణం బభవ్రుగుడికిఁ
గుచభరంబున నరగాను గూనుగిలఁగ
రవలమట్టెలమ్రోఁతతో రాయిడింపఁ
జరణనూపురఝుళంఝుళరవంబు,

ఈపద్యమున భక్తిభావసముద్బోధకసామగ్రితోఁ బాటు సుశీలాసౌందర్యరేఖ సమున్మీలితమైనది. అసద్భావ ముదయించుట కెడమిచ్చు పదవిన్యాస మేపాటియు లేదు. కావున 'దాయాదుల్వలె' ఇత్యాదిపద్యము శ్రీనాథునిరచన కానేరదు.

ఈక్రిందిచాటువులో సహజమధురమైన యొక దృశ్యము సుకుమారమైనరచనతోఁ దీర్పఁబడినది.

ఉ. పువ్వులు కొప్పునం దుఱిమి, ముందుగఁ గా నసియాడుచుండఁగాఁ
జెవ్వన జంగ సాఁచి యొకచేతను రోఁకలిఁబూని యొయ్యనన్
నవ్వుమొగంబుతోడఁ దననందనుఁ బాడుచు నాథుఁ జూచుచున్
సువ్వియ సువ్వియంచు నొకసుందరి బియ్యము దంచె ముంగిటన్.

ఒకయందగత్తె బియ్యము దంపునప్పటి హస్తపాదాద్యవయవవిన్యాసభంగి యీపద్యమునం దందముగ చిత్రింపఁబడినది. ఒకసుందరి కొప్పులోఁ బువ్వులు దుఱిమి, నడుము ముందునకుఁ గదలుచుండఁగా, చెవ్వన పాదమును ముందునకు సాఁచి, ఒంటిచేతితో రోఁకలిఁ బూని, నగుమొగముతోఁ బాటపాడి తనబిడ్డ నూరడించుచు, చూపులతో నాథుని తృప్తిపఱచుచు, సువ్వి సువ్వి యని యూఁత పలుకుచు ముంగిలివాకిటిలో బియ్యము దంచుచున్నది. ఇచట స్తన్యమపేక్షించువాఁడు బాలుఁడు. అన్న మపేక్షించువాఁడు నాథుఁడు. ఈబియ్యము దంచినఁ గాని భర్త నూరార్చుట పొసఁగదు. దంచునంతవఱకు స్తన్యము లభింపక రోదించు

బిడ్డ నూరార్చినఁ గాని బియ్యము దంపుట కుదురదు. రోఁక లితో బియ్యము దంచుట శ్రమకలిగించుపని. అంతకంటెను వ్యథకలిగించునది నందననాథుల నకనకలాట చూచుట. కావునఁ దనకుఁ గలిగెడి పరిశ్రమమును సువ్వి సువ్వి యను నూఁతతోఁ బోఁగొట్టుకొనుచు, పాటపాడుటచే బిడ్డ నూరా ర్చుచు, నగుమొగముతోఁ గూడిన చూపులతో నాథుని హృద యమును దేర్చుచు నాసుందరి తనపని సాగించుచుండె నను భావ మిందానూచితము. బియ్యము దంపునప్పటి సన్నివే శము లన్నియు నిందాయోజితము లయినవి. నందనుఁ బాడుటతో నాథుని చూచుటతో నాశ్వాసము గలిగించుట యతిసుకుమార మైనప్రయోగము. ఈదృశ్యసాక్షాత్కార మునకుఁ గైకొనఁబడిన తీయని తెలుఁగునుడులు భావము నెంతేని మధురముఁ గావించినవి. భావన చొఁఅఁబాఱు నంతకు నీపద్యమునుండి వింతయొయ్యారములు తులకించును.

ఒకసుందరి బియ్యము దంపునప్పటియొయ్యారము నందముగాఁ జిత్రించిన యీపద్య ముండుట చూచి బుద్ధి శాలు రెవ్వరో ఒకమోహనాంగిచేఁ బిండిరుబ్బించి, యీ యందమును దమయూహకొలఁది చిత్రించి యీపద్యమును శ్రీనాథుని శృంగారమున కంకితముచేసినారు.

సీ. తాటంకయుగ ధగద్ధగిత కాంతిచ్ఛటల్
చెక్కుటద్దములపై జీరువాఱ
నిటలేందుహరినీలకుటిలకుంతలములు
చిన్నారిపోముపైఁ జిందుద్రొక్క

బంధురమౌక్తికప్రకరహారావళుల్
　　గుబ్బపాలిండ్లపై గునిసి యాడ
గరకంకణక్వణక్వణనిక్వణంబులు
　　పలుమాఱు జాతిపైఁ బరిఢవిల్ల
నోరచూపుల విటచిత్త మూఁగులాడ
బాహుకుశలత చక్కని మోహనాంగి
పాటపాడుచుఁ గూర్చుండి రోటిమీఁదఁ
బిండి రుబ్బంగఁ గన్నులపండు వయ్యె.

చక్కని యొక మోహనాంగి రోటిమీఁదఁ గూర్చుండి పాటపాడుచు హస్తలాఘవముతోఁ బిండిరుబ్బుట చూచు వారికిఁ గన్నులపండువయ్యెను. ఆపనిలో నామె చెవికిఁబెట్టిన కమ్మలజంట కదలాడుటచే ధగధగ మనుకాంతిరేఖలు చెక్కుటద్దములమీఁద జీరాడుచుండెను. నుదు రనుచంద్రునిమీఁద ఇంద్రనీలమణులవంటి కురులు వ్రేలాడి అందమైన ముఖముపైఁ జిందులుద్రొక్కినవి. మనోహరమైన ముత్యాల హారము లెత్తయినపాలిండ్లపైఁ నాట్యము చేసినవి. చేతఁ దాల్చిన కంకణములకలకలధ్వనులు జాతిమీఁద ధ్వనించినవి. ఆమె యోరచూపులతో విటులచిత్తము నూఁగులాడించినది. ఈపద్యములో 'ధగద్ధగితకాంతి' అనన్వితము. నిటలేందునకు సంబంధము సరిపడదు. క్వణక్వణనిక్వణంబులు పునరుక్తములు. ఆధ్వనులు జాతిపై పరిఢవిల్లుట యసంబద్ధము. రోటిమీఁద కూర్చుండి పిండి రుబ్బుట యసంభవము. ఇది శ్రీనాథునిరచన యెంతమాత్రముగాదు.

ఈక్రిందిపద్యము శ్రీరంగములోని వైష్ణవవధూటిసౌంద ర్యమును జిత్రించి పెట్టినట్టుగ శ్రీనాథున కర్పితము చేయఁ బడినది. ఇదియును శ్రీనాథునిరచనగాఁ దోఁపదు.

సీ. ఒకచెంప కొరగా నొనఁగూర్చి దిద్దిన
        తురుమునసుండి క్రొవ్విరులు రాల
రాత్రి నిద్దుర లేని యాత్రప్రయాణంపు
        బడలిక నడుగులు తడఁబడంగ
వింతవారలఁ జూచి వెస నవ్వునెడఁ గప్పు
        గలదంతముల కాంతి వెలికిఁ బాఱఁ
జిడిముడినడచుటఁ జెలరేగి గుబ్బల
        పైఁ దాఁకి యొక్కింత పైఁట జాఱ
చెమటచేఁ దిరునామంబు చెమ్మగిల్ల
వాళి డాచేత విడియంబు గీలుకొలిపి
రంగపురిరాజవీథిఁ గానంగనయ్యె
నాదుమదిఁ గోర్కె లూర వైష్ణవవధూటి.

శ్రీరంగపట్టణరాజవీథిలో నామనస్సున కోరిక లూర నొకవైష్ణవవనిత కానవచ్చినది. ఆమె యొకప్రక్కకు వచ్చునట్టు లోరగాఁ బెట్టినకొప్పునుండి పూవులు రాలుచున్నవి. రాత్రియంతయు నిద్రలేకుండ యాత్ర సాగించుటచే ప్రయాణపుబడలిక నడుగులు తడఁబడుచున్నవి. వింతవ్యక్తులను జూచి నవ్వునప్పుడు నల్లనిదంతములకాంతి బయటఁబడుచున్నది. తొట్రుపాటుగా నడచుటచే పైఁట మీఁది కెగసి కుచముల మీఁదిభాగము దాఁకి జాఱిపోయినది. చెమటచేఁ దిరునామము చెమ్మగిల్లినది. ఆసక్తితో నెడమచేతఁ దాంబూ

లము దాల్చి వచ్చినది. ఈపద్యమున భావనాసమున్మిషిత మైన కల్పన యేమియుఁ గానరాదు. శైలిలో బిగు వేమియు లేదు. మార్గాయాసవిశ్లథమైన యవయవసౌందర్యనిరూప ణమునం దైన యొకక్రమ మేమియు లేదు. మార్గాయాస విశ్లథావయవ యైనవనిత, చేతఁ దాంబూలము దాల్చుట లోని సొగ సేమియో, యెఱుఁగరాదు. ఇది శ్రీనాథుని రచనగాఁ దోఁపదు.

కాశీఖండమునందలి మార్గాయాసవిశ్లథవిన్యాసమైన వనితాసౌందర్యమును జిత్రించిన యీక్రిందిసీసపద్యముతోఁ బోల్చిచూచుకొనిన, నీపద్యము శ్రీనాథునిరచన యగునో? కాదో? యెఱుఁగవచ్చును.

సీ. త్రసరేణుపరిమాణధాతుఘూళీపాళి
  యలకంబులకు వింతచెలువు నొసఁగ
ఘనమైన రారాపుచనుదోయిరాయిడి
  నిరుపేదనడిమికి వెలుపుఁ జూప
పాలుపాఱుమెఱుఁగుఁదీఁగల నేలుకన్నులు
  వడదాఁకి యొక్కింత వాడువాఱ
సింధూరతిలకంబు చెమటచిత్తడి దాఁకి
  యలికభాగంబునం దసలుకొనఁగఁ
గనకమేఖల జఘనచక్రమున వ్రాల
నీవిబంధంబు నాభిపై నెమ్మివదల
మహతి ధరియించి యొకతనుమధ్య తన్ను
ననుసరించుచు గాంధర్వ మభ్యసింప.

త్రసరేణుపరిమితమైన పదార్థము కంటి కగపడును. కంటి కగుపడునంతటి ధూళి పంక్తిగట్టి ముంగురులుపైఁ బడి వింతయైనసొబగును గూర్చినది. పెద్దదైనయురోజము లోక దానితో నొకటి రాపాడి కడుబీదదైన నడు మేమగునా, యని భయమును గలిగించెను. అందమైన మొలుఁగుఁదీఁగ లను మీఱుకన్నులు ఎండవేఁడిమి దాఁకి కొంచెము వాడు బాఱినవి. చెమటపదును తాఁకి సిందూరపుబొట్టు నొసట బందమైనది. బంగారుమొలనూలు జఘనముమీఁద వ్రాలి నది. కోకముడి బొడ్డుమీఁదినుండి సడలినది. ఇట్టి విశ్లథ స్థితిలో నుండి 'మహతి'యనువీణను దాల్చి యొకతనుమధ్య సంగీత మభ్యసించుచు నారదునివెంట వచ్చుట యీపద్య మున చిత్రింపఁబడినది. శ్రీనాథుని యీసౌందర్యచిత్రణము నందుఁ జూపట్టెడి శిల్పము కడువిలక్షణము. ఇట్టి శిల్పనైపుణి తులకించు సౌందర్యాభివర్ణనము లేనికేవలావయవవర్ణన మును శ్రీనాథునిరచనగా మన మూహింపఁజాలము.

పలనాఁటిసీమకుఁ జెందినచాటువులు—

శ్రీనాథుఁడు కొండవీటఁ జిరకాలముండినవాఁడు. ఇంతియగాక దానేప్రాంతమునకుఁ బోయినను నాయాచోటు లందుఁ దనకుఁ గానవచ్చిన విషయవిశేషములను పద్యదర్ప ణమునఁ బ్రతిఫలింపఁజేయునైపుణి గలవాఁడు. తన్మూలమున కొండవీటికి సన్నిహితముగా నుండిన పలనాఁటిసీమకుఁ బలుతడవలు పోయియుండి యచటఁ గాగవచ్చిన దృశ్యము

లను బరిపాటులను గొన్ని తనచాటువులలోఁ గూర్చి పెట్టి నాఁడు. కాని యీచాటువులలోఁ గానవచ్చెడి దృశ్యములు ఆనాఁట నెట్లుండె ననినాఁడో నేఁటికి నవి యట్లే నిలిచి యుండినట్లు దెలియవచ్చుచున్నది. ఒక్క విశేషము మాత్ర మీచాటురచనలో గోచరించును. శ్రీనాథున కావల్లెనాఁటి సీమపై సద్భావ మేపాటియు లేనట్టులే యనిపించుచున్నది. మన కుపలబ్ధమైన చాటువులన్నిటిలో నాతని కాసీమపైఁగల వైరస్యమే స్ఫురించుచున్నది. ఉపలబ్ధమైయున్న కొన్ని చాటువు లుదాహరించెదను.

శా. వీరులు దివ్యలింగములు; విష్ణువు చెన్నుఁడు; కల్లిపోతురా
జారయఁ గాలభైరవుఁడు; నంకమశక్తియ యన్నపూర్ణయౌఁ
గేరెడి గంగధారమడుఁగే మణికర్ణిక గాఁ జెలంగు నీ
కారెమపూఁడిపట్టణము కాశి గదా! పలినాఁటివారికిన్.

పలినాఁటిసీమలో నుండెడిజనులకు కారెమపూఁడియే కాశీపట్టణము గదా ! పలినాఁటిసీమలో నుండెడివీరులవిగ్రహములే కాశీపట్టణవాసిలింగములకు సరిపడినవి. అచట నున్న చెన్నకేశవస్వామియే విష్ణుమూర్తి. కల్లిపోతురాజే కాలభైరవస్వామి. అంకమ్మశక్తియే అన్నపూర్ణాదేవి. జలతరంగములతోఁ గూడిన గంగధారమడుఁగే మణికర్ణికాఘట్టము. ఇట్టిసామగ్రితోఁ గూడిన కారెమపూఁడిపట్టణమునే కాశిగా భావించెడి పలినాఁటివారి పరిణతి యీపద్యమునం దభివ్యక్తమైనది.

క. రసికుఁడు పోవఁడు పల్నా
డెసఁగంగా రంభయైన నేకులె వడకున్
వసుధేశుఁడైన దున్నును
గుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్.

ఆనాఁటి పలనాఁటిసీమలో రంభవంటి యందగత్తె యైనను నేకులువడకువదిగను, భూమిని బాలించు ప్రభువైనను పొలము దున్నువాఁడుగను, మన్మథునివంటి సుకుమారుఁడైనను జొన్నన్నమే తినువాఁడుగను గానవచ్చినాఁడు. కావున నాగరికత నపేక్షించువాఁ డెవఁడు పల్నాటికిఁ బోవరా దనినాఁడు.

ఉ. అంగడి యూర లేదు, వరియన్నము లేదు, శుచిత్వ మేమి లే
దంగన లింపు లేరు, ప్రియమైన వనంబులు లేవు, నీటికై
భంగపడంగఁ బాల్పడు కృపాపరు లెవ్వరు లేరు, దాత లె
న్నంగను సున్న, గానఁ బలనాఁటికి మాటికిఁ బోవనేఁటికిన్.

పలనాఁటిసీమలో నుండినయూళ్లలో నేయూరను అమ్ముటకుఁ గొనుటకు నుపయోగపడు బజారు లేదు. జొన్నన్నమే కాని వరియన్నము లేదు. పరిశుభ్రత యెచ్చటను గానరాదు. అంగనలలో నందగత్తె లెవ్వరును లేరు. దృష్టిప్రియమైన తోఁటలులేవు. నీటికై యవమానపడుచుండ రక్షణపక్షము వహించుదయాపరు లెవ్వరు లేరు. దాతలుగా లెక్కింపఁబడువారు లేనేలేరు. కావున సౌందర్యసమీక్షాతత్పరుఁడు సహృదయుఁడు కళామయనిర్మాణద్రష్టయునగు వాఁడు పలనాఁటికి మాటిమాటికిఁ బోవనేఁటికి అనినాఁడు.

ఈపద్యమునుబట్టి శ్రీనాథుని చిత్తవృత్తి నంటియున్న సంస్కారము లెట్టివో యెఱుఁగవచ్చును. ఆనాఁడు శ్రీనాథునివంటి యుదాత్తభావనాసమన్వితవ్యక్తి కెట్టియూరు గమనయోగ్యమో, యెట్టిది కాదో, యనువిషయ మిందు గుర్తింపనగుచున్నది. ఈపద్యమునందలి 'అంగన లింపు లేరు' అనువాక్యమాతని శృంగారిత్వమునకు నిదాన మనినారు. ఆతరువాతి వాక్యమగు ప్రియమైన వసంబులు లేవు, అనువాక్యమును దీనితో జోడించి భావించినచో దృష్టిప్రియమైన సౌందర్యసామగ్రి యచట లేదనియే తోఁచును గాని, సహృదయులైనవారికి వేఱొకయర్థము స్ఫురింపఁబోవ దని నామనవి.

శ్రీనాథునకు శుచిత్వమునం దపేక్ష యెక్కువగ నుండినట్టును అశుచిత్వమున కాతఁ డేవగించుకొను ననియు, నాసీమలోని పురోహితుల యింటికృత్యములను రోఁత గలుగునట్లు వర్ణించిన యీక్రిందిపద్యము తార్కాణించుచున్నది.

సీ. దోసెడుకొంపలోఁ బసులత్రొక్కిడి మంచము దూడరేణము గాఁ
బాసినవంటకంబు పసిబాలురశౌచము విస్తరాకులుఁగా
మాసినగుడ్డలుం దలకు మాసినముండలు వంటకుండలుఁగా
రాసెఁడు కట్టెలుం దలఁపరాదు పురోహితు లింటి కృత్యముల్.

సామాన్యముగఁ ప్రాచీనకాలమున బ్రాహ్మణాగ్రహారము లన్నియుఁ దపశ్చర్యకు యోగ్యమైన నదీతీరములందే వెలసియున్నవి. వైదికకర్మనిష్ఠాపరులైన విప్రులు తృణకాష్ఠజలసమృద్ధమైన చోటులందే నివసించెడివారు. పవిత్ర

మైన జలాశయములు లేనిపల్లెలలో నాఁటికి నేఁటికిఁ గూడఁ గొందఱు బ్రాహ్మణులు పురోహితకృత్యము నిర్వహించెడివారు ఒక్కొక్కరుగా నివసించుచుండుట పరిపాటియైనది. వారియిండ్లలోఁ బరిసరవాతావరణమే చూపట్టుచుండును. ఈపద్యమున వర్ణించిన దృశ్యములు నేఁటికిని గొన్నిపల్లెలలోఁ గానవచ్చును. అట్టివాని నీపద్యము కన్నులయెదుటఁ గాన్పింపఁ జేసినది. శ్రోత్రియవర్తనము గలిగి శుచిత్వము నాకాంక్షించు శ్రీనాథున కనివార్యముగ ననుభవింపవలసివచ్చిన యేవము నిట్లు వెలువరించినాఁడు.

ఆ. చిన్నచిన్న రాళ్లు చిల్లరదేవళ్లు
నాగులేటినీళ్లు నాపరాళ్లు
సజ్జజొన్నకూళ్లు సర్పంబులును దేళ్లు
పల్లెనాఁటిసీమపల్లెటూళ్లు.

పల్నాటిసీమపల్లెటూళ్లలో చిన్నచిన్నరాళ్లు చిల్లర చిల్లర దేవతావిగ్రహములు హెచ్చు. కారెమపూఁడిపరిసరమునఁ బ్రవహించెడినాగులేటినీళ్లే యచట లభించుజలము. నాగులేటిప్రవాహమున కడుగున నాపరాళ్లును హెచ్చు. ఆహారించుటకు సజ్జన్నము జొన్నన్నము మాత్రమే లభించును. పాములు తేళ్లుకూడ నచట హెచ్చు. ఈనాఁటికిఁ గూడ నీపద్యమునందుఁ జిత్రించిన విషయము లన్నియుఁ బల్నాటిలోఁ జూపట్టుచునే యున్నవి. శ్రీనాథుని కవనలో నాతనిసమకాలికదృశ్యములు పరమసత్యములై చూపట్టు

ననుట కీపద్యము ప్రబలమైన తార్కాణము. శ్రీనాథునకు గురిజాలలోఁ దటస్థించిన దురవస్థ నీక్రిందిపద్యము తెల్లము చేసినది.

క. తేలా కాయెను భోనము
పాలాయెను మంచినీళ్లు పడియుండుటకున్
నేలా కలవాయె నిసీ!
కాలినగురిజాల నిష్టకామేశ శివా!

ఈపద్యమున శ్రీనాథుఁడు తా ననుభవించిన దురవస్థనుగూర్చి పరమేశ్వరున కిట్లు మొఱపెట్టుకొనినాఁడు. ఇష్టకామేశ్వరా! ఈమండిపోయినగురిజాలలో తేలుకుట్టిన విషవేదనను తగ్గించుట కౌషధముగ నుపయోగించిన ఆకులే భోజనమయ్యెను. త్రాగినపాలే మంచినీళ్లయ్యెను. పడియుండుట కనువైన నేలకూడ కలవయ్యెను. ఈపద్య మాతఁడు గురిజాలలో తేలుకుట్టి బాధపడినప్పుడు రచించినదై యుండును. ఈనాఁటికిని పల్నాటిలో తేళ్లు విరివిగా నుండుట, అవి కుట్టిన విశేషముగ బాధపడుటయుఁ గలదనియే యెఱుఁగ వచ్చుచున్నది.

ఈక్రిందిపద్యమున 'అడిగొప్పుల' యనుగ్రామము నందు వీచెడి హోరుగాలి నెంతో సహజముగఁ జిత్రించి యున్నాఁడు. ఈనాఁటికిని తత్పరిసరములం దెచ్చటను లేని హోరుగాలి యీయూరనే గలదు.

క. గుడిమీఁదిక్రోఁతితోడను
గుడ్డిలోపలి నంబివాడకోడలితోడ

నడివీథిలంజతోడను
నడిగొప్పుల హోరుగాలి నడిగితి ననుమీ.

ఈరచననుబట్టి అడిగొప్పులలో గుడిమీఁద కోఁతి యుండినట్టులు, గుడిలోపల కోఁతిచేష్టలుగలదియో, కోఁతి యాకృతిగలదియో యొకనంబివారికోడ లుండినట్టులు తెలియవచ్చుచున్నది. నడివీథినిబడి లంజెరికము సాగించు వనిత లుండువా రనియుఁ దెలియవచ్చుచున్నది. కాని యీక్రింది చాటువునుబట్టి యీఁనంబివారికోడలి కుశలప్రశ్నము నడుగుటలో సద్భావమే గోచరించును. తన్మూలముగ నీపద్యమును బట్టి శ్రీనాథునకు సహజమైన వాస్తవికదృశ్యసాక్షాత్కార నిర్మాణపాటవమే గోచరించును గాని ఆతనివికారజీవితానుభూతి తెలియరాదు.

క. నడినూక లేనియన్నము
వడఁబోసిన నేయి బుడమువరుగుల్ పెరుగున్
గడి మాడ సేయఁ బెట్టిన
నడిమాచల నంబిపడుచు నడిగితి ననుమీ.

బియ్యములో నడుమనడుమ నూక లుండిన అన్నమడుగంటును. నేయి వడఁబోసిన పరిశుద్ధముగా నుండును. ఇంపైన యన్నముపెట్టి శుద్ధమయిన నేయివేసి, బుడమవరుగుల కూరచేసి పెరుగుపోసి, ఒకముద్ద మాడ (రెండురూపాయలు) ఖరీదు చేయునట్టులు భోజనముపెట్టిన అడిమాచల (ఇది యడిగొప్పులయే కావలయును) వాసినియైన నంబివారి కోడలి నడిగితి ననినాఁడు. దీనినిబట్టి నంబివారికోడ లాతనికి

తుష్టిని గలిగించుభోజనము పెట్టియుండుటచే నామె యోగ క్షేమము లరసినట్టులు తెలియవచ్చును.

క. జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలు దప్పన్
సన్నన్నము సున్న సుమీ
పన్నగ బలినాటిసీమ ప్రజలందఱకున్.

జొన్నకడుగు, జొన్నపిండితోఁ జేసిన అంబలి, జొన్నన్నము జొన్నపొట్టు జొన్నలే తప్ప, పలనాఁటిసీమప్రజలందఱకు సన్ననివరియన్న మెంతమాత్రము లభింపదుసుమా! శ్రీనాథునకు సన్నబియ్యపువరియన్నమునిన విశేషమయిన ప్రీతియు, జొన్నన్నముమీఁద హెచ్చయిన యనాదరము నుండినట్టు లీపద్యమును, ఈక్రిందిచాటువును జాటుచున్నవి.

ఉ. ఫుల్లసరోజనేత్ర యలపూతనచన్నులచేఁదు ద్రావినా
నల్ల దవాగ్ని మ్రింగితి నటంచును నిక్కెద వేల ? తింత్రిణీ
పల్లవయుక్తమౌ నుడుకుబచ్చలిశాకము జొన్నకూటితో
మెల్లన నొక్కముద్ద దిగమ్రింగుము ; నీపస గానవచ్చెడిన్.

శ్రీకృష్ణా ! నీవు వెనుక నెప్పుడో విషపూరితమైన పూతనయనురాక్షసి చనుబాలు ద్రాగితి నని, దవాగ్నిని మ్రింగితి నని గర్వించెద వేల ? ఉడుకుగానుండి, చింతకూర జోడించి వండిన బచ్చలకూర జొన్నన్నములోఁ గలిపి యొక్కముద్ద మ్రింగుము. నీపస బైటఁబడును. అనఁగాఁ జింతచిగురు కలిపి వండిన బచ్చలికూరతో జొన్నన్నము కలిపి తినుట విషముమ్రింగుటకంటె దావాగ్నిభక్షణముకంటె

కఠినమైన పని యని యీపద్యము వివరించినది. నిజమునకు వరియన్నమున కలవాటు పడినవారికి జొన్నన్నము తినుట విషభక్షణప్రాయమే యగును. జొన్నన్నమునుగూర్చి శ్రీనాథునకుఁ గల రోఁత యంతయు నీపద్యమునందు వ్యక్తమయినది.

పల్నాటిసీమలో మంచినీరు దొరకనపుడు ఈక్రింది పద్యము చెప్పినట్టు లాంధ్రదేశమంతటను నీక్రింది చాటువు వ్యాప్తమై యున్నది.

క. సిరిగలవానికిఁ జెల్లును
దరుణులఁ బదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్ద రాండ్రా
పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్.

ఇది యొక మధురోదాత్తకల్పనము. సిరిగలవాఁడు విష్ణువు. శ్రీకృష్ణుఁడు విష్ణువు నవతారము గాన నాతనికిఁ బదియాఱువేలభార్యలను బెండ్లాడినను జెల్లును. ఈశ్వరుఁడు బిచ్చ మెత్తుకొనువాఁడు. తిరిపెపువృత్తిగలవాని కిద్ద రిల్లాండ్రు కూడనా! కావున నోయీశ్వరా! గంగను వదలివేయుము. ప్రక్కనున్న పార్వతి సరిపడునులే.

ఈశ్వరుఁడు పార్వతిని విధిపూర్వకముగఁ బెండ్లాడినాఁడు. కావున నామె యర్ధాంగినియై దూరముసేయరానిది. పార్వతి భార్యగా నుండఁగ నీశ్వరుఁ డదనముగ గంగాదేవిని భార్యగాఁ గొనితెచ్చినాఁడు. బిచ్చమెత్తుకొని జీవించువాని

కిద్దఱు భార్యలెందుకు ? గాన తలమీఁద నధిష్ఠించియున్న గంగను వదలు మనినాఁడు. దానివలనఁ దలమీఁదిభారము తగ్గును ప్రస్తుతప్రకరణమునం దపేక్షితమైనది విశుద్ధమైన జలము. అది పరమేశ్వరానుగ్రహాలభ్యము. దాని నీతీరుగ వక్రోక్తిభంగిలో వర్ణించుట యద్భుతకల్పనాసమ్మితమై యొస లారినది.

ఈపలనాఁటికిఁ జెందిన 'పులిపాఁడు' అనుగ్రామమును గూర్చి చెప్పిన దీపద్యము.

ఆ. ఊరు వ్యాఘ్రనగర మురగంబు కరణంబు
కాఁపు కపివరుండు కసవు నేఁడు
గుంపుగాఁగ నిచట గురిజాలసీమలో
నొగులెల్లఁ గూడి రొక్కచోట.

ఊరు పులిపాఁడు. అచటి కరణము సర్పము. (శేషయ్య) కాఁపు కపిశ్రేష్ఠుఁడు. (హనుమంతయ్య) నాయకుఁడు (గ్రామాధికారి) గడ్డయ్య. ఈతీరుగ గురిజాలసీమలో మూర్ఖులందఱు నొకచోట గుంపుగాఁ గూడినారు. పులిపాఁడు గ్రామమున నాతని నెవ్వరు నాదరింపనినాఁ డీపద్యము వెలసి యుండును.

ఇటులనే కడిఁదిపురమునకుఁ జెందిన యాక్రిందిచాటు వొకటి గలదు. ఈకడిఁదిపురముకూడ పల్నాటిసీమకుఁ జెంది నదియే గావలయును.

క. ముదివిటులు విధవలంజెలు
పదకవితలు ఘాఱుబాసబాపనవాళ్లే

చదువని పండితవర్యులు
కదనార్భటి[1]వీరవరులు కడిదిపురమునన్.

కడిదిపురమున (ఇదికణుదూరగునేమో ?) ముదుసలులు విటులు. లంజెరికమునకుఁ బాల్పడువారు విధవలు. పదములే కవిత్వము. బ్రాహ్మణులందఱు నపభ్రంశము మాటాడువారు. చదువులేనివారే పండితప్రకాండులు. యుద్ధములో నార్భటిచూపించువారే వీరవరులు. ఆపురమునం దిట్టివిపరీత సామగ్రియంతయు జతగూడియుండె ననినాఁడు. ఈపద్యములోఁ బేర్కొన్నవిషయము లన్నియు శ్రీనాథున కనభిమతమైనవిగఁ గానవచ్చుచున్నవి. పదకవితలకు ముదివిటులతో సామ్య మిందుఁ జూపట్టుచున్నది. మాఱుబాసబాపనివార లనఁగా తెలుఁగుగాక కర్ణాటభాషనో, లేక యపభ్రంశమో మాటాడువా రని యనుకొనఁ దగును. ఈకడిదిపురము పలనాటిసీమలోనిదైనను, కడపమండలములోనిదైనను నచట పదకవిత్వమే యానాఁ డుండినట్టులు దెలియవచ్చును. పదకవిత్వ మనిన శ్రీనాథున కసద్భావమే యుండినట్టు లీపద్యమునుబట్టి తెలియవచ్చును. అట్టి స్థితిలో శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్రము రచియించె ననుట యెట్టులు పొసఁగునో ? యెఱుఁగరాకున్నది. శ్రీనాథునకు సద్భావము గలిగిననాఁడు భీమమండలి నొకస్వర్గఖండముగఁ జిత్రించినాఁడు. మఱి యీపలనాఁటిసీమనో జుగుప్సాకరముగఁ

---

1. కదనార్భక వీరభటులు.

జిత్రించి పెట్టినాఁడు. ఈశ్రీనాథుడే యాపలనాఁటివీర చరిత్ర మును రచియించె ననుట యేపాటియుఁ బొసఁగని విషయము.

ఈక్రిందిపద్యము రాచవీటిలోని బలిజెవధూటిని వర్ణించినది.

చ. పసగల ముద్దుమోవి బిగిచన్నుల గుబ్బలు మందహాసముల్
నొసట విభూతిరేఖయుఁ బునుంగున తావి మిటారిచూపులున్
రసికులు మేలు మేలు బళిరా యని మెచ్చఁగ రాచవీటిలోఁ
బసిఁడిసలాకవంటి యొకబల్జెవధూటిని గంటి వేడుకన్.

అందమైన ముద్దులుగులికెడి పెదవి, బిగువైన గుండ్రనైన యురోజములు, చిఱునగవు, ఫాలమున విభూతిరేఖ, బునుఁగు పరిమళము, విలాసములు గలచూపులు, రసికుల మెప్పును బడయఁజాలిన బంగారుకణికవంటి యొకబలిజెవనితను జూచితిని. ఈపద్యము శ్రీనాథునిగాఁ దోఁపదు. రసికులు మేలు బళి యని మెచ్చుకొనుట కనువైన సౌందర్యరేఖాచిత్రణ మీపద్యమునం దేదియు లేదు. నొసట విభూతిరేఖ కలదని శ్రీనాథున కీపద్యము నంకితముచేసియున్నారు. కాని దీనిలోఁ గవిత్వాంశ మేదియుఁ గానరాదు.

ఈక్రిందిచాటువు కడపమండలమునకుఁ జెందిన కుందుగడ్డను గూర్చినది.

గీ. మందశాద్రిసములు మానవు లందఱు
చందమామకూన లిందుముఖులు
కుందులేని మౌక్తికంబులు జొన్నలు
కుందనంపుబెడ్డ కుందుగడ్డ.

బంగారుగడ్డ యైన కుందుగడ్డ యనుగ్రామమున మనుజు లందఱు మందరపర్వతముఁ బోలినవారు. ఉన్నతు లనుట. స్త్రీలందఱు చందమామబిడ్డలే. జొన్నలు మాలిన్యము లేని ముత్తెములు. ముత్తెముల పోలిక చెప్పుటచే నివి తెల్లజొన్నలు. మౌక్తికథావళ్యము తెల్లజొన్నలకు పొసఁగి యుండును. పలనాటిసీమ కావలనుండిన యీకుందుగడ్డను గూర్చి కొంతసద్భావమునే వ్యక్తముచేసియున్నాఁడు.

మసరరాజ్యముమీఁదఁ జెప్పిన చాటువులు—

ఈమసరరాజ్యము వినుకొండసీమకు సన్నిహితమై యుండఁబోలును. లేక కడపమండలమునకు సమీపమునం దేని యుండనోపును.

ఉ. గొంగడి మేలుపచ్ఛడము కుంపటి నల్లలు కుక్కిమంచముల్
జెంగట వాయుతైలము లజీర్ణపుమందులు నుల్లిపాయలున్
ముంగిట వంటకట్టెయలమోపులు దోమలు చీఱపోతులున్
రంగ! వివేకి కీమసరరాజ్యము కాఁపుర మెంత కోఁతరా.

ఈమసరరాజ్యమునందు వసించెడివారికి గొంగళియే మేలయిన యుత్తరీయము. క్రిందఁ గుంపటి మీఁద నల్లులు గల కుక్కిమంచము. దానికి దగ్గఱనే వాతరోగశాంతి కుపయోగించుతైలములు, అజీర్ణపుమందులు, ఉల్లుల్లిపాయలు ముందఱ వంటకట్టెలమోపులు నుండును. దోమలు చీఱపోతులును గొల్లలు. వివేకముగలవాని కీమసరరాజ్యములో కాఁపురము చేయుట యెంత యసహ్యమో! శుచిత్వములేని దేశమనిన శ్రీనాథుని కెంత యేని రోఁత.

ఈక్రిందిపద్యముకూడ మసరరాజ్యముమీఁదఁ జెప్పినదియే.

ఉ. వంకరపాగలుఁ నడుము వంగిన కత్తులు మైలకోకలున్
సంకటిముద్దలున్ జనుపశాకములుం బులుపచ్చడంబులున్
బెంకగు నోరచూపులును దేఁకువదప్పిన యాసబాసలుఁ
రంకుల బ్రహ్మ యీమసరరాజ్యము నెట్లు సృజించెనో కదా!

వంకర తలపాగలును, మధ్యమున వంగిన కత్తులు మాసినకట్టుబట్టలు రాగులపిండితోఁ దయారు చేసినవంట కపుముద్దలు, జనుపాకుకూరలు (గోంగూరకు జనుపా కనుట) మలినమైన దుప్పట్లు భయముతోఁ గూడిన యోరచూపులు, నేర్పులేని యాసమాటలు గల మనుజులతోఁ గూడిన యీ మసరాజ్యము నావికారియైన బ్రహ్మ యెట్లు సృజించెనో కదా!

రేనాఁటినిగూర్చినదీచాటువు—

క. గరళము మ్రింగితి ననుచుం
బురహర! గర్వింపఁబోకు పో పో పో నీ
బిరు దింక గానవచ్చెడి
మెఱపెడి రేనాఁటి జొన్న మెతుకులు తినుమీ!

ఇది శ్రీనాథునిరచన గాదు. దీనిలోఁ బసదన మేమియు లేదు. ఇంతటి కక్కుఱితిపద్యమును శ్రీనాథుఁడు రచింపఁ జాలఁడు. దీనిని బోలినదే యీక్రిందిపద్యముకూడ. కుతూహలపరు లాతనిదిగాఁ గూర్చిపెట్టినదే గాని వేఱొండు గాదు.

గీ. కాలకంధర! యీశాన! గరళకంఠ
విసము మెసవినఁ గలుగు నక్కసటు వోవ
కొమ్మ మేడూరికమ్మ చకోరనేత్ర
పనిగొనఁగరాదె? యల యొంటి పనసతొలను.

పాదపూరణమాత్రార్థకపదములతో నశ్లీలార్థస్ఫోరకమైన యిట్టిపద్యమును శ్రీనాథుఁడు కూర్పఁజాలఁడు. 'పనస తొనవంటి...చుంబనము గొనుము' అను వికృతపాఠము గూడ నాల్గవపాదమున దీని కేర్పడియున్నది. ఇతరుల కూర్పులకే పాఠాంతరములు కన్పడుచున్నవి.

శబరకాంతలు —

క. గిటగిట నగు నెన్నడుములు
పుటపుటనగు చన్నుఁగవలు పున్నమ నెలతోఁ
జిటపొట లాడెడు మొగములు
కటితటములకొమరు శబరకాంతల కమరున్.

సూక్ష్మమై యందమైన నడుములు, పిటపిటలాడు పాలిండ్లు, పూర్ణచంద్రునితోఁ గలహించు ముఖములు, పిఱుఁదులయందము శబరజాతివనితల కమరును. మధురమైన దృశ్యమును సహజముగఁ జిత్రించు కవితాశిల్పమున కీపద్యము మంచి యుదాహరణము.

చేలపై వ్రాలినపిట్టలఁ గొట్టుటకై వడిసెల చేతఁ బూని మంచె యెక్కెడి వనిత—

చ. విడిబడి పిట్ట లేఁగి యట బిట్టున వ్రాలినయంతలోనఁ దా
వడిసెల చేతఁ బట్టుకొని వట్రువగుబ్బలఁ బైఁట జారఁగా

నడుము వడఁకఁగాఁ బిఱుఁదు నాట్యముసేయఁగఁ గొప్పు వీడఁగా
దొడదొడ మంచె యెక్కె నొక దొడ్డమిటారపు రెడ్డికూఁతురున్
(దడదడ మంచ మెక్కె నొక దొడ్డమిటారపుఁ గాఁపుకూఁతురున్.)
(కమ్మకూఁతురున్. పా.)

'పిట్ట లేఁగి' యనుచోట 'నిట్ట వేగి' యను పాఠము గలదు. కాని యీపాఠమున నర్థము పొసఁగునట్లు గానరాదు. వరుసగా వచ్చిన పిట్టలు విడిపోయి చేనిమీఁద తటాలున వ్రాలినంతలోఁ దాను వడిసెల చేతఁ బూని, గుండ్రనైన గుబ్బలమీఁది పైఁట చెఱఁగు జాఱిపోఁగా, నడుము వణఁకాడఁగా, పిఱుఁదు నాట్యముసేయఁగా, కొప్పు విడిపోఁగా అందమైన యొక రెడ్డికూఁతురు త్వరత్వరగా మంచె (అరప) యెక్కెను. జొన్నచేలు మొదలగువానిలోఁ బిట్టలఁ జోపువనికి కన్నెలు వడిసెల చేతఁ బట్టుకొని మంచెపై నెక్కి రొదసేయుచుఁ దోలుచుందురు. ఈదృశ్యము రెడ్డికాఁపుపడుచుల సౌందర్యము నభివ్యక్తము చేసినది.

శ్రీనాథుఁ డొకప్పుడు ప్రథమరజస్వలాగృహమునకు భుజింపఁ బోవలసిరాఁగాఁ జెప్పిన పద్యము.

ఉ. దుష్పరివారశూన్యగతితోఁ మెఱుఁ[illegible]చిత్రోల్లస
త్పుష్పశరాసనక్రియయుఁ బొల్పెసరారి మనోహరంబునా
పుష్పసుగంధ్యనంగగృహపుణ్యమున న్భుజియింపఁ గల్గె నా
స్తోష్పతి కెన్ని యున్న సరితూఁగినవే యొకశోభనంబుతోఁ జా.

1. నిట్టవేగి, 2. నడలు.

శాస్త్రోక్తపద్ధతిని వివాహితులైన దంపతులకు శుభ దివసమునఁ బ్రథమసమాగమము జరుగుటను శోభన మని యందురు. ప్రాచీనమైన యార్ష సంప్రదాయానుసారముగఁ బ్రథమరజస్వలానంతరమున నీశోభనము జరుగును. నేఁటికి వివాహాదిమంగళకృత్యములందు బ్రాహ్మణులయిండ్ల శ్రోత్రియులకు బందుగులకు తృప్తికరమైన భోజనములు పెట్టుటయు నొకపరిపాటిగా నున్నది. అట్టియదనున శ్రీనాథున కెచటనో బంధుగృహమునందే యిట్టిభోజనము చేయవలసిన స్థితి యేర్పడియుండ వినోదమునకై యీపద్యము సంతరించి యుండును. ఉద్దండుఁడైనకవి యేవిషయమునైనను ప్రౌఢిగను హేలగను జిత్రింపఁజాలును. ఆక్రమముననే యీపద్యము సాగినది. నూత్నదంపతులకు ప్రథమసమాగమరూపమయిన యిట్టిశోభనము ఊహాతీతమైన సౌఖ్యము నొదవించు విభవము. ఇంద్రవిభవము దానిముందేపాటియుఁ గాదు. అభిలాషకృతవిప్రలంభావసానమునఁ బ్రణయతపస్వులైన నూత్న దంపతులకుఁ బ్రథమసమాగమమునఁ గలిగెడి యానంద సందోహ మనుభవైకవేద్యము. తన్మూలముగఁ దనకు భోజనము లభించె నని చమత్కరించియున్నాఁడు.

పెక్కుప్రతులలో నీపద్య మిట్టులే గానవచ్చినది. ఈపాఠములో జుగుప్సావహమైన పదసంయోజన మంతగ లేనేలేదు. ఈపద్యమునకే జుగుప్సావహమైన యీక్రిందిపాఠ మేర్పడినది.

ఉ. గోప్యతరూపమై మిగుల కోమలమై గణుతింపరానిదై
శప్పవిహీనమై నునుపు చాలఁగఁ గల్గి ద్రవం బపారమై
పుష్పిణియైన నీభగము పుణ్యమునన్ భుజియింపఁ గల్గె వా
స్తోష్పతి కైన నోద్రవిడసుందరి నిన్ను వచింప శక్యమే?

శ్రీనాథునినోట నింతటి జుగుప్సాకరమైన పద్యము వెలువడు నని యూహించుట సాహసవిషయము. వ్యంగ్య మహిమచేఁ జమత్కారజనకమై సౌందర్యసమున్మీలకమైన వస్తువిన్యాసము గావించుటయే యాతనిరచనకుఁ గలప్రత్యే కత. ఆతఁడు పరిహాసశీలి కాకపోలేదు. కుతూహలపరులు శ్రీనాథున కెట్టిరచన నంటఁగట్టఁ జూచెదరో, యనుట కీద్వితీయపాఠమే నిదర్శనము. పరిహాసరచనయందుసైత మాతనిరచనలో నుదాత్తత లేకుండ నుండదు.

రాజమహేంద్రపట్టణములో తార్కికులైన విద్వాం సులు తన్నెదిరియో యవమానింపఁగా, వారు గావించెడి శాస్త్రచర్చ నవహసించుచుఁ జెప్పిన దీక్రిందిపద్యము.

శా. హంసీయానకుఁ గామి కయ్యధరరోమాళు ల్నభఃపుష్పముల్
సంసారద్రుమమూలపల్లవగుళుచ్ఛంబైన యచ్చోటు వి
ద్వాంసు ల్రాజేంద్రమహేంద్రపట్టణమున స్థర్మాసనం బుండి ప్ర
ధ్వంసాభావము ప్రాగభావ మనుచుం దర్కింతు రశ్రాంతమున్.

హంసగమనయగు కామినికి కాముకునకు అధోరోమ ములు ఆకాశకుసుమములు. అభావ రూపములు. కాముకీ కాముకవ్యాపారమునందు వానిపరిగణన మేపాటియు నుం డదు. సంసారమను వృక్షమునకు మూలమగు చిగురుజొంప

మైన యాతాపునం దేర్పడిన యభావము ప్రాగభావమా ? లేక ప్రధ్వంసాభావమా ? యని తార్కికవిద్వాంసులు ధర్మాసనము దీర్చి అవిచ్ఛిన్నముగాఁ దర్కింతురఁట. ముందుగ లేకుండుటచే నగు అభావమా ? లేక పుట్టి నశించుటచే నగు అభావమా? యని చర్చింతురఁట. తర్కించుటవలన వచ్చెడి ప్రయోజన మేమియు లేనిచోట తెలివి లేకుండఁ దర్కింతురని పరిహాసము. వారి తర్కశాస్త్రపాండిత్య మస్థానమున వినియోగపడుచున్న దని భావము. శ్రీనాథుని శృంగార భావానుప్రవేశ మింతప్రౌఢముగను జటిలముగ నుండుననుట కీచాటు వొక నిదర్శనము.

ఈక్రిందిపద్యము వైదికక్రియాపరతంత్రులగు విప్రులను బరిహసించుతీరులో నడచినది. రాజమహేంద్రవరమునకు శ్రీనాథుఁ డేతెంచినపు డచటి వేదశాస్త్రవేత్తలగు విద్వాంసు లీతనిపై నపవాద మారోపింపఁగాఁ దత్ప్రతివచనమున కీరచన యుపక్రాంతమైనట్టులు తోఁచును.

మ. శ్రుతి శాస్త్ర స్మృతు లభ్యసించుకొని విప్రుం డంత నానాధ్వర
ప్రతుఁడై పోయి కనుఁ బురందరపురారామద్రుమానల్ప క
ల్పతరుప్రాంత కుడుంగ సుఖసుప్తప్రాప్త రంభాభగ
ప్రతిరోమాంకుర పాటనక్రమ కళాపాండిత్య శౌండీర్యముఁ.

వేదములు వ్యాకరణాదిశాస్త్రములు ధర్మశాస్త్రములు నభ్యసించిన బ్రాహ్మణుఁడు వివిధములయిన యాగములను నిష్ఠతో నెఱపి, యటుపిమ్మట స్వర్లోకమున కేఁగి,

నందనవనములోఁ గల్పవృక్షములనీడ రంభాసంభోగసుఖము నందఁ గలుగు నని తెలుపుటను, వక్రోక్తిభంగిని జుగుప్సాకర ముగ నామె యధోరోమములు పెఱుకు పాండిత్యప్రకర్షము నార్జించు ననినాఁడు.

రాజమహేంద్రవరమున యాగపరతంత్రులైన శ్రోత్రియు లాతని ప్రవృత్తినిగూర్చి విపరీతవిమర్శనము గావింపఁగా వారికి బదులుచెప్పుతీరులో నీరచన యింత కఠోరముగా సాగియుండవచ్చును. అంతియగాని వేదోక్తయాగక్రియలం దాతనికి వైరస్య మేపాటియు లేదను విషయము నకు "గోదావరీపుణ్యాగ్రహారపరంపరా భూనిలింపసంసత్సంపాదితాధ్వరక్రియా సమాహూత పురుహూతాదిదేవతా కదంబ సంబాధసంచరితంబు" అను భీమేశ్వరపురాణవచనము నిదర్శనము. తనమీఁదికి శ్రోత్రియుల యొత్తిడి యధికమైనపు డాడలు మండి చెప్పినపద్యముగా నిది గానవచ్చుచున్నది. ఈపద్యమున కనుకార్యముగా నెట్టాపెగ్గడపద్య మొకటి గలదు. నానాధ్వరవ్రతులకు స్వర్లోకసుఖలబ్ధి సంభావిత మను శ్రౌతధర్మము నీపద్యముసైతము తెలుపుచునే యున్నది.

రాజమహేంద్రవరమునకుఁ జెందినదియే యీక్రింది పద్యము శ్రీనాథుని చాటువుగా కూచిమంచితిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహము మున్నగా లక్షణగ్రంథములలోఁ గల దని ప్రభాకరశాస్త్రిగారు క్రీడాభిరామముపీఠికలోఁ

తెలిపియున్నారు. కూచిమంచితిమ్మకవిలక్షణగ్రంథములోని చాలవిషయములు వ్యత్యస్తములుగా నున్నవి. 'ఘాటీఘోటకకోటిఘట్టనమిళత్' ఇత్యాదిచాటువును హరవిలాసములోని దనినాఁడు. 'రంతు' అనుపదము సాధురేఫమన్నందులకు 'అంగడివీథిఁ బల్లవుల కాసగ' నిత్యాది చాటువును శ్రీనాథునిదిగాఁ బేర్కొనినాఁడు. శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమున "అంతులు మీఱి మిక్కిలిగ జాగతనంబున" ఇత్యాది పద్యమున నీశబ్దము శకటరేఫాదిగనే ప్రయోగించినాఁడు. అట్టిశబ్దమును సాధురేఫముగఁ బ్రయోగించె ననుట కల్ల. తిమ్మకవిపలుకులలో నిట్టి వ్యత్యస్తవిషయము లెన్నియేని చేరినవి. కావున నాతఁడు శ్రీనాథునిచాటుధార యనుటయే కాదనుటకుఁ దార్కాణము. కవిలోకచింతామణిలోఁ గాని బాలబోధఛందస్సులోఁ గాని నీచాటువెచ్చటను గానరాదు. కావున నిది శ్రీనాథుని రచనకాదు.

ఉ. హా! జలజాక్షి! హా! కిసలయాధర! హా! హరిమధ్య! హా! శర
ద్రాజనిభాస్య! హా! ప్రమ[1]దతంత్రకళానిధి! యెందు వోయితే
రాజమహేంద్రవీథిఁ గవిరాజు నను న్గమరించి భర్గకం
ఠాజిర కాలకూటఘుటికాచితమైన యమాసచీకటిన్.

రాజమహేంద్రపురవీథిలో నీశ్వరకంఠమందున్న కాలకూటవిషఘుటికతో సమానమైన యమావాస్యచీకటిలో, కవిరాజయిన శ్రీనాథు నొకసుందరి మోసగించి

---

1. సుగతి.

పోవఁగా నాతఁడు విలపించినట్టు లీపద్యము తెలుపుచున్నది. నిజమున కాసుందరి పద్మనయన పల్లవాధర హరిమధ్య చంద్రవదన సురతకళానిధియై చేఁజిక్కి చీకటిలో మోసగించి పోయినచో శ్రీనాథుఁడు రసికవతంసుఁడుగా నిర్ధారితుఁడైనప్పుడు విలపింప కెట్టు లుండఁగలఁడు ? కాని శ్రీనాథుని ప్రబంధములను సద్భావముతో నిశితముగఁ బరికించినచో, ధార్మికప్రవృత్తి గలవాఁడుగా, ధర్మశాస్త్రోక్తక్రియాసమాచరణనిష్ఠుఁడుగాఁ గానవచ్చునే గాని, ధర్మవిరుద్ధప్రవర్తనము గలవాఁడుగా నేపాటియుఁ జూపట్టఁడు. అట్టి యుత్తమచరిత్రున కీపద్యము నంటఁగట్టుట యెట్టులో, యెఱుఁగరాకున్నది. బాగుగ నూహింప నిది యెవ్వరో యాతని కంటఁగట్టినా రనక తప్పదు. అసభ్యశృంగార మంతయు నాతనిదిగాఁ జెల్లిపోవుచున్నదిగదా ! ఈపద్యము ప్రాఁతవ్రాఁతప్రతులం దెచ్చటను గానరాదు.

ఈజాతికిఁ జెందినదియే యీక్రిందిచాటువుగూడ.

చ. గొఱియల మేఁకపోతులను గొర్రెపొట్టేళ్లను గోడిపుంజులన్
బరిఁబరి వీథులం దిరిగి భక్షణచేసెద వంతె కాని నీ
చరణము లంటి రాని యలనాకలి పైదలి పర్మజావళిన్
బరిగొనలేవు నీవు నొక భైరవమూర్తివె కాళికేశ్వరీ !

గొఱ్ఱెలను మేకపోతులను గొఱ్ఱెపొట్టేళ్లను కోడిపుంజులను వీథులలోఁదిరిగి మాటిమాటికి భక్షించుటయే కాని, నీపాదములమీఁద నొట్టుపెట్టుకొని వచ్చెద నని తెలిపి,

రానట్టి చాకలివనితను నీవేమియుఁ జేయలేవయితివి. నీవు కూడ నొకభయంకరమూర్తివేనా కాళికేశ్వరి! యని యీ పద్యభావము. మర్మజావళిన్ = అధోరోమసమూహమును. ఈపద్యమే యశ్లీలార్థజుష్టమై యుండ నింతకంటె నసభ్యమైన పాఠ మొకటి యీపద్యమున కేర్పడినది. కనుఁ డాలీరు.

చ. గొటియల మేఁకపోతులను గొమ్ముపొట్లను గావ్రగొంను వీ
వరయఁగ గండె కాడఁ దగ వత్తు నటంచు భనచ్ఛిరంబుపైఁ
గర మిడి పోయినట్టి తిలఘాతకురాలి తదీయ... ముల్
పెఱుకఁగ లేవు నీవు నొకభీకరమూర్తివె కాళికేశ్వరీ!

ఈపద్యమునఁ బునరుక్తిదోషము గలదు. గొటియలు గొఱ్ఱెపోట్లు అని వాడుట. రేఫశకటరేఫ ప్రాససాంకర్యము. ఇట్టి యనుచితము నశ్లీలము నగురచన సేయుట శ్రీనాథునకుఁ జేఁతనయిన పని గాదు. పరిహాసరచనాకుశలు రెవ్వరో శ్రీనాథున కీపద్యము నతికించి పెట్టినారు.

శ్రీనాథునిరచనలోఁ జిత్తాకర్షకమైన సౌందర్యసృష్టి కల దనుకారణమున, శృంగారభావ మేపాటి కంటఁబడినను నది శ్రీనాథునిరచనగాఁ దీర్చ్బపరిపాటిలో నీక్రిందిపద్యములుకూడ నాతని పరము లైపోయినవి.

మ. కవిత ల్చెప్పినఁ బాడనేర్చిన వృథా కష్టంబె యీభోగఘం
జవరాండ్రే కద భాగ్యశాలినులు పుస్తం బేల పో పోకకా
సవరంగా సొగ సిచ్చి మేల్ యువతివేషం బిచ్చి పుట్టింతువే
నెవరుణ్ మెచ్చి ధనంబు లిచ్చెదరు గాదే పాపపుం దైవమా!

చ. విటకరపీడనాదిపరివేదనఁ గోడి శరీరజన్మమహా
త్పుటమున వ్రాలి పోవఁగను బోవఁగఁ బోవఁగ నాఁపఁ గాంచి య
చ్చొటఁ బటుదీర్ఘదండహతిఁ బొప్పుడు స్వైర మటంచుఁ దప్పినన్
దటుకునఁ బోక నిల్చినవిధంబున నుండెఁ గుచంబు లింతికిన్.

చ. సరసుఁడు గాఁడొ? జాణ; రతిసంపద లేదా? సమృద్ధి; రూపమో
మరుని జయించు; మోహ మసమానమె; యిన్నియుఁ గల్గి జారుపై
తిరిగెద వేల? బాల! యతిధీరవు ప్రౌఢవు నీ వెఱుంగవే?
నెఱగృహమేధి యన్నలుకు నీచము దోఁచెఁ గొలం తదే సుమీ!

సీ. సొగసుకీల్జడదాన సోగకన్నులదాన
   వజ్రాలవంటి పల్వరుసదాన
బంగారుజిగిదాన పటువుగుబ్బలదాన
   నయమైన యొయ్యారినడలదాన
తోరంపుఁగటిదాన తొడలనిగ్గులదాన
   పిడికిట నడఁగు నెన్నడుముదాన
తళుకుఁజెక్కులదాన జెళుకుముక్కరదాన
   సింగాణి కనుబొమచెలువుదాన

మేలిమిపసిండి రవకడియాలదాన
మించి పోనేల రత్నాలమించుదాన
తిరిగి చూడవె ముత్యాలసరులదాన
చేరి మాటాడు చెంగావిచీరదాన!

క. కుంకుమ లేదో మృగమద
పంకము లేదో పటీరపాంసువు లేదో
సంకుమదము లేదో యశు
భంకరమగు భస్మ మేల బాలా! నీకున్.

ఈక్రిందిచాటువులు శ్రీనాథునివిగనే గన్పట్టును.

ఉ. గ్రామము చేత నుండి పరికల్పితధాన్యము నింట నుండి శ్రీ
రామకటాక్షవీక్షణపరంపర చేఁ గడతేఱెఁ గాక మా
రామయమంత్రి భోజనపరాక్రమ మేమని చెప్పవచ్చు నా
స్వామి యెఱుంగుఁ దత్కబళచాతురి తాళఫలప్రమాణమున్.

ఇది చక్కని సరసమైన పరిహాసము. దీనిలోఁ జెవికిఁ గాని మనస్సునకు గాని యెడబరమైన శబ్దములకూర్పు లేదు. శ్రీనాథునిచాటువు లేతీరుగ సాగునో, యనుట కీపద్య మొక యాదర్శప్రాయమైనది. దీనిలోఁ గల్పనాచమత్కారము గలదు.

శ్రీనాథునిచాటువులలో మేల్తరములనఁ జాలినవి యాతనితుదిరచనలుగా గణింపఁబడునవి, చారిత్రకాంశసమన్వితములైనవి యీక్రింది రెండుసీసపద్యములు.

సీ. కవిరాజుకంఠంబు కౌఁగిలించెను గదా!
పురవీథి నెదురెండ పొగడదండ
యాంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ
దగిలి యుండెనుగదా! నిగళయుగము
వీరభద్రారెడ్డివిద్వాంసు ముంజేతఁ
వియ్యమందెను గదా! వెదురుగొడియ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా!
నగరివాకిట నుండు నల్లగుండు
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలు పెసలు

బొడ్డుపల్లెను గొడ్డేటి బోగపోతి
నెట్లు చెల్లింతుఁ దంకంబు లేదునూగ్లు.

సీ. కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయఁ డిచ్చు
రంభఁ గూడెఁ దెలుంగురాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వనిపంక్తిఁ గలదు
కైలాసగిరిఁ బండె మైలారవిభుఁ డేఁగి
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు

భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్ట మనుచు
దివిజకవివరుగుండియ ల్దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.

శ్రీనాథునిచాటువులలోఁ జరిత్రకు సహాకరించుచాటువులుకూడఁ బెక్కులు గలవు. అట్టి చాటువులందుసైతము నాతఁడు ప్రబంధములందుఁ బాటించినశైలినే పాటించినాఁడు. శబ్దసంయోజనముకూడ నట్టిదే. వానిలోఁ గొన్ని యాతని చరిత్రమును జిత్రించుట కుపకరించునవి. మఱికొన్ని యానాఁటి ప్రభువులచరిత్రమును, మఱికొన్ని యాతనినాఁటి దేశ చరిత్రమును దీర్చిదిద్దుట కుపకరించుచున్నవి. 'దీనారటంకాల' 'పంపావిరూపాక్ష' 'కుల్లాయించితి' 'అంగడియూర లేదు' ఇత్యాదు లావిషయములకు నిదర్శనములు. ఈజాతికిఁ జెందినవియే అల్లయవేమారెడ్డినిగూర్చి కూర్చిన చాటు

వులు గొన్ని కలవు. వానిలో నీక్రిందిచాటువు వేముని శౌర్యాటోపమును, ఆతఁడు సాధించిన దుర్గవిజయములను దెలుపునది.

సీ. దండయాత్రాఘోషతమ్మటధ్వనులచే
        గంతులువేయించెఁ గప్పకొండ
    కితవ కాలాభీలకీలానలము చేత
        నేలపాం గడఁగించెఁ బాలకొండ
    అరట్టజాఘట్టహయఘట్టములచేత
        మట్టి తూర్పెత్తించెఁ బొట్టునూరు
    భూరిప్రతాపాగ్నిఁ బుటములు పెట్టించె
        విద్వేషులను గశా(కాశి)వెండిపురము
    అనఁగ నుతికెక్కితౌర! శైలాదిరాయ!
    అరుల పండువ మండువా యవనహరణ!
    ఒళియ దూళియ మాళువ బందికార
    విజయరఘురామ! అల్లాడవిభుని వేమ!

భీమేశ్వరపురాణమునందుఁగాని కాశీఖండమునఁగాని అల్లయవేమారెడ్డిఘనతను వర్ణింపవలసివచ్చినపట్టులం దెల్ల నాతఁడు సాధించినవిజయములనే పేర్కొనుచువచ్చినాఁడు. ఆక్రమమే యీచాటువునందును బాటింపఁబడినది. కాశీఖండమునందు వేమారెడ్డి విజయధాటీపద్ధతిని వర్ణించినతీరు పరికింపుఁడు.

సీ. సప్తమాడియరాయచంద్రబింబాననా
        చికురవల్లరులపైఁ జిన్నిపువ్వు
    ఝూడెజంతుర్నాటి జననాథశుద్ధాంత
        కుచకుంభములమీఁది కుంకుమంబు

బారుహాదొంతిభూపాల లీలావతీ
గండస్థలంబులఁ గలికినవ్వు
కలువపల్లొడ్డాది కటకాధిపతివధూ
సీమంతవీథులఁ జేరుచుక్క
యల్లాడాధీశు వేమక్షమానాథునాగ్రజుం
భూరినిస్తురథాటీవిహారచటుల
సైన్యనాసీరతుర్యారశఖపుటోత్థ
వింధ్యపార్శ్వవసుంధరావిపులధూళి.

ఈపద్యమున కెనయైన శైలిలో నీక్రిందిచాటువు సాఁగినది. కనుఁడు.

సీ. ఖండేందుమౌళిపైఁ గలహంసపాళిపైఁ
గర్పూరపూళిపైఁ గాలుద్రవ్వు
మిన్నేటితెలిపై మించుతామరలపై
మహిమంచుమురులపై మల్లరించు
జంభారిగజముపైఁ జంద్రికారజముపైఁ
జందనధ్వజముపైఁ జౌకళించు
ముత్యాలసరులపై మొల్లక్రొవ్విరులపై
ముదికల్పతరువుపై మోహరించు
కొండిమలయెక్కి శేషాహి వెన్నుదన్ని
తోడరి దుగ్ధాబ్ధితరఁగలతోడ నడరి
చెలఁగినంబాడి నీకీర్తి నిండె నహహా!
విజయరఘురామ! యల్లాడవిభుని వేమ!

కేవల మాప్రభువద్యునికీర్తివిభవమును వర్ణించుటకుపక్రాంతమైన యీచాటుపద్యమునందుసైతము సరస కవితాచమత్కారమును వెల్లివిరియఁజేసిన శ్రీనాథుని ప్రతిభా

వ్యుత్పత్తుల నేపాటివైన నవగతముచేసికొనఁజూచిన సహృదయులకు, అశ్లీలాకరములైన చాటువులు శ్రీనాథవిరచితములు గావను సమ్యగ్భావము తప్పక పొడనూపఁగల దనియే నాభావన.

ఈ క్రిందిపద్యములు శ్రీనాథునిచాటువులుగా క్రీడాభిరామము పీఠికలోని కవతరించినవి గాని, యివి శ్రీనాథుని రచనలు గానేరవు. వీనిలోఁ గవిత్వాంశము లేదు. కుతూహలపరులు గూర్చి పెట్టినవియే. కొన్ని లక్షణగ్రంథములలో నిట్టియసభ్యరచనలు కొన్ని శ్రీనాథున కంటఁగట్టఁబడియున్నవి. సహృదయులైనవారు వానిని శ్రీనాథునిరచనలుగా లెక్కింప లేరని నానిశ్చయము. ఆపద్యముల యారంభమును మాత్రమే యిటఁ దెలిపి వదలెదను.

1. గుబ్బలగొమ్మ లేఁజిగురుఁగొమ్మ సువర్ణపుఁగీలుబొమ్మ
2. కూటమి నొక్కనాఁటికిఁ ద్రికోణసహస్రములక్
3. మాపటి కొండవీటికసుమాలపుఁదొత్తుల
4. సడిగల వంటుగుంటకులసంభవ వేంకటయజ్వ
5. ఇంగల మంచు వచ్చి యడిదయే నని క్రొత్తమసాని మ్రొక్కఁగాఁ
6. జంగమురాలిఁ బట్టి యొకజంగము వంగఁగఁ బెట్టి
7. ఊలిమిడిచెక్కయుక్ మిగులనుక్కయు చప్పనిరొట్టిముక్కయున్.
8. తెలికలమిండఁగీఁ డొకఁడు తియ్యనినూనెకు

ఇత్యాదిపద్యము లయినవి కానివి గూడ శ్రీనాథుని రచనలుగా గణించుటవలన శ్రీనాథునిశృంగారినిగా రూపించుట వలనుపడినది. తన్మూలముగ శ్రీనాథునిరచనలయెడ

నేర్పడిన యసద్భావమును దొలఁగించుకొని, యాతనిచాటువు లందుఁ జూపట్టు మధురసుందరదృశ్యములను బరికించి, భావుకులు సద్భావసమన్వితు లగుదురుగాత మని సవినయముగ నాంధ్రపాఠకలోకమున కంజలించువాఁడ.

ఈక్రిందిసీసమున కవిత్వాంశము జతపడియున్నది. శయ్యాసౌభాగ్యము పొందుపడియున్నది. ఇది శ్రీనాథునిరచనయే గావచ్చును.

శ్రీరస్తు భవదంఘ్రిచికురంబులకు మహా
    భూర్యబ్దములు సితాంభోజనయన!
వరకాంతి రస్తు తావకనఖముఖముల
    కాచంద్రతారకం బబ్జవదన!
మహిమాస్తు నీకటిమధ్యంబులకు మన్ను
    మిన్ను గలన్నాళ్లు మించుబోఁడి
విజయోస్తు నీగానవీక్షల కానీల
    కంఠహారిస్థాయిగా లతాంగి
కుశల మస్తు లసచ్ఛాతకుంభకుంభ
జంభభిత్కుంభికుంభాభిజృంభమాణ
భూరిభవదీయవక్షోజములకు మేరు
మందరము లుండుపర్యంత మిందువదన!

---